

# 'చతుర' హరివిల్లు

జీవితం రంగుల హరివిల్లు, ఆ రంగులు అనేకం. ఆనందం, విషాదం, ప్రేమ, ద్వేషం, ఆవేదన, అనురాగం, ఆగ్రహం అన్నింటి సమ్మేళనం జీవితం. ఈ అనంత జీవన వైరుధ్యాలకు అద్దం పట్టే ఆధునిక రచనా ప్రక్రియ నవల.

నెలనెలా ఒక అత్యుత్తమ నవలను సర్వ సమగ్రంగా, సర్వాంగసుందరంగా మీకు అందజేసే వినూతన ప్రయోగం ఈ 'చతుర'. అందరికీ అందుబాటులో సాధ్యమైనంత తక్కువ ధరలో అందించాలనేది మా లక్ష్యం.

ఈ ప్రయోగాన్ని ఫలవంతం చేయటం మీ వంతు.



# చతుర

ప్రారంభ సంచిక ఫిబ్రవరి 1978
సంపుటి : 1 సంచిక : 1

---

తెలుగు నవలాభిమానులకు నెల నెలా ఒక పూర్తి నవలను అందించేందుకై అవతరిస్తున్న 'చతుర' తొలి కానుక

# కమలమ్మ కమతం

'ఊరుమ్మడి బ్రతుకులు' ను కథగా, నాటకంగా, చలన చిత్రంగా మలిచి ప్రశంసల నందుకున్న

# సి. యస్. రావు

రచన

---

**ముఖపత్రం:**

రాజపుత్ర శైలిలో ప్రపంచ ప్రసిద్ధమైన వర్ణచిత్రం 'రాధా మాధవులు'

**ఎవరి పేజీ చిత్రం:**

శిల్పకళకు జగద్విఖ్యాతినందిన ఖజురహో ఆలయం.

---

**చతుర**
'ఈనాడు' కాంపౌండ్
సోమాజిగూడ, హైదరాబాద్–500 004

రామాలయం అరుగుమీద పేకాట ముమ్మరంగా సాగుతోంది. పేక లోంచి ముక్క గుంజుకొని చేతిలోని ముక్కల్లో పెట్టుకున్నాడు మునసబు.

"ఆ వచ్చిన ముక్కేమిటో కాస్త గుర్తుంచుకో" అన్నాడు ప్రెసిడెంటు.

"ఆ ముక్క గుర్తెందుకుండదూ ? కమలమ్మొచ్చింది" అన్నాడు మునసబు.

"అదేవిటండీ, బాబు ! కళ్ళల్లో వొత్తులు వేసుకు చూసినా కనబడని కమలమ్మ పేకలోకి ఏలా వచ్చిందండీ?" అన్నాడు ఆచారి.

"అది కాదు లేవయ్యా ...! నిన్న రాత్రి మందు మీదున్నప్పుడు కమలమ్మకో కొత్త పేరెట్టేడు ... మునసబు'' అన్నాడు ప్రెసిడెంటు

"ఏవిటీ, ఏమిటా పేరు?'' అనడిగాడు ఆచారి కళ్లు పెద్దవి చేసి ...

"అరకు రాణి'' అని మునసబు ముక్తసరి సమాధానం.

"అమ్మమ్మమ్మా ... ఇన్నాళ్ళుబట్టీ నేను దోరజామ పండూ దోర జామ పండూ అని లొట్టలేస్తున్నాను గానీ ఇంత చక్కటి పేరు నాకు తట్టలేదు సుమా ! అరకు రాణి ... గొప్ప సౌందర్యో పాసకుడివయ్యా మునసబు గారూ!!'' అని అభినందించేడు ఆచారి.

"పళ్లు కదిలిపోయిన వాడివి కదా... నువ్వేం చేసుకుంటావయ్యా, దోర జామ పండుని...కొరగ్గలవా? మిణగ్గలవా??" అన్నాడు ప్రెసిడెంటు కొంటెగా.

మునసబు విరగబడి నవ్వాడు.

"కొరక లేక పోతే — కళ్ళారా చూస్తూ బంతాడుకుంటాను. కొరగ్గలిగిన మీకు మాత్రం దక్కింది కనకనా ఆ దోర జామ పండు!?" అని ఉటక్కరించేడు ఆచారి.

"అదీ నిజమేనయ్యా, మొగుడు పోయి అయిదేళ్ళయింది... పలకమారిన బంగినిపల్లి పండులా ఉన్న మనిషి మగోడవసరం లేకుండా ఎలా ఉందంటావ్ ? రాత్రిళ్ళు ఎలా గిడుస్తున్నాయంటావ్ ?'' అన్నాడు మునసబు.

"అయ్యా! గుట్టుగా వ్యవహారం సాగిపోతున్నపుడు మీ లాంటి మగాళ్ళ అవసరం ఆవిడ కేమిటీ ?" అన్నాడు ఆచారి.

"బాగా చెప్పేవు. రాముడు గాడుండగా కమలమ్మకి మన్తోటి ఏం పనీ ?'' అన్నాడు ప్రెసిడెంటు చుట్ట ముట్టించుకుంటూ.

"దీన్సిగ దరగ... యవ్వారం ఆ పక్కనించి సాగి పోతోందన్నమాట...! నాకి ఆలోచనే రాలేదు సుమా ? ఏదో కూలోడనుకున్నాను కాని ఆ రాముడు గాడు యవ్వారం చక్క పెట్టేస్తున్నాడనుకోలేదు. అయితే అడినో కంట మనం చూసుకోవలసిందే !" అన్నాడు మునసబు.

—రామాలయం అరుగు మీద, దైవసాన్నిధ్యంలో ముగ్గురు పెద్దలమధ్య జరుగుతున్న సంభాషణ అది...

* * *

చిన్నేటి ఒడ్డున ఒక ఊరు. ఆ ఊరి పేరు రామన్నపాలెం. రామన్న పాలెం నడి బొడ్డున ఒక గుడి. ఆ గుళ్లో ఒక దేవుడు. ఆ దేవుడి పేరు రాముడు. ఆ రామాలయం అరుగు మీదకి రోజూ మూడు ఉత్సవ విగ్రహాలు చేరుతాయి. ఆ మూడూ ఆ వూరికి ప్రాణం ఉన్న గ్రహాలు. ప్రెసిడెంటు, మునసబు, పూజారి. వాళ్ళకి పేర్లున్నాయి, కాని సాధారణంగా ప్రెసిడెంటునీ, మునసబునీ ఎవరూ పేరు పెట్టి పిలవరు. ఒక వేళ ఎవరైనా పేరు పెట్టి పిలిస్తే వాళ్ళకి కోపం కూడా. పూజారిని మాత్రం 'ఆచారి' అని కొందరు, 'పూజారి' అని కొందరు పిలుస్తారు. ఊళ్ళో అందరి గొడవా వాళ్ళకే కావాలి. వాళ్ళని ఎవరూ ఎదిరించరు. ఏ దారి తొక్కయినా పైకి రావడం అనేది వాళ్ళ ధ్యేయం. నిరంతర తాపత్రయం. అలా అన్చెప్పి ఆ గ్రామానికి వాళ్ళు ముగ్గురూ సింహాలు కారు. ప్రెసిడెంటు పెద్ద పులి. మునసబు ఎలుగు బంటి. పూజారి గుంటనక్క. నేలమీద బతికే ఈ మూడు జంతువులూ ఆకాశంలో ఎగిరే ఒక అందాల బంగారు చిలకకి వల పన్న డానికి తహతహ లాడుతున్నాయి. ఆ చిలక నివాసం ఆ ఊళ్ళోనే ఉన్న రెండు మండువాల పెద్ద లోగిలి. ఆ చిలక పేరు కమలమ్మ. గోరువంక కన్ను మూశాక వంటరిదైంది. వంటరిదైనా పెద్ద పులినీ, ఎలుగుబంటినీ, నక్కనీ చేరనివ్వలేదు. వాళ్ళని చూసి భయపడ లేదు. వాళ్ళ వలలో చిక్కలేదు. అలా తల ఎత్తుకొని చిలక తిరగడానికి కారణం—రాముడి అండేనని ఆముగ్గురు గ్రహాలకూ నమ్మకం.

* * *

ఆరోజు ఉగాది పండుగ. రైతాంగానికీ రైతాంగం దగ్గర ఏటి పొడుగునా పని చేసే పాలేర్లకూ కూడా అది పండుగ రోజు. ఏటి పట్టున ఉన్న ఆ వూళ్ళోని రైతాంగం ఆ రోజును సంవత్సరాది అనీ, పని పాట్లు చేసుకొనే రైతు కూలీ జనం కొత్తామాస అనీ అంటారు. తెల్లవారు ఝామే రాముడు నూగిట్లోని ముందు మండువాలోకి వచ్చి కవాచీ బల్లమీదున్న విత్తనాల బుట్టను దింపి నేలమీద పెట్టాడు. మేకుకి వేలాడు తూన్న కొత్త పగ్గాన్ని భుజానికి తగిలించుకొని, ఒక మూలన జారవేసి ఉన్న కొత్త చేతికర్రను తీసుకొన్నాడు. ఇంతలో ఈ అలికిడికి వెనక మండువాలోంచి కమలమ్మ వచ్చి రాముడి హడావుడి చూసి—"అప్పుడే ఎక్కడ తెల్లవారిందిరా నీకూ?" అంది, వస్తూన్న ఆవలింతను ఆపుకొంటూ.

నేలమీద పెట్టిన విత్తనాల బుట్టను నెత్తిన పెట్టుకొంటూ "అదేటండి, అలాగంటారూ? ఈయాల కొత్తామాస గందా, ఏరువాక సాగడానికెళ్ళొద్దూ? కొబ్బరికాయొటిప్పించండి. మల్లీ యాల మించిపోద్ది" అన్నాడు రాముడు.

కమలమ్మ నవ్వుకొని "ముందా సామాను కిందెట్టు" అంది.

"ఎందుకండీ?" అన్నాడు రాముడు సామాను కింద పెట్టకుండానే.

కమలమ్మ రాముడి ప్రశ్నకు సమాధానం చెప్పకుండా "ఎదురు ప్రశ్నలు వెయ్యక నాతో రారా" అని వెనక మండువాని చేరి ఉన్న తన పడగ్గదిలోకి వెళ్ళిపోయింది.

చేతిలోని కర్రను గోడకు చేరవేసి, భుజాన ఉన్న పలుపుతాడు కవాచీ బల్ల మీద ఉన్న కందులబస్తా మీద పడేసి, నెత్తిమీద బుట్టను దింపుకొని బల్లమీద పెట్టి, కమలమ్మ ఆదేశానుసారం వెనక మండువాలోకి వెళ్ళి ఆమె పడగ్గదిముందు నిలబడ్డాడు.

"లోపలికి రారా" అంది కమలమ్మ.

పడగ్గదిలోకి అడుగుపెట్టాడు రాముడు. అప్పటికే బీరువా తెరిచి చేతిలోకి తీసుకొన్న కొత్త బట్టల్ని రాముడికి అందిస్తూ "ముందివి కట్టుకుని తరవాత ఏరువాక సాగడానికి వెళ్ళు" అంది కమలమ్మ.

రాముడి మొహం చేటంత అయింది. లైటు వెలుగులో ఆ కొత్త బట్టలను చూసే సరికి వాడి కళ్ళు జిగేల్మన్నాయి. ఒక్క క్షణం బట్టల్ని పరకాయించి, కమలమ్మ ముఖంలోకి చూశాడు. కమలమ్మ "కట్టుకోరా" అంది చిరునవ్వుతో

"అది కాదండీ. ఇయ్యి అన్నయ్యగారికి తెప్పించిన బట్టలేమోనని" నసిగాడు.

"కాదురా. నీకోసం తెప్పించేనివి. ముందుగా అవి కట్టుకొని నాక్కనిపించు తరవాతే ఏరువాక" అంది కమలమ్మ బీరువా తాళం వేస్తూ.

"గ్లాస్కో మల్లు పంచీ, సిల్కు జుబ్బా నాకెందుకండీ ? ఇప్పుడు సీకట్ళంచే— కట్టుకునెళ్ళి పోతాను గాని, ఎలుగొచ్చాక, పొలంనుంచి తిరిగి వచ్చేటప్పుడు నాను సిగ్గేసేత్తదండీ ..." అన్నాడు రాముడు అమాయకంగా సిగ్గుపడుతూ.

కమలమ్మకు నవ్వాగలేదు.

"నువ్వెక్కడ వెర్రి మాలోకానివిరా? మంచిబట్టలు కట్టుకోడానికి సిగ్గెందుకూ?" అంది.

"ఏటో — నన్ను బలే ఇబ్బంది పెట్టేత్తన్నారండి మీరు ... నేత పంచీ, బనీనూ తొడుక్కునే వోడికి ఈ సన్న బట్టలు కట్టుకొని ఊళ్ళో తిరగటమంటే— ఎలా ఉంటదో మీకేం తెలుసూ ? నేను పాలేరోణ్ణి గందా ... ఈ కామందుల బట్టలు నాకెందుకండీ!" అన్నాడు రాముడు, ఆమెకు ఎలాగైనా నచ్చ చెప్పాలని.

"ఏడిసేవ్‌లే. నువ్వు పాలేరువాడివా? ఈ కమలమ్మ కమతానికి ఉద్ధారుడివి. ధాన్యం మిల్లుకి బేరమివ్వడానికి వెళ్తూ ఉంటావు. మిల్లుకు వెళ్ళి డబ్బు తెస్తూ ఉంటావ్. షుగర్ ఫేక్టరీకి లారీల మీద చెరుకు తోలించి, అక్కణ్ణించి డబ్బు తెస్తూ ఉంటావ్ ... ముతక బట్టలు కట్టుకుని తిరిగితే ఏం బాగుంటుందిరా? చూసే జనం ఏమనుకొంటారు? నేను పిసినారినని అనుకోరూ ? వెళ్ళి త్వరగా బట్టలు మార్చుకొనిరా",

"ఏటోనండి. మా మామ్మ మాట

లయితే ఇట్టే ఎదురు సెప్పేత్తాను గానీ మీ మాటకు ఎదురు సెప్పలేను. సరే," అని గదిలోంచి బైటికి వచ్చి ముందు మండువాలో బట్టలు మార్చుకొన్నాడు రాముడు. తిరిగి కమలమ్మ పడగ్గది ముందుకు వెళ్ళాడు. కమలమ్మను పిలిచాడు. లోపలికి రమ్మంది. వాడిని పైనుంచి కిందికి చూసి నవ్వుకుని "అదేం కట్టుకోడంరా? అలా మోకాళ్లపైకి కట్టుకున్నావ్ శుభ్రంగా నాలుగు కొంగులూ కిందకి దిగేలా కట్టుకోవచ్చుగా!" అంది కమలమ్మ.

ఈ లోపునే రాముడు ఆమె పాదాలకు నమస్కరించడానికి వంగేడు కమలమ్మ రెండడుగులు వెనక్కి వేసి "లే...లే...వెధవచాదస్తం నువ్వూనూ... ఇకనుంచీ నువ్వు ఇలాంటి బట్టలే కట్టుకోవాలి... వెళ్ళిరా!" అంది.

రాముడు కావలసిన పరికరాలన్నీ తీసుకుని ఏరువాక సాగడానికి పొలానికి బయల్దేరాడు. వాడి వెనకనే వాణ్ణి పరకాయిస్తూ వీధి గుమ్మందాకా వచ్చింది కమలమ్మ. వాడు వెళ్ళిపోయాక తలుపు వేసుకుంది. తిరిగి వెళ్ళి మంచం మీద పడుకొంది.

రాముడు పెద్దవాడు అయ్యేడు. నేను కాపరానికి వచ్చేసరికే రెండు బస్తాల గింజల జీతానికి దూడల్ని కాయడానికి కమతంలో చేరేడు. నేను కాపరానికి వచ్చి అప్పుడే ఎనిమిదేళ్ళయింది ... అంటే రాముడి కిప్పుడు ఇరవై యేళ్లు. ఈరకత్తిలాఉన్నాడు. కష్టపడి పొలంపని చేసేవాడు కావడంతో శరీరం కండలు తిరిగి ఎక్కడ ఉండాల్సిన పుష్టి అక్కడ కలిగి చూడముచ్చటగా ఉన్నాడు. రాత్రీ పగలూ అన్న తేడా లేకుండా ఒళ్లు దాచుకోకుండా పని చేస్తాడు. వాడికి మాత్రం ఎవరున్నారు? తల్లీ దండ్రీ చిన్నప్పుడే పోయేరు. అమ్మమ్మ పెంపకంలో పెరుగుతున్నాడు, వాడికి ఆ ముసల్దీ ... ఆ ముసల్దానికి వాడూ...! అందుకే ఈ కమలాన్నే నమ్ముకొని ఎంతో నిజాయితీగా పని చేస్తున్నాడు. వేల రూపాయలు వాడి చేతి మీద వ్యవసాయానికి ఖర్చు పెడతాడు. వేల రూపాయిల మీద వ్యవసాయం రాబడి ఏటా నా దోసిట్లో పోస్తున్నాడు. ఆ మాటకు వస్తే వాడికి ఎవరున్నారు ... అని అనుకుంటున్నానే కాని ... నాకు మాత్రం ఎవరు ఉన్నారు? మూడు పువ్వులూ ఆరు కాయలుగా సాగుతున్నటువంటి జీవితం పెళ్లయిన అయిదేళ్లకే నిర్జీవమైపోయింది. ఊరికి చక్రవర్తి లాంటి 'ఆయన' అకస్మాత్తుగా కన్ను మూశారు. వారి జ్ఞాపకంగా నాకు మిగిలింది ఒకపసివాడు.... అరవై ఎకరాల వ్యవసాయం...ఆ పసివాణ్ణి పెంచి పెద్దచేసి ఈ ఆస్తిని వాడికి అప్పచెప్పే బాధ్యత ... నా బాధ్యత నెరవేర్చడానికి నాకు దొరికిన ఆధారం రాముడొక్కడే...!

-ఇలా ఏమేమో ఆలోచించుకుంటూ మళ్ళీ నిద్రపోయింది కమలమ్మ...

* * *

బాగా వెలుగొచ్చేక మెలకువ వచ్చింది ... ముందు మండువాకి చేర్చి

ఉన్న ఓ గదిలోంచి నరసింహంలేచి మండువాలోకి వచ్చాడు. నరసింహం కమలమ్మ అన్నగారు. కమలమ్మ భర్త పోయిన తర్వాత ఆమె ఆస్తిమీద అజమాయిషీ చేయడానికని వచ్చాడు. తనకున్న ఆస్తి ఏనాడో, తన అలవాట్లకీ అవసరాలకీ అరాయించుకుపోయింది. అతనికి ధైర్యం చేసి ఎవ్వరూ పిల్లనిచ్చే వాళ్ళు కూడా లేనప్పుడు చెల్లెలు నీడకు చేరాడు. అవకాశం అలా వచ్చింది. వచ్చిన ఏడాదికే అతని మీద చెల్లెలుక్కూడా నమ్మకం పోయింది. అయినా తోడబుట్టిన వాడన్న మమకారాన్ని చంపుకోలేక కమలమ్మ పట్టెడన్నం పెట్టి, అవసరానికి పదీ పరకా ఇస్తుంది. భరిస్తూంది.

వీధి గుమ్మంలో ముగ్గులేసి పని మనిషి చుక్కమ్మ ముగ్గు బుట్ట పట్టుకొని లోపలికి వస్తోంది. మండువాలో కూర్చున్న నరసింహం "ఇవాళ సంవత్సరాదనుకొంటాను. ఏరువాకా సాగడానికి ఎవరెళ్ళేరే పొలానికి" అన్నాడు చుక్కమ్మని ఉద్దేశించి.

"రాముడెళ్ళి నట్టున్నాడండి ... " అంది చుక్కమ్మ.

కమలమ్మ చుక్కమ్మను పిలిచి "వ్యవసాయం గొడవలు రాముడు చూసుకుంటాడని చెప్పు. తలంటుపోసుకొని కావలిస్తే కొత్త బట్టలు కట్టుకోమను" అంది అన్నగారికి వినబడేలా.

నరసింహం ఆ మాటలు విని "కొత్త బట్టల్తో బాటు ఓ వంద కూడా ఇమ్మను. పండగ పూటా చేతులు ముడుచుకొని ఏం కూర్చుంటాం? ప్రెసిడెంటుగారింటి కెళ్ళి కాసేపు పేకేనా ఆడుకొనివస్తాను" అన్నాడు చెల్లెలు కమలమ్మకి వినబడేలా.

కమలమ్మ మాట్లాడలేదు. నరసింహం మొహం కడుక్కొని తలంటు పోసుకున్నాడు. చుక్కమ్మ గదిలోకి తెచ్చిన కొత్త బట్టల్ని కట్టుకున్నాడు. వంద గురించి అడగాలనుకున్నాడు. తీరా జేబులో చేతులు పెట్టేసరికి చేతికేదో కాయితం తగిలింది. తీసి చూసే వంద కాయితం. గడిచిన రెండేళ్ళబట్టీ కమలమ్మకూ, నరసింహానికీ ముఖాముఖీ మాటలు లేవు. అయినా నరసింహానికేం బాధ లేదు. రోజు గడిస్తే చాలనుకొనే మనిషి. కాకపోతే తనకు నచ్చినట్టు గడవాలి. కమలమ్మ దయవల్ల అలాగేసాగిపోతునాయి రోజులు...



## 2

రాముడు తూర్పు పొలంలో కొత్త నాగలికి, కొత్త గిత్తలజతని కట్టాడు. కొత్త కర్రతో అదిలించి నాలుగు వరసలు దున్నాడు. విత్తనాలు జల్లాడు. గిత్తలు కదలబోయేముందు కాడి మీద కొబ్బరికాయ కొట్టాడు. కాయ సరిగ్గా రెండు చెక్కలయింది. గిత్తల ముఖాలకు పసుపు రాసి, నామం దిద్దేడు. రెండు చేతులూ జోడించి భూదేవికి మొక్కు-

కున్నాడు. బుట్టెడు గింజలు జల్లితే గాదెడు గింజలు ఇవ్వాలని భూదేవిని మనసారా కోరాడు. ఏరువాకసాగడం పూర్తయిన తరవాత, పాడి దూడల దగ్గరికివెళ్ళి లేగ దూడల్ని పలుపులు విప్పి తల్లుల పొదుగుల్లోకి వదిలేశాడు. లేగదూడలు కేరింతలు కొడ్తూ పొదుగుల్ని ముట్టెతో పొడిచి పొడిచి తెల్లని నురగల్ని చిమ్ముతూ పాలు తాగుతున్నాయి. అది చూసిన రాముడికి ఆ రోజు నిజంగా పండగరోజనిపించింది. దూడలు ఓ పక్క - కేరింతలు కొడ్తూ తల్లిపాలు తాగుతూ ఉంటే, మరో పక్క కూర్చుని రాముడు ఆవుల దగ్గరా, గేదెల దగ్గరా కూడా పదేసి ధారలు పాలు పిండి ఇంటికి బయలుదేగాడు.

* * *

సంక్రాంతి తరువాత చెప్పుకోదగ్గ పండుగ ఉగాది.

సంక్రాంతి పండుగ రోజుల్లో తెలుగునాట—ముఖ్యంగా- గ్రామాల్లో ఎవ్వరికీ తిండికి లోటుండదు. పంటలు వచ్చే రోజులు కావడం చేత పని పాట్లు చేసుకు బతికే కూలీ జనానికి కూడా ఆ రోజుల్లో ఇంట్లో గింజలు ఉంటాయి. పుష్కలంగా పనీ ఉంటుంది.

ఆ తరవాత చెప్పుకోదగ్గ పండుగ ఉగాది!

అపరాలు వస్తాయి. వ్యవసాయం పనులు అన్నీ పూర్తయి తిరిగి కొత్త సంవత్సరంలో కొత్త పంటలు పండించ డానికి ఉగాది నాంది. గ్రామంలోని మధ్య తరగతి కుటుంబీకులూ ఆ రోజున వేపపువ్వుపచ్చడి చేసుకుంటారు. ఆపచ్చడిని, ఉదయాన్నే తలంటు పోసుకొని, కొత్త బట్టలు కట్టుకొని అందరూ తింటారు. ఆ తరవాతనే ఏ పని ప్రారంభించినా...!

వేపపువ్వు పచ్చడిదొక చిత్రమయిన రుచి. అది తయారు చెయ్యడం ఒక కళ. ఉదయాన్నే ఏపుగా విరగబూసిన వేపచెట్టు ఎక్కి పనివాళ్లు వేపపువ్వు గుత్తులను తుంపుకొచ్చి ఇంటి యజమానులకు ఇస్తారు. పనివాళ్లు లేనివారు స్వయంగానే కోసుకుంటారు. ఆ వేపపువ్వును ఆడవాళ్లు గోనె సంచి మీదకు దూచి అరచేత్తో బాగా నలుపుతారు. అలా నలిగిన వేపపువ్వును బియ్యం జల్లెడలో పోసి జల్లిస్తారు. మొగ్గా, ఈనెలూ జల్లెట్లో ఉండిపోతాయి. సన్నని వేపపువ్వూ, పుప్పొడీ జల్లెట్లోంచి కిందకి రాల్తాయి. అలా కిందకు రాలిన వేపపువ్వును చిక్కని చింతపండు పులుసులో కలుపుతారు.

అంతే కాదు, ఉగాది నాటికి మామిడి చెట్లు కూడా నిండుగా కాపు కాసి ఉంటాయి. అప్పటికింకా టెంక కట్టదు. పులుపు నీరు పోసుకుని జీడితోనే ఉంటాయి. అలాగే చెరకు కూడా ఏపుగా ఎదిగి తీపినీరు పోసుకుని గెడ కడతాయి. అంటే చెరకు గెడ కాస్త నల్లబడుతుంది. చెరకు తోటల పైన చెరకు వెన్నులుగాలికి రెప రెప లాడుతూ ఉంటాయి. ఒక పక్కనుంచి చెరకు కొట్టి కొంత మంది రైతులు ఫ్యాక్టరీకి తోల్తూ ఉంటారు. కొందరు రైతులు చెరకు గానుగ అమర్చి చెరకును ఆడి




**మినీకథ**

# ఆపద్బాంధవుడు

ఉదయం ఎనిమిది గంటలకే. జంబూ కాలనీలో ఉంటున్న అప్పారావుగారింటికి వెళ్ళి ఏవో అర్జంటు కాగితాలిచ్చి రమ్మని వెంకట్రావుకి చెప్పాడు వాళ్ళ మావయ్య. అప్పారావు గారింటి నంబరు సరిగా తెలీక, గుర్తులు చెప్పాడు. కాయితాలు తీసుకుని వెంకట్రావు జంబూ కాలనీకి వచ్చాడు-అది చాలా పెద్ద కాలనీ. అన్నీ కొత్తగా కట్టిన అధునాతనమైనమేడలు. నీటైన సిమెంటు రోడ్లు. కాలనీలో వాళ్ళంతా చాలా భాగ్యవంతులు సుమీ అనుకున్నాడు వెంకట్రావు. అక్కడే తిరిగే ఈగలు, దోమలుకూడా బంగారు రెక్కలతో వుంటాయేమో ననిపించింది

అతనికి. మావయ్య చెప్పిన గుర్తులు ప్రకారం అప్పారావుగారిల్లు వెదకనారంభించాడు. ఇల్లుదొరకలేదు. పట్టుదలగా జాగ్రత్తగా అన్ని వీధులూ తిరిగాడు. అప్పటికీ, కనిపించిన ఇద్దరు ముగ్గురు పెద్ద మనుషుల్ని ఫలానా అప్పారావు గారిల్లెక్కడ అని వాకబు చేశాడు కూడా. ఫలితం శూన్యం. ఓ గడుగ్గాయి తాత గారు "అప్పారావుగారిల్లెక్కడా" అంటే "ఆయన ఇల్లు ఎక్కుతాడో, ఎక్కడో నాకేం తెలుస్తుంది" అని పాత చచ్చు జోక్ విసిరి, తనే నవ్వుకుంటూ వెళ్ళాడు. వెంకట్రావుకి చిర్రెత్తింది.కాళ్ళు నొప్పెడుతున్నాయి. టైమైపోతున్నది. తొమ్మిది దాటితే ఆయన ఆఫీసుకి వెళ్ళిపోతాడు వీటన్నిటినీమించి వెంకట్రావుకి ఓఅర్జంట్ అవసరం ఏర్పడింది. అది, ఒకటికి వళ్ళాల్సిరావటం. ఆ కాలనీ వీధుల్లో ఎక్కడా మూత్రశాలలులేవు. పోనీఎక్కడన్నా "చాటుధార" విడుద్దామంటే, ఆ పోష్ కాలనీ అందుకు అనువుగా లేదు. వెంకట్రావుకి కడుపుబ్బుతోంది. అప్పటికే చాలా సేపట్నుంచిబిగపట్టుకున్నాడు. ఆ కాలనీదాటి మళ్ళీ మురికి టౌన్ లోకి వసేగానీ ఏర్పాట్లులేవు. కానీ చాలా దూరం నడవాలి. ఈ లోపునే...

వెంకట్రావు పరిస్థితి అయోమయంగా తయారయింది. ఎవరైనా పుణ్యాత్ముడు కనిపించి, ఓ వంద రూపాయలు తీసుకునైనాసరే, "బాబూ నీ అవసరం నిర్విఘ్నంగా మా యింట్లో కొచ్చి నెరవేర్చుకో" అని అంటే బాగుండునను కున్నాడు. రాను రాను పరిస్థితి విషమిస్తున్నది. వెంకట్రావుకి ఏమీ పాలుపోవడంలేదు. ఎటునడుస్తున్నాడో తెలీకుండా పడిపోతున్నాడు.

అంతలో "డాక్టర్ గరుడవాహనం. పేథాలజీ లేబరేటరీ. ఇచ్చట రక్తము, కళ్ళె, మలము, మూత్రము, ఇంద్రియము పరీక్ష చేయబడును" అనే బోర్డు కనిపించింది. బోర్డుమీది ఎల్ట్రబల్బు వెలగడం లేదు కానీ, ఆ బోర్డు చూడగానే వెంకట్రావు బుర్రలో వెయ్యి వోల్టుల బల్బు వెలిగింది. వెంటనే డా॥ గరుడ వాహనంగారి పేథాలజీ లేబరేటరీలోకి వెళ్ళాడు. ఇంకా పేషంట్లెవరూ వచ్చినట్లు లేదు. డాక్టరు తీరిగ్గా పేపరు చదువుకుంటూ కూర్చున్నాడు. వెంకట్రావు హడావుడిగా వెళ్ళి "డాక్టర్! అర్జంటుగా మూత్ర పరీక్ష చెయ్యాలి. నేను పదకొండింటికి ఊరికెళ్తున్నాను. ఈలోపలే రిపోర్టు కావాలి..." అన్నాడు బలవంతాన బిగపట్టుకుంటూ. "ఓ. కె. మైబాయ్. మరి స్పెసిమన్ తెచ్చావా?" అని అడిగాడు డాక్టరు. లేదండీ... ఇక్కడే..." నసిగాడు వెంకట్రావు. "నోనో...ఉదయమే మొదటిగా పట్టి తేవాలి" అన్నాడు డాక్టర్. "ఆ సంగతి తెలుసుసార్. ఇదేమొదలు..."అన్నాడు ఆత్రంగా వెంకట్రావు. "ఆల్ రైట్, అదిగో ఆ పక్కనే బాత్‌రూమ్ ఉంది" వెళ్ళు అంటూ చిన్న సీసా చేతికందించాడు డాక్టర్. డాగ్టర్‌కీ, దేవుడికీ కోటి దండాలు పెట్టుకుంటూ బాత్రూమ్ వేపు పరిగెత్తాడు వెంకట్రావు.

**—వై. రామకృష్ణారావు**

బెల్లం వండుతూ ఉంటారు/ కొత్త బెల్లం తయారవుతూ ఉంటుంది. చెరకు పెనంలో, చెరకు రసం మరుగుతూ ఉన్నప్పుడు, ఆ పక్కనుంచి నడిచే వాళ్ళకి తియ్యని వాసన గుబాళిస్తూ ఉంటుంది. వేపపువ్వు పచ్చట్లో చింత పండు పులుసూ, వేపపువ్వే కాకుండా సన్నగా తరిగిన చెరకు ముక్కలూ, పుల్లని కొత్త మామిడికాయ ముక్కలూ, కొత్త బెల్లం కలుపుతారు. అరటిపళ్ళ ముక్కలను కూడా పచ్చట్లో కలుపుతారు.

ఒక రకంగా చెప్పాలంటే వేపపువ్వు పచ్చడి పులుపు, చేదు, తీపి, వగరు లాంటి నవరుచి సమ్మేళనం. మానవ జీవితాలకొక హెచ్చరిక. మనిషి జీవితంలో కూడా ఆశలూ, ఆనందాలూ నవ్వులూ, కులాసాలూ ఉంటాయి. వాటి నీడలా నిరాశలూ విషాదాలూ, కన్నీళ్ళూ వియోగాలూ ఉంటాయి. ఇవన్నీ కలిస్తేనే మనిషి జీవితం. అలాగే వేపపువ్వు పచ్చట్లో కూడా అన్ని రుచులూ ఉంటాయి.

కొత్త సంవత్సరంలో తొలి రోజున ఈ వేపపువ్వు పచ్చడిని తయారు చేసుకొని గ్రామాల్లోని ఆబాల గోపాలం తినడమంటే— "ఓ మనిషీ, జీవితంలో కష్ట సుఖాలు... వేపపువ్వు పచ్చట్లో తీపీ చేదుల్లాగే ఏటి పొడుగునా ఉంటాయి. ముందే దానికి గుర్తుగా కాస్త రుచి చూడు!". అని హెచ్చరిస్తూ మనిషికి అలవాటు చేయడానికే ఈ పచ్చడి అంటారు పెద్దలు.

ఇంత సరంజామా తెచ్చుకుని పచ్చడి తయారు చేసుకోలేని బీదా బిక్కీ కాస్త చింతకాడకు వేపపువ్వు అద్దుకొని నములుతారు. లేదా, కాస్త సాగి ఉన్న ఇంటికి వెళ్ళి పచ్చడి, అడిగయినా తింటారు.

ఆ రోజునే రైతాంగం దగ్గర పని చేసే పాలేర్లకు జీతాలు పెంచడం, కొత్త బట్టలు ఇవ్వడం కూడా జరుగుతుంది. కొందరు రైతులు పాత పాలేర్లను తీసేసి, కొత్త వాళ్లను పెట్టుకుంటారు. సాధారణంగా రైతాంగానికి ఆ రోజు ఏరువాక పండుగ. ఏరువాక అంటే కొత్త నాగలికి, గిత్తలను పూన్చి నూతన సంవత్సరంలో కొత్త వ్యవసాయానికి అంకురార్పణ చేయడం. కొన్ని కుటుంబాలకు ఇది ఆనవాయితీ కాదు. అలాంటి వాళ్లు ఏరువాక సాగరు. ఆనవాయితీ ఉండి ఏరువాక సాగినవాళ్లు ఆ రోజున ఎవ్వరికీ ఏమీ ఇవ్వరు. ఎవరి దగ్గర్నుంచీ ఏమీ తీసుకోరు. ఆఖరికి చుట్టని కూడా కాల్చరు. ఇది వ్యవసాయదారులకు మాత్రమే పరిమితం. దుకాణదారులూ, వ్యాపారస్తులూ మామూలుగానే తమ తమ పని పాట్లు చేసుకుంటారు. అమ్మకాలూ, కొనడాలూ జరుగుతాయి.

ఈ ఆచారం చూసి పూజారి అప్పలాచారికి 'ఇంత ఆచారం ఉన్న జనం, రైతాంగం దేవుడి ప్రసాదం ఎందుకు తీసుకుంటారు? పంచాంగ శ్రవణం తరవాత అక్షింతలు ఎందుకు వేసుకుంటారు?' అనిపిస్తూ ఉంటుంది.

* * * *

ఆచారి ఆ రోజు ఉదయాన్నే వేపపువ్వు

పచ్చడి తిని అరుగుమీద కూర్చున్నాడు. లోపల ఆచారి భార్య నాంచారమ్మ వంట పన్లో ఉంది.

అమ్మవారికి నైవేద్యం పెట్టడానికి గారెలు వండుతోంది. బైటకి కమ్మని వాసన వస్తోంది. ఆ రోజున గ్రామ దేవతకి అందరూ నైవేద్యాలు పెడ్తారు అలా పెడితే ఆటలమ్మ, మశూచి, కలరా, ఫొంగు వంటి వ్యాధులు రావని జనం నమ్మకం. ఈరోగాలకు గ్రామాల్లో మరో పేరు అమ్మవార్లే!

అలా అమ్మవారికి పెట్టిన నైవేద్యం ఇంటి చాకలికి ఇచ్చేస్తారు. ఆచారిగారి చాకలి మంగి. అరుగుమీద కూర్చున్న ఆచారి ముందుకు మంగి వచ్చి "ఇంకా గుడికాడికి ఎల్లలేదేటి" అని పలకరించింది కాస్త వయ్యారంగా.

ఆచారి నోటినిండా నవ్వుతూ "నీ శకునానికి బయల్దేరదామని ఆగేను!" అన్నాడు, లోపలున్న నాంచారమ్మకు వినబడకుండా.

కాస్త గొంతు పెద్దది చేసి "అమ్మగారూ. కాతంత యేప్పువ్వు పచ్చడి పెట్టించరూ?" అనరిచింది మంగి—లోపలున్న నాంచారమ్మకు వినబడేలా.

నాంచారమ్మ లోపట్నుంచే "నేను మడి కట్టుకున్నానే... నేనలా బైటికి వస్తే పొయ్యిమీద నూనె మరిగిపోతుంది. అరుగుమీద అయ్యగారుంటారూ... పెట్టమనడుగు." అని బదులు పలికింది.

ఆచారి నవ్వుతూ లేచి లోపలికి వెళ్ళాడు. ఓ గిన్నె నిండా వేపపువ్వు పచ్చడి తెచ్చి "పచ్చడి చక్కగా కుదిరిందే... నీసరసవంత తియ్యగా ఉంది." అని లోపలికి తొంగి చూసి – భార్య వంట పనిలో మునిగి ఉందని నిర్ధారణ చేసుకొన్నాడు.

"ఊరు మాటు మణిగేక గుడి వెనకనున్న బిళ్ళ గన్నేరు చెట్టు దగ్గరికి రా. ఓ ముఖ్య విషయం మాట్లాడాలి." అని గుస గుసలాడేడు మంగి చెవిలో.

"పండుగ పూటా ఏట్నండీ...? అంది మంగి కాస్త చిరుకోపం-నటిస్తూ.

ఆచారి "నీ దుంప తెగ నువ్వలా మూతి ముడిస్తే పట్టపగలే వెన్నెలని పిస్తుందే నాకు! పండగ కదా... పండుగ చేసుకుందాం రా !! రాత్రికి..." అన్నాడు వెకిలిగా నవ్వుతూ.

లోపలనుంచి నాంచారమ్మ "నిన్న ఒక దుప్పటి అట్టే పెట్టుకుంది మంగి. తెమ్మనండి!" అని అరిచింది.

ఆ అరుపుకి ఆచారి ఉలిక్కిపడ్డాడు. ఆచారి భయం చూసి మంగి నవ్వుకుంది.

'వస్తా' అన్నట్టు చూసి మంగి బయలు దేరింది.

ఆచారి 'రాత్రికి రావడం మర్చిపోకు' అని మంగిని హెచ్చరించి "నేనలా గుడి దగ్గరికి వెళ్ళొస్తాను" అని నాంచారమ్మకు వినబడేలా చెప్పి– మంగి వెనకే బయలు దేరాడు.

* * *

రాముడు పాలచెంబు పట్టుకొని, మరో చేత కొత్త కర్రతో రాజవీధిని నడుస్తున్నాడు. వీధిలోని జనం తననీ, తన కొత్తబట్టల్నీ చూస్తున్నట్టనిపించింది రాముడికి. తల

వొంచుకొని కాస్త వేగంగా నడవ సాగాడు. రామాలయం దగ్గరికి చేరుకున్నాడు. రామాలయం అరుగు మీద అప్పటికే ఏరువాక కార్యక్రమం ముగించుకొని ప్రెసిడెంటు వెంకటయ్య మునసబు, రంగారావు కూర్చున్నారు. పూజారి అప్పలాచారి పూజ ముగించి వాళ్ళిద్దరికీ ప్రసాదం ఇచ్చాడు. ఇద్దరూ ప్రసాదం తీసుకొని, కళ్ళకద్దుకొని నోట్లో వేసుకున్నారు.

ప్రెసిడెంటు— "ఇదిగో ఆచారీ, నువ్వయితే రోజూలాగే ప్రసాదం పెట్టేవు. కాని రోజూలా మమ్మల్ని పేకాట్లో కూర్చున్న దగ్గర్నించీ అగ్గిపెట్టె అడగొద్దూ, ఈ రోజుకి అరువు పొడొద్దు. ఏరువాకసాగేం. ఏరువాకసాగిన్నాడు... అగ్గిపెట్టె ఎవరికీ ఇవ్వకూడదు – చుట్ట నిప్పివ్వకూడదు–" అన్నాడు.

"ఒకటేటి, ఏదీ ఇవ్వకూడదు! నువ్వడక్కూడదు" అన్నాడు మునసబు ఆచారితో.

"ఏదో నాకు కొత్తయినట్టు చెప్తున్నారేమిటండీ! నేను ఏరువాక సాగకపోతే మటుకు, ఏరువాకంటే నాకు తెలియదా, వ్యవసాయమంటే తెలియదా? తమతో బాటు నేనూ ఈ ఊళ్ళో పుట్టిపెరిగిన వాణ్ణేగా!" అన్నాడు నవ్వుతూ ఆచారి.

ఇంతలో – రాముడక్కడికి చేరుకున్నాడు. ఆ ఉత్సవవిగ్రహాలు మూడూ అక్కడ లేకపోతే, మూల విగ్రహం ముందు, రోడ్డుమీద నిలబడే ఓ దండం పెట్టి సాగిపోయేవాడు...వాళ్ళ ముగ్గుర్నీ గుడి అరుగు మీద చూడ్డంతో—వాళ్ల ముందు నుంచి నడవడానికి రాముడు కాస్త ఇబ్బంది పడ్డాడు. దానిక్కారణం... ఆవేళ వాడు కట్టుకున్న బట్టలు... వాళ్ల నోరు మంచిది కాకపోవడమే! అయినా తెగించి బెరుకు బెరుకుగానే ముందుకి సాగేడు. పూజారి నోరు ఊరుకోలేదు.

"ఏరా రావుడూ! నీ సిగదరగ... ఇస్ప్పేటు జాకీలాంటిహాడివి అరకురాజులా మెర్సిపోతున్నావు. పెదకామందులా ముస్తాబయ్యేవు, కొన్నాళ్లపోతే, ఈ ఊరి ప్రెసిడెంటుకే పోటీ చేసేలా ఉన్నావ్?" అన్నాడు పూజారి వెకిలిగా నవ్వుతూ.

"ప్రెసిడెంటు అయినా ఆశ్చర్యం లేదూ... అరవై ఎకరాల సేరీ మీద పెత్తనం... ఆ కమలమ్మ గారికి ఈడి మీద కొండంత నమ్మకం!" అన్నాడు మునసబు రంగారావు.

"సాల్లెండో! ఊరకుక్కకి మెడలో పటకా కట్టినంత మాత్రాన్ని జాతికుక్క అయిపోద్దేటి? కమలమ్మ సరదా పడి కుర్రోడు కదాని... కొత్త కరీదైన బట్టలిచ్చుంటది..." అన్నాడు ప్రెసిడెంటు వెంకటయ్య.

"ఊరకుక్కకి మెడలో పటకా పెడ్తే జాతికుక్క కాదు గాని, జాతికుక్క మెళ్ళో పటకా తీసేస్తే దాన్ని జనం ఊరకుక్కనుకుంటారు" అన్నాడు ఆచారి.

ముగ్గురూ విరగబడి నవ్వుకున్నారు.

రాముడు బదులు చెప్పకుండానే, తల వొంచుకుని కోపాన్ని దిగమింగుకొని వెళ్ళిపోయాడు... ఆ మలుపులో నరసింహం ఎదురుపడ్డాడు. ఒక్కసారి

రాముడిని చూశాడు. వాడు కట్టుకొన్న బట్టలూ, తను కట్టుకొన్న బట్టలూ చూసుకొన్నాడు. 'వీడి తస్సాదియ్యా! కొన్నాళ్లుపోతే... మా కపులమ్మ వ్యవసాయమంతా సొంతం చేసుకునేలా ఉంది వీడి వేషం...!' అనుకున్నాడు. అనుకుని ముందుకు నడిచాడు. గుడి దగ్గరికి చేరుకున్నాడు నరసింహం.

అప్పటికే ఆచారి గుడి అరుగు మీద చాపలు పరచి, పేకాటకి ఏర్పాట్లుచేశాడు. "రావయ్యా, రా! పండగనాడు కూడా ఇంతాలస్యమైతే ఎలాగా?" అన్నాడు ప్రెసిడెంటు నరసింహాన్ని ఆహ్వానిస్తూ.

పేకాట ప్రారంభమైంది.

* * *

పేకాట మంచి రసపట్టులో ఉంది.

ఆచారి పేక బతక్క కొట్టుమిట్టాడుతున్నాడు. అంతలో వెంకన్న వచ్చాడు. వెంకన్న తల నెరిసిన పెద్దవాడు. పండిన తల, నుదుటినిండా నామాలు, గుండెలమీదా, జబ్బలమీదా కూడా దిద్దుకొన్న తిరుచూర్ణపు నామాలు, తెల్లని బుగ్గ మీసాలు... అతన్ని చూస్తే ఆ గ్రామంకట్టుబాట్లకూ,దైవభక్తికీ, సంప్రదాయానికీ చిహ్నంలా అన్పిస్తాడు. అరుగు మీద పేకాడుతున్న ప్రెసిడెంటూ, మునసబూ, ఆచారీ, నరసింహం—అతని రాకను గమనించలేదు. ఆ ఆట రంజు అలాంటిది.

వెంకన్న ఆ నలుగుర్నీ ఒక్క క్షణం చూసి, నలుగుర్లో ఉన్న ఆచారిని గమనించి "ఏమండీ ఆచారిగారూ! ఇంకా పంచాంగ పఠనం మొదలెట్టరా? పండగపూటా పేకాటేమిటయ్యా?" అన్నాడు మందలింపుగా. అతని గొంతు సింహగర్జనలా ఉంటుంది. ఆ గర్జనకు ఆచారి తన చేతిలో ముక్కలని చటుక్కున పేకలో కలిపేసి 'అమ్మయ్య కొంటు తప్పింది' అనుకున్నాడు మనసులో.

"వచ్చేస్తున్నానండి. పూజ ముగించుకోగానే ఎందుకో ప్రెసిడెంటుగారు పిలుస్తే ఇటొచ్చి పక్కన కూర్చున్నాను. మీదే ఆలస్యం... మీ రొచ్చేశారుగా పంచాంగ పఠనం ప్రారంభిద్దాం. రండి ప్రెసిడెంటుగారూ...!" అనేసి, పంచె గోచీ బిగించుకుంటూ నవ్వు ముఖంతో వెంకన్న దగ్గరికి వెళ్లాడు.

వెంకన్న తన చేతిలోని పళ్లేన్ని ఆచారికి అందించాడు. పళ్లెంలో పంచాంగ పఠనం చెయ్యబోయే ఆచారికి కొత్త బట్టలూ, పచ్చని అక్షింతలూ, తాంబూలం ఉన్నాయి. అవి చూసిన ఆచారి మొహం చాటంత అయింది.

"పంచాంగం తెచ్చేరా?" అన్నాడు వెంకన్న ఆచారితో.

"వారం క్రితమే తెచ్చాను. గుడికి వచ్చేటప్పుడు వెంట తెచ్చి మన రాముల వారి దగ్గర ఉంచాను" అన్నాడు.

వెంకన్న ధ్వజస్తంభం మెట్లమీదా, గుడికి ఎదురుగా ఉన్న చింత చెట్టు దుంగలమీదా, అక్కడక్కడకూర్చున్న రైతుల నుద్దేశించి "రండయ్యా! గుడి అరుగుమీదికి...ఈ యేడు పంటలెలా ఉంటాయో, వర్షాలు ఎలా ఉంటాయో విందాం!" అన్నాడు.

రైతులు నెమ్మదిగా గుడి అరుగు

మీదికి చేరుకున్నారు. వెంకన్న కూర్చుంటూ "నీ పద్ధతి కాస్త మార్చుకోవాలయ్యా ఆచారిగారూ...మీ తాతగారిలాగా, తండ్రిగారిలాగా ఉండాలి గానీ, ఈ జులాయి వేషాలేమిటయ్యా? పేకాటలూ, చీటికీ మాటికీ పట్నం వెళ్ళి సినేమాలు చూడ్డం, క్రాపింగులూ, నీలాంటి గుళ్లో పూజారికి తగవయ్యా! పూజారంటే నిష్టగా ఉండాలి. పూజారిని చూస్తే దేవుణ్ణి చూసినట్టన్పించాలి. నీలాంటి పూజార్ల మూలంగానే జనానికి భక్తి తగ్గిపోతూంది, దేవుళ్ళమీద నమ్మకవూం పోతూంది" అన్నాడు.

పూజారి మారుమాట్లాడలేదు. "చిత్తం. పంచాంగ పఠనం ప్రారంభిద్దాం! ఈ సంవత్సరం వర్షాలు బాగానే ఉంటాయి... గ్రహణాలు రెండు... ఒకటి సూర్యగ్రహణం. రెండోది చంద్రగ్రహణం. నువ్వుల పంట తక్కువ... ధాన్యం పంట ఎక్కువ... గాలికి మారాలు మెండు...యుద్ధాలు వచ్చే అపకాశం ఉంది...కలిపురుషుడి రాక అలా ఉంది మరి...పశుసంపద బాగానే ఉంటుంది... అయ్యా... అదీ సంగతీ! ఇక మీ సంవత్సర ఫలం చెప్తాను... వే,వో,వా,వే—వెంకన్న కదూ మీ పేరు? మేష రాశి. మీకు ఆదాయం ఆరు. ఖర్చు ఎనిమిది. ఆరోగ్యం బాగుంటుంది. ఇక పోతే పుణ్యకార్యాలు చేస్తారు. అవమానం తొమ్మిది. గౌరవం పదకొండు. పెద్దలు...మిమ్మల్ని ఎవరవమానిస్తారు?" అన్నాడు ఆచారి.

"మధ్యలో నీ వ్యాఖ్యానం ఎందుకులే అందులో ఉన్నది చదివితే చాలు! మా బావ సుబ్బన్నదీ, లక్ష్మయ్యదీ, వీరన్న చౌదరిదీ, కోటయ్య కాపుదీ కూడా ఎలా ఉందో చెప్పండి సంవత్సరఫలం !" అన్నాడు వెంకన్న.

ఇంకా పేకాడుతూనే ఉన్న ప్రెసిడెంటు "నా జాతకం చూడవయ్యా ఆచార్లూ" అన్నాడు.

"ఆఁ. చూస్తా. పేరు వెంకటయ్య. వెంకటయ్య జాతకం కూడా వెంకన్న జాతకంలాగే ఉంటుంది. దానికంటే మీ పేరు వెంకటయ్యే అయినప్పటికీ, అందరూ మిమ్మల్ని ప్రెసిడెంటుగారనే పిలుస్తారు కాబట్టి— ప్రెసిడెంటు పేరుమీద ఎలా ఉంటుందో చూస్తాను..." అన్నాడు ఆచారి.

"సరే అలాగే కానీ!" అన్నాడు ప్రెసిడెంటు.

"పాపోపేపెం...ఆఁ...వృషభం... అయ్యా మీరు వృషభం! వృషభం అంటే ఎద్దు. ఎద్దు రాశికి...ఆదాయం ఎనిమిది. ఖర్చు పదకొండు."

"అవును మరి రాజకీయాల్లో ఉన్న వాడికి ఖర్చెక్కువే" అన్నాడు ప్రెసిడెంటు.

"ఆదాయం ఉన్నా లెక్కలోకి రాదుగా " అన్నాడు మునసబు.

"కౌంట్ అయ్యిందయ్యా! సంవత్సర ఫలం ఇప్పుడే రైటైంది. ఖర్చు పదకొండు రైటే...!" అన్నాడు ప్రెసిడెంటు నవ్వుతూ.

ఆచారి "అయ్యా ఇంక అవమానం... అవమానం పది. గౌరవం పది." అన్నాడు.

"అదీ రైటే! రాజకీయాల్లో ఉన్న వాళ్ళకి తిట్టేవోళ్ళూ, పొగిడే వోళ్లూ సమంగా ఉంటారు," అన్నాడు ప్రెసిడెంటు.

"ఒరే వెంకటయ్యా, పంచాంగం వినేటప్పుడు శ్రద్ధగా వినక, మధ్యలో ఆ పేకాట ఏట్రా? ఊరు పెత్తనం చేసే వోడిలా ఉంటే, ఊరు కట్టుబాటు ఏమి ఉంటుంది? కాస్సేపు ఆట కట్టేసి ఇటు రండి" అన్నాడు వెంకన్న.

"అదుగో అప్పుడే అవమానం మొదలు!! వస్తున్నాను మావాఁ. కాస్సేపు కట్టేయండయ్యా" అని ప్రెసిడెంటు నరసింహాన్నీ, మునసబునీ తీసుకుని రైతుల్లోకి వచ్చి కూర్చున్నాడు. నరసింహం "అందులో లాటరీ టిక్కెట్ల గురించి ఏమన్నా ఉంటుందా ఆచారి గారూ?" అన్నాడు.

జనం అందరూ నవ్వారు.

"ఈ పంచాంగాలు రాసే కాలంనాటికి లాటరీలూ, బ్రాకెట్లూ, గుర్రపందాలూ మనకి లేవండి. అందుకని నొక్కి-పక్కాణించలేదు ఇందులో..." అన్నాడు ఆచారి.

"ఇప్పుడున్నాయిగా!" అన్నాడు మునసబు.

"కాని ఇది రాసినవాళ్ళకి వాటి గురించి తెలియక పోవచ్చు" అన్నాడు ఆచార్లు.

అంతా మళ్ళీ నవ్వుకున్నారు.

అలా ఆచారి ఒక్కొక్క రైతుకీ సంవత్సర ఫలాలు చెపుతున్నాడు. విన్నవాళ్లు వెళ్ళిపోతున్నారు. వెంకన్న మాత్రం ఇంకా కూర్చొనే ఉన్నాడు.

పంచాయితీ బోర్డు హరిజన మెంబరు గంగయ్య "బాబూ, ప్రెసిడెంటు గారూ, ఈ ఏడు నాకెలా ఉంటదో అడగండి, ఆచారి గార్ని" అన్నాడు.

ప్రెసిడెంటు "నీ తస్సదియ్య. నీక్కూడా కావల్సి వచ్చిందా, జాతకం? నీకేంరా...మనది రిజర్వు సీటూ. ఒత్తే ఎమ్మెల్యే టికట్టు కూడా రావచ్చు నీకు... సెప్పవయ్యా ఆచార్లు!" అన్నాడు.

దూరంగా చింతచెట్టుకింద కూర్చున్న హరిజనులు ఆ మాటకి నవ్వుకున్నారు.

వాళ్ళల్లో ఒకడు "మనందరిలోకి గంగయ్య పంచాతీ బోర్డు నెంబరై, కాతంత పెద్దోడయ్యేడు గాబట్టి ఇంకా ఎంతెదిగిపోతానో అనసిగాడు. మనమేం ఎదగంలెండ్రా. మన సేతిలో ఈ కొడవలీ, కర్రా తప్పదు. పంటలు బాగుంటాయన్నాడు...వరసాలుకురుత్తాయన్నాడు సాల్లెండి. పోదాం పదండి!" అని తన వెంట చెట్టుకింద కూర్చున్న హరిజనుల్ని తీసుకు వెళ్ళిపోయాడు.

ఆచార్లు ఎప్పటికి ఈపాడు పంచాంగ పఠనం పూర్తవుతుందా - వెంకన్న వదులుతాడా-కమ్మగా పేకాట మొదలవుతుందా అని ఎదురు చూస్తున్నాడు. మొత్తానికి వెంకన్నకి విసుగువచ్చిందికాబోలు...లేచి వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిన మరుక్షణమే ఇంకా చిన్నా పెద్దా ఏదో అడుగుతున్నా, ఆచార్లు "పంచాంగం మనూళ్ళోనే ఉంటుందయ్యా, ఎప్పుడు కావాలంటే

# మినీకథ




"చూశారా బాబిగాడేం చేశాడో" అంది కమల అప్పుడే ఆఫీసు నుంచి ఇంటికి వచ్చిన భర్తనుద్దేశించి.

"ఏం చేశాడేమిటీ?" అన్నాడు రామకృష్ణ డ్రస్సు మార్చుకుంటూ.

"మధ్యాహ్నం పక్కింటివాళ్ళ బేబీ వీడితో ఆడుకుందామనివస్తే ఇద్దరికీ చెరో రెండు బిస్కట్లూ పెట్టి నేను లోపల పని చూసుకుంటున్నా. పది నిమిషాలు పోయాక బేబీ ఏడవటం మొదలెట్టింది'' అంటూ కమల చెప్తూంటే లుంగీ కట్టుకుంటున్న రామకృష్ణ

"ఏం చేశాడువాడు, కొంప దీసి ఆ అమ్మాయిని కొట్టాడా" అన్నాడు కంగారుగా.

"అబ్బే అది కాదులెండి, దేముడు ఆట ఆడుకుందామని చెప్పి ఆ పిల్లకిచ్చిన బిస్కట్లని వీడికి నైవేద్యం పెట్టమన్నాడుట, వెంటనే నేను దేవుణ్ణి కదా, నాకు నైవేద్యం పెట్టినవి నేనే తినేస్తా అని చెప్పి ఆ రెండు బిస్కట్లూ వీడే తినేశాట్ట" అంది నవ్వుతో.

బాబిగాడు రోజు ఇలాంటి పన్లే ఏదో ఒకటి చేస్తూనే ఉంటాడు. నిండా అయిదేళ్ళు లేకపోయినా ఒట్టి తుంటరిగా తయారయ్యాడు. అసలు ఇదివరకే చెప్పాడు రామకృష్ణ భార్యతో వాడిని స్కూల్లో చేర్పిస్తానని.

"వద్దు బాబూ! నాకేం తోచదు. అయినా అప్పుడే ఏం పెద్ద వయసొచ్చేసిందని గుంట వెధవని స్కూల్లో వేస్తారు?" అని మూతి మూడు వంకర్లు తిప్పడంతో "సరేలే" అని ఆపని వాయిదా వేసాడు అతను.

"ఏడిసినట్టే ఉంది వెధవ పనీ వీడునూ. ఇక ఊరుకొనేది లేదు.

# గడుగ్గాయి

రేపొద్దున్నే కాన్వెంట్‌లో చేర్పించేస్తాను, చదువులో పడితే అల్లరి తగ్గుతుంది'' నిశ్చయంగా అన్నాడు రామకృష్ణ, కాళ్ళు చేతులూ కడుక్కోవడానికి వెళ్తూ.

మొహం తుడుచుకుంటూ వస్తున్న రామకృష్ణని చూసి "నాన్నా, నాన్నా డిష్షుం డిష్షుం సినిమా వచ్చింది వెళ్దాం నాన్నా" అన్నాడు బాబిగాడు, వాణ్ణి దగ్గర కూర్చొ పెట్టుకొని "అలాగేలే, రేపెళదాంరా" అని చెప్పి "ఒరే బాబీ, కాన్వెంటుకి వెళ్తావా రేపట్నుంచి" అన్నాడు లాలనగా.

"ఓ" అన్నాడు బాబిగాడు. కాన్వెంటులో ఎలా ఉండాలో, తోటి పిల్లల్తో ఎలా ప్రవర్తించాలో, టీచర్లపట్ల ఎంత గౌరవంగా మసలుకోవాలో అన్నీ వివరంగా చెప్పాడు రామకృష్ణ. అన్నింటికీ "అలాగే'' అని తలూపాడు బాబిగాడు.

అనుకున్నట్టుగా మర్నాడు ఉదయాన్నే ఆ వీధిలోనే –

ఇంటికి దగ్గరలో ఉన్న కాన్వెంటులో బాబి గాణ్ణి చేర్పించి రామకృష్ణ ఆఫీసుకెళ్ళిపోయాడు.

అనుకోకుండా అతనికి మూడు రోజుల కేంపు తగిలింది. ఇంటికి వచ్చి భార్యతో ఆ విషయం చెప్పి వెళ్ళిపోయాడు. పోతూ, పోతూ, "బాబుగాణ్ణి కాన్వెంటుకి రోజూ పంపుతూ ఉండు" అని హెచ్చరించి మరీ వెళ్ళాడు.

కేంపు నించి తిరిగొచ్చిన వెంటనే భార్యని అడిగిన మొదటి ప్రశ్న "బాబిగాడు రోజూ కాన్వెంటుకి వెళ్తున్నాడా" అనే.

"ఆ, వెళ్తున్నాడు లెండి" అంది కమల.

"ఏరా బాబీ, అఆలు వచ్చేసాయా" అన్నాడు రామకృష్ణ. "ఓ" అప్పుడే "ఉఊ"లు దిద్దుతున్నా" అన్నాడు బాబి హుషారుగా.

"ఊఁ ఎలా ఉంది కాన్వెంట్, బావుందా'' అడిగాడు రామకృష్ణ.

"బాగానే ఉంది గానీ"... అని నసిగాడు బాబీ.

''కానీ ఏమిట్రా...చెప్పు" అన్నాడు రామకృష్ణ.

"మరేం అక్కడ అస్తమానూ ఒకావిడ దిద్దండీ, దిద్దండీ అని అరుస్తూ ఉంటుంది. అదే నచ్చలేదు" అన్నాడు బాబిగాడు గోముగా.

– హేల

అప్పుడే చూసుకోవచ్చు. ఇక వెళ్ళండి భోజనాల వేళైంది!" అని పంచాంగం మూసేశాడు.

మళ్ళీ పేకాట ప్రారంభం అయింది.



# 3

ప్రెసిడెంటు వెంకటయ్య, మునసబు రంగారావు, పూజారి అప్పలాచార్యులు ఒక రకంగా నిరంతర త్రయం. ఆ ఊళ్ళో ప్రెసిడెంట్లు మారినా, ఎన్ని ఎన్నికలు జరిగినా—వాళ్ళు ముగ్గురూ ఎప్పుడూ విడిపోలేదు. దానిక్కారణం ఎవరూ, ఎవరికీ అడ్డు కాదు. ఎవరి వృత్తులు వాళ్లవి, ఎవరి రాబడులు వాళ్లవి. అందుకే, వాళ్ల స్నేహం చెక్కు చెదరకుండా సాగిపోతోంది. కమలమ్మ భర్త బతికున్నంత కాలం ఆయనే ఆ వూరికి ప్రెసిడెంటు. అంతకు ముందు కూడా ఆ వూరి పెత్తనం కమలమ్మ ఇంటివారిదే. కమలమ్మ భర్త పోయిన తరవాత అతని దగ్గర కంట్రాక్టులు చేస్తూ బతికే వెంకటయ్య ప్రెసిడెంట్ అయ్యేడు ఆ గ్రామానికి. ప్రజలను ఎలా ఉద్ధరిద్దామన్న ఆలోచన అతనికెన్నడూ లేదు. ఆ పదవితో తాను ఎలా ఉద్ధరింపబడాలన్నదే అతని ఆలోచన. డబ్బు సంపాదించడం అతని ధ్యేయం. డబ్బుంటే అధికారం, దానంతటదే చేరువౌతుందని అతని విశ్వాసం. అతనికి అధికారం వచ్చిన తరవాత మునసబు బాగా చేరువ అయ్యాడు. వాళ్ళిద్దరి స్నేహానికీ మూలాధారం వాళ్లకున్న వ్యసనాలు. అందమైన ఆడదంటే ఇద్దరికీ నోరూరుతుంది. దానికి తగినట్టు వయసుంది, డబ్బుంది. అన్నిటికీ మించి మనుషుల్ని ఎలా లొంగదీసుకోవాలో ఏమి ఎర వేస్తే మనుషులు లొంగుతారో గ్రహించుకునే తెలివి వుంది. అందరి గొడవా వాళ్ల ముగ్గురికీ కావాలి. అయితే పూజారి అప్పలాచారి వాళ్లిద్దరికీ తోడవడంలో వేరే కారణం ఉంది. అతణ్ణి వాళ్ళిద్దరితోపాటు చేర్చుకోవడంలో వాళ్ల అవసరమూ ఉంది. అప్పలాచారిది వాళ్ల వయసు కాదు. తల నెరిసినవాడే అయినా వాళ్ళిద్దరితో ఏ విషయంలోనైనా కలుస్తాడు. వాళ్ళు కలుపుకొంటారు కూడా. ఎందుకంటే ఆ వూరు మొత్తానికీ అప్పలాచారి అవసరం మనిషి. అటు సంప్రదాయాన్నీ, ఇటు నవనాగరికతనీ ఉగ్గుగా రంగరించి తాగేసి జీర్ణం చేసుకున్న మనిషి. తేలు కుట్టినవాడికి మంత్రమూ వేయగలడు. మంత్రం మీద నమ్మకం లేనివాడికి మందూ ఇవ్వగలడు. ఊళ్ళో ప్రామిసరీ నోటు దగ్గర్నించి క్రయదస్తావేజుల దాకా అతనికి తెలియకుండా అతని దగ్గరికి రాకుండా జరగవు. అతనే రాయాలి. ఎవ్వడికి ఎంత హక్కున్నదీ, ఎంత ఆస్తి ఉన్నదీ అతనికి కరతలామలకం. ఆ వూరికి అతనే పోస్టుమాస్టర్. స్థూలంగా చెప్పాలంటే అప్పలాచారి పూజారి, పోస్టు

మాస్టరు, వైద్యుడు, లైసెన్సు పొందిన లేఖరి మరియు పెళ్ళిళ్ళ పేరయ్య. అతని పనులకూ, అతని ఆదాయానికీ ప్రెసిడెంటూ, మునసబూ ఎన్నడూ అడ్డు రారు. కారణం వాళ్ళిద్దరికీ నష్టం కలిగే పని అప్పలాచారి తలపెట్టడు, చెయ్యడు—ఒకవేళ అటువంటి పరిస్థితే వస్తే హెచ్చరిస్తాడు కూడా.

అందుకు ప్రతిఫలంగా ప్రెసిడెంటూ, మునసబూ కూడా అప్పలాచారిని ఒక కంట కనిపెట్టే వుంటారు. సరదాగా, కాస్త మందు పుచ్చుకోవడంలో అప్పలాచారిని చేర్చుకుంటారు. అప్పలాచారి వాళ్ళిద్దరితోటే చేరనిదల్లా ఆ పైమెట్టు విషయంలోనే. అతడికున్న సరదా అల్లా ఆడదాన్ని తాకి సంతోషించడమే. అది చూసి ప్రెసిడెంటూ, మునసబూ నవ్వుకుంటూ ఉంటారు. ఈ సంగతి ఊళ్ళో చాలా మందికి తెలుసు. అయినా వాళ్ళ కత్తికి అడ్డులేదు.

కమలమ్మ భర్త బతికున్నన్నాళ్ళూ ఆ పెద్దింటిఅరుగులమీద ఏనుగు స్తంభాలకు చేరబడి, అతని నీడనే బతికేవారు. అతను పోయిన తరవాత ముగ్గురూ వెలుగులోకి వచ్చారు. వాళ్ల ముగ్గురికీ ఆ గుడి అరుగులే కచేరీ. ముగ్గురూ కలిసుంటే దారిని పోయేవాళ్ళని పలకరించి ఏదో ఒకటి ఒకళ్ల అనడం, మిగిలిన ఇద్దరూ తాళం వెయ్యడం రివాజై పోయింది.

వాళ్ల ముగ్గురూ రావుడు కట్టుకున్న బట్టల్ని చూసి వెక్కిరింపుగా మాట్లాడ్డం రాముడికి బాధగానే ఉంది. కాని వాడు వాళ్ళని తిరిగి ఏమీ అనలేదు. ఇలా వాణ్ణి ఇదివరలో కూడా ప్రెసిడెంటూ, మునసబూ ఏవో సూటీపోటీ మాటలు అంటూనే ఉన్నారు. కాని ఈ వేళ వాళ్ళన్న మాటలికి వాడు బాగా నొచ్చుకున్నాడు. ఏదో అర్థంకాని ఉడుకుమోత్తనం వాడిని వేధిస్తోంది. ఆబాధతో లోగిట్లోకి అడుగు పెట్టాడు.

"అమ్మగారూ, అమ్మగారూ!" అని అరుస్తూ కమలమ్మ దగ్గరికి వెళ్లాడు.

"నేనొద్దంటే ఇనకుండా ఈ సన్న బట్టలు నాకు కట్టబెట్టేరు. ఊళ్ళోవోళ్లందరికీ నామీదే కన్ను. ముతక పంచీ, బనీనూ తోడుక్కునేవోడికి నాకెందుకండీ ఈసోకులు?" అన్నాడు రాముడు కాస్త చిరాగ్గా.

కమలమ్మ నవ్వుకుంది. వాణ్ణి చూస్తే జాలేసింది ఆమెకు. ఎవరో ఏదో అని వుంటారని గ్రహించి "ఎవరేమన్నార్రా, ఒకవేళ అన్నా కొత్తగా ముస్తాబయ్యేవు కాబట్టి, వేళాకోళం ఆడేరేమో ... ఆ మాత్రం దానికే ఇంత ఇదై పోవాలా?" అంది కమలమ్మ వాణ్ణి సముదాయిస్తూ.

"ఏళాకోళవోఁ, ఎటకారమోఁ నాకు తెల్దేటండి; నేనింకా బొడ్డూడని క్కుర్రోణ్ణా?" అన్నాడు మూతి ముడుచుకుని రాముడు.

కమలమ్మ ముందు వాడలా అలిగి, మాట్లాడున్నాడేకాని వాడి కళ్లు అప్పటికే ఎర్రబడ్డాయి. వాడి ముఖం పరకాయించిన కమలమ్మ—అసలు జరిగిన విషయం తెలుసుకోవాలన్న కుతూహలంతో కాస్త రెచ్చగొట్టే ధోరణిలో "మరంత పెద్ద

ఖాదివైతే అక్కడికక్కడే వాళ్ళకి సమాధానం చెప్పలేకపోయావా ?" అంది.

"చెప్పేవోణ్ణే...ఊరి ముత్తానికి ముగ్గురూ పెద్దోరు. తీరా ఏదేనా ఎదురు మాటంటే తమరి దగ్గరికివచ్చి పిర్యాదు చేస్తారేమోనని జంకేను..."అన్నాడు.

ఆ మాటతో కమలమ్మకి వాడిని ఎవరు నొప్పించారోఅర్థమైంది. "ఇంతకీ ఏమన్నారు?" అంది ముక్తసరిగా.

"నేను కామందేసం ఏసేనంట. కొన్నాళ్ళుపోతే పెసిడెంటుకే పోటీ సేత్తానంట...ఇంకా కుక్కా నక్కా అని ఏటేటో అన్నారెండి; మీరెన్ని సెప్పం డమ్మగారూ, నేను మట్టుకు ఈ యాసం తీసేత్తానండి. నా మామూలు పంచీ బనీనే తొడుక్కుంటాను...!" అన్నాడు తన తుది నిర్ణయంగా.

కమలమ్మ ఒకక్షణంఆగి చూసి వాడి బాధను అర్థం చేసుకొని "ఏడ్చే వాళ్ళకి లొంగితే ఇంకా ఏడిపిస్తార్రా. మరి కాస్త ఏడిపిస్తే, ఏడ్చేడ్చి అలసిపోయి ఊరుకుంటారు. నిన్న మొన్నటి దాకా వాళ్ళ కళ్ళముందు మామూలు పనివాడిలా తిరిగే నువ్వు ఈ బట్టలు కట్టుకుని తిరుగుతుంటే కళ్ళు కుట్టేయి వాళ్ళకు. అట్టడుగున వున్నవాడు పైకొచ్చేటప్పుడు, పైనున్న వాళ్ళందరికీ ముందు కాస్త దుగ్ధగానే వుంటుంది. అణగదొక్కాలనే చూస్తారు. వాడే పైకి వచ్చేస్తే, పైనున్నవాళ్లు తమతో కలుపు కుంటారు. ఇంకా ఎదిగిపోతే వాడికి దాసోహం అంటారు. ఈ జనంతీరే అంత. వాళ్ళకిభయపడ్డావో నీబతుకంతా నరకమే అవుతుంది. తలెత్తుకు తిరుగు. నీ వెనక నేనున్నాను. ఇకనుంచీ నువ్వి లాంటిబట్టలే కట్టుకుంటావు...చుక్కమ్మ భోజనం వడ్డించినట్టుంది...వెళ్ళి భోజనం చెయ్యి." అని కమలమ్మ తన గదిలోకి వెళ్ళబోయింది.

రాముడు ఉండబట్టలేక ఆవిడ అన్ని చెప్పినా "పాలేరోణ్ణి. అసలు నాకీ యేసమెందుకండీ?" అని రెట్టించాడు.

కమలమ్మ చర్రున వెనక్కితిరిగింది. వాడి ముఖంలోకి తీక్షణంగా చూసింది.

"ఏరా...వాళ్లు నిన్ను పాలేరే అనుకోవచ్చు. కొన్నాళ్ళు ఈ ఇంట్లో పాలేరు గానే నువ్వు బతికి ఉండొచ్చు. మా అన్నయ్య చేతుల్లోంచి పెత్తనం నేను తీసుకొన్నతర్వాత నిన్ను ఎప్పుడయినా పాలేరుగా చూశానట్రా నేను ? నేను ఏం తింటే నీకది పెడుతున్నాను. ఇంటి యజమానురాల్ని కాబట్టి ఈతాళాలగుత్తి నా కొంగున ఉంటోందిగానీ ఏ విషయం అయినా ఇంట్లోనీనుండి దాపరికముందా? నీకు తెలియన్ది ఉందా? వేలు నీ చేతిమీద ఖర్చు పెడ్తున్నావు... వేలు నీ చేత్తో తెచ్చి నాకు ఇస్తున్నావ్. ఆయన పోయింతర్వాత ఈ కమతాన్ని ఇంతగా పెంచావు. నిన్నెప్పుడయినా లెక్కలు అడిగానా? నిన్నెప్పుడయినాకోప్పడ్డానా? నేను బతుకుతోందే ఈనాడు నిన్ను నమ్ముకొనిరా! నా చుట్టూ ఉన్నవి గెద్దలని నాకు తెలుసు. నావాళ్లూ, పైవాళ్లూ కూడా నన్ను పీక్కుతినాలని మాటేసుకుని ఉన్నార్రా. నన్నోసి ఒడ్డుకి చేర్చి నా బిడ్డకి ఈ ఆస్తి అప్పచెప్పేదాకా నువ్వు ధైర్యంగా నిలబడాలిరా... నా కోసం తలెత్తుకుని నిలబడాలి. ఈ కమ

తానికి నువ్వు పాలేరువి కాదు, ఉద్ధారుడివి. ఇక ఎవ్వరయినా నిన్ను పాలేరంటే—కాదు, కమలమ్మగారి కమతానికి ఉద్ధారుణ్ణి అని ధైర్యంగా చెప్పు" అని విసురుగా లోపలికి వెళ్లిపోయింది.

రాముడికి అంతా అయోమయంగా అనిపించింది. ఏదో తను మోయలేని బరువూ, బాధ్యతా తన నెత్తిన పడినట్టు అనిపించిందా క్షణంలో.



## 4

ఆ రాత్రి అయిదేళ్ల పసివాడిని పక్కలో పెట్టుకొని, వాడిని జోకొడుతూ ఆలోచిస్తూ పడుకొంది కమలమ్మ. రాముడికయితే ధైర్యం చెప్పింది. కాని వాడిని, వాళ్ళు ముగ్గురూ అలా హేళన చెయ్యడం తనకీ బాధగానే ఉంది. 'ఆయన' ఉన్నప్పుడు తన వాళ్ళను వాళ్ళెవరూ పల్లెత్తు మాట అనగలిగేవారు కాదు. ఆయనంటే ఊరంతా గడగడ లాడేవారు. గౌరవించేవారు కూడా. ఆయన పోవడంతో ఉళ్ళోవాళ్ళకు ఈ లోగిలి లోకువవుతోంది కాబోలు..... లోకువచేసి మాట్లాడినా,వాళ్ళను అదమాయించి బుద్ధిచెప్పే మగదిక్కు తన ఇంటికి ఈనాడు లేదు. ఉన్న ఒక్క అన్నగారూ ఎందుకూ పనికిరానివాడై, వాళ్ళతోటే చేతులు కలిపేహాడయ్యేడు. అసలు తన జీవితమే చిత్రంగా నడిచింది...... ఆ పూజారే తనకు పెళ్ళి సంబంధం కుదిర్చాడు. కట్నం లేకుండా పెళ్ళి కుదిర్చినందుకు ఆ రోజుల్లోనే తన అన్న రెండు వేల రూపాయలు పూజారికి 'తాంబూలం'లో పెట్టి ఇవ్వడం తనకి తెలుసు. నిజానికి ఆయన తనను పెళ్లాడింది, తన అందాన్ని చూసేనని అనేకసార్లు అన్నాడు. ఒక విధంగా తన అందమే తనని ఇంత పెద్దింటి కోడలుగా చేసింది. జీవితం పండువెన్నెల్లా సాగిపోతుంది— అనుకొంది తను. కాని త్వరలోనే చీకట్లు కమ్ముకున్నాయి. అయిదేళ్ళ దాంపత్య జీవితం గడిచేసరికే తన జీవితంలో పిడుగుపడింది. గుండెపోటుతో ఆయన మరణించారు. ఆయనతో సంసారం చేసిన అయిదేళ్ళలోనూ కూడా ఈ ముగ్గురి తంటా తను పడలేదు. ఈఇంటి అరుగులమీద చేరేవాళ్ళని మధ్యమండువాగుమ్మానికి వేళ్లాడే తెరవెనకనుంచే చూడ్డం జరిగింది. తరతరాలుగా వస్తున్న ఆ తెరను తను అలాగే గౌరవిస్తూ వచ్చింది. పెళ్ళినాడు కూడా వీళ్ళెవ్వరినీ తాను పరిశీలనగా చూడలేదు. పెళ్ళి ఊరేగింపునాడు మాత్రం ఈ ఇంటి సంప్రదాయం ప్రకారం ముత్యాల పల్లకిలో ఊరేగుతూ ఆ రాత్రి ఊరంతా చూసింది. రాజవీధి, వీధి మలుపులో రామాలయం, రామాలయం ముందు ధ్వజస్తంభం, రాజవీధిని ఆనుకుని వరసగా ఎనిమిది చిన్న వీధులు, తూర్పున పెద్ద చెరువూ, పడమటి దిక్కున చిన్న యేరూ, ఏటికవతల గూడెం, పేటా—

అది ఆ వూరు రూపమని, ఆ ఊరేగింపు నాటి రాత్రే తెలుసుకొంది. ఆ ఊళ్ళో ఇళ్ళన్నింటికంటే తమ ఇల్లే పెద్దది అని కూడా తెలుసుకొంది.

ఏలోటూ లేకుండా ఎంతో హుందాగా తన బతుకు సాగిపోతుందనుకొంటే— ఆయన పోవడంతో తన బతుకు ఒక పెద్ద మలుపు తిరిగి, తన శక్తికి మించిన సమస్యగా తయారయింది. ఆయన పోయినప్పుడు ఊరు ఊరంతా తన ఇంటి ముందే ఉంది. దూరపు బంధువులూ, దగ్గరి బంధువులూ కూడా, తన తరపు వాళ్లూ, ఆయన తరపు వాళ్లూ వచ్చి వాలేరు. తనతో కలిసి కన్నీరు కార్చేరు. ఆనాడు కూడా మధ్య మండువా గుమ్మం తెరదాటి తాను ముందు మండువాలోకి అడుగుపెట్టలేదు. ఆడవాళ్లు మాత్రం లోపలికివచ్చి ఓదార్చేరు. ఒక్క పూజారి మాత్రం పెళ్ళి కుదిర్చిన చనువు మూలంగా లోపలి మండువాలోకి వచ్చి, వినయ విధేయతలతో ఓదార్చేడు. కర్మకాండ పూర్తయ్యే దాకా, బంధువుల్లో చాలా మంది ఉన్నారు. ఈ ముగ్గురూ కూడా ఆపదిరోజులూ, రోజూ వచ్చారు. వీళ్ళందరికీ ఆయనంటే ఎంత అభిమానమో, ఆయన ఎంత మంచివారోనని తనలో తనే పదేపదే అనుకొనేది. కాని పన్నెండోరోజు నుంచి తన బంధువర్గం, ఈ ముగ్గురు వ్యక్తులూ ఎందుకలా తన ఇంటి మీద గౌరవాభిమానాలు చూపించారో తెలుసుకోగలిగింది.

అసలు రంగుల విన్యాసం ప్రారంభమయింది. అందరు ఆలోచించేదీ ఒకటే సమస్య...పోయిన వ్యక్తి గురించి కాదు...ఆ వ్యక్తి తాలూకు ఇంత ఆస్తిని ఎవరు అజమాయిషీ చెయ్యాలి...ఎవరు పెత్తనం చెలాయించాలి... అన్నదే సమస్య! నిజానికి తాను ఎవర్నీ అర్థించలేదు. ఎవరి సహాయమూ కోరలేదు. అయినా బంధువుల్లో చాలామంది తమ పనులు మానుకొని అంతటి త్యాగానికి సిద్ధమయ్యారు. అప్పుడు తనకు అర్థమయింది...వాళ్ళలో ఏ ఒక్కరి సహాయం అర్థించినా – తనూ, తన బిడ్డా పామునోటబ చిక్కిన కప్పలమై పోతామేమోనని...! తనను ఎంత గుచ్చి గుచ్చి అడిగినా ఎవరికీ తను సమాధానం చెప్పలేదు. దాంతో ఎవరంతట వాళ్లు ఆశ వదలుకొని 'అన్నగారు నరసింహం ఉన్నాడుగా... చూచుకుంటాళ్ళే...నాలుగేళ్లు తిరక్కుండా హారతి కర్పూరంలా హరాయించుకు పోతుంది ఆస్తి'. అని తమలో తాము అనుకుంటూ సర్దుకున్నారు.

తోడబుట్టినవాడు, తనకు అతనికంటె ఎవరు ముఖ్యుడని, అన్నగారి చేతికే తాను పెత్తనం ఇచ్చింది. ఏడాది తిరక్కుండా పాతికవేలు అప్పు చూపించాడు. దాంతో చేసేది లేక రాముణ్ణి అడ్డు పెట్టుకొని తానే అన్ని విషయాలూ ఈ రెండేళ్ల బట్టీ చూసుకొంటోంది. మధ్య మధ్య తమ సహకారాన్ని అందజేస్తామంటూ తాము అండగా ఉంటామంటూ ఈ ప్రెసిడెంటూ, మునసబ్బూ, పూజారి ద్వారా రాయబారాలు జరుపుతూనే ఉన్నారు. తాను చేరనివ్వలేదు. వాళ్ళే స్వయంగా ఒకసారి వచ్చి తెర

వెనుక నిలబడి 'తనతో', తెర అవత ల్నుంచి మాట్లాడి వెళ్లారు. వాళ్లు ఆశిం చింది వాళ్లకి అందలేదు. అది రాము డికి అందిందని వాళ్లకి ఈర్ష్య. తనమీద కోపం వాడిమీద ఈర్ష్యగా మారింది. వాణ్ణి కూడా ఎలాగో ఒకలా లోబర్చు కోవాలని చూశారు. వాడు చిక్కలేదు. వాడు నీతికి నిలబడిన మనిషి. వాడే లేకపోతే ఈ సంసారం ఈ పాటికి ఎలా ఉండేదో...! ఎవరెవరి దయా ధర్మ భిక్షకోసంపాకు లాడాల్సి వచ్చేదో...

...అలా అనుకొంటూ నిద్ర పోయింది కమలమ్మ. రాముడు ఆరాత్రి మనసు బాగోక ఏటి అవతల గూడెంలో ఉన్న తన అమ్మమ్మను చూడ్డానికి వెళ్ళాడు. దార్లో ఏరు దాటుతూ ఉంటే రాముడికి తొలిసారి...తన చిన్నతనం జ్ఞాపకం వచ్చింది. తాను గోచీ పెట్టు కొని తన అమ్మమ్మ చెయ్యి పట్టుకొని ఆ ఏరుదాటి...ఆ పెద్దింటిలో పశువుల కాపరిగా చేరిన రోజు గుర్తుకు వచ్చింది. అప్పటికి కమలమ్మ భర్త రాయలం గారూ, వంటమనిషి చుక్కమ్మా, తన అమ్మమ్మ పనిమనిషిగానూ ఆ లోగిట్లో ఉండేవారు. తను పనిలోకి చేరిన మూడు నాలుగేళ్లకు కమలమ్మ గారు ఆ ఇంటి కోడలుగా వచ్చింది. ఆనాటి నుంచి ఆ ఇంటికే కొత్త వెలు గొచ్చింది. ఆనాటి నుంచీ ఈనాటిదాకా ఏనాడూ కమలమ్మ తనను పల్లెత్తుమాట అనలేదు. ఆ మాటకొస్తే రాయలంగారూ అనలేదు. ఈనాడు ఉన్నట్టుండి 'నువ్వు పాలేరువి కాదురా, మా కమతానికి ఉద్ధా రుడివి' అన్నది కమలమ్మ. ఉద్ధారు డంటే-ఎలా ఉండాలో, ఏం చెయ్యాలో తనకేం తెలుసు? తను ఎక్కడో ఊరికి దూరంగా ఏటి అవతల గూడెంలో పూరింట్లో బతికేవాడు. తనకు చదువు లేదు. తెలివిలేదు. ఎలా నెగ్గుకు రావాలి...?...ఇలా ఏవేవో ఆలోచనలు ఏరుదాటి ఇంటికి వెళ్లేదాకా రాముడి మనస్సులో సుడిగుండాలు తిరుగుతూనే ఉన్నాయి...అర్ధరాత్రి వేళ తలుపు తట్టి అమ్మమ్మను లేపాడు. రాముడి అమ్మమ్మ పేరు పుత్రమ్మ.

పుత్రమ్మ తలుపు తీసి నాలుగు రోజులు తరవాత ఇంటికి వచ్చిన మనవడిని ఆప్యాయంగా కౌగిలించుకొంది. రాముడు చిన్నప్పుడే తల్లి పోతే వాడి తండ్రి మరొకర్తిని పెళ్లాడితే-మనవణ్ణి తన దగ్గరకు తెచ్చు కొంది పుత్రమ్మ. వాడిని తనే పెంచి పెద్ద చేసింది. నిజానికి వాడికి ఊహ తెలిసేక ఆ పెద్దలోగిలింట్లోనే పెరిగాడు. రాముడికి ఉన్నది ఆ ముసిల్దీ...ఆ ముసి ల్దానికి ఉన్నది ఆ రాముడే...

అందుకే వాడంటే పుత్రమ్మకి ప్రాణం. వాడు రాగానే గుడిసెలోని ఉట్టిమీది కుండలోని పేలాలూ, బెల్లంతీసి తినమని పెట్టింది. నిజానికి వాడికి ఆకల్లేకపోయినా అమ్మమ్మ తృప్తికోసం అవి తిన్నాడు.

"కాతంత ఇంటికొత్తాపోతాఉండరా... ఆ గొడ్లపాకలో తొంగునే బదులు ఇంటి కొచ్చి తొంగుని పొద్దున్నే పోకూడదూ? పాలేర్తనం నువ్వొక్కడివే సేత్తన్నావా,

మినీకథ

# వైద్యం

రామారావు చాలా కాలంనుంచీ ఉబ్బ సంతో బాధపడుతున్నాడు. వారానికి రెండు మూడుసార్లు అది తిరగబెట్టి, ఆ యాసం వచ్చిన రోజున ఎగఊపిరి, దిగ ఊపిరితో అతను ఏమాత్రం స్థిమితంగా ఉండలేడు.

వ్యాధి నయం చేసుకోవడానికి అతను అన్ని రకాల మందులూ వాడాడు. ఇంగ్లీషు మందులు వాడీవాడీ విసిగెత్తి మానేస్తే ఎవరో హోమియోపతిలో మంచి మందులున్నాయని చెప్పడంతో సరేనని ఆ మందులూ వాడి చూశాడు. ఏమీ గుణం కనిపించక చిట్కా వైద్యం ప్రారంభించాడు. అయినా లాభం లేక పోయింది.

దగ్గర బంధువొకడు "ఒరే రామం! పోనీ చుట్ట కాల్చకూడదురా" అని సలహా ఇచ్చాడు. పక్కవాడు సిగరెట్టు కాలిస్తేనే వాంతులు చేసుకొనే రామారావు చచ్చీ చెడీ చుట్టకాల్చడం అలవాటు చేసుకున్నాడు. రోగం తగ్గలేదు కానీ చుట్ట మాత్రం బాగా ఒంటబట్టింది. ఈలోగా ఆయుర్వేదంలో అతనికి నమ్మకం ఏర్పడింది. ఆ కషాయాలూ, చూర్ణాలూ రామారావుకి తాత్కాలికంగా ఉపశమనం కలిగించడమే ఆ నమ్మకానికి పెద్ద కారణం.

గవర్నమెంటు ఉద్యోగం అవడంవల్ల ట్రాన్స్‌ఫర్ కాగా సంసారాన్ని హైదరాబాద్‌కు మార్చాడు రామారావు. ప్రయాణంలో చల్లగాలి బాగా తగిలి సరిగ్గా ఆ రోజునే మళ్ళీ వచ్చింది పాడు ఆయాసం. రాత్రంతా కుదిపికుదిపి వదిలిపెట్టింది. ఆ రోజున అయిదు చుట్టలూ, పది మాత్రలూ, రెండురకాల కషాయాలు రామారావు ఆయాసాన్ని ఏ మాత్రం తగ్గించలేక పోయాయి.

ఇదంతా చూసి పక్కింటాయన పొద్దున్నే కాసేపు పరామర్శించి, మరి కాసేపు రోగాన్ని, ఇప్పుడొస్తున్న

మందుల్ని తిట్టిపోశాడు. ఆ తరవాత ఆ వీధిలోనే ఆయుర్వేదం డాక్టరుగారున్నారనీ, ఆయన ఉబ్బసం స్పెషలిష్టనీ, కన్సల్టేషన్ ఫీజు లేకుండానే వైద్యం చేస్తాడనీ, కావాలంటే తానువచ్చి పరిచయం చేస్తాననీ చెప్పాడు.

డాక్టరుగారి హస్తవాసి చాలా మంచిదని మరీమరీ మొహమాటపెట్టడంతో ఆయనతో కూడా బయల్దేరక తప్పలేదు రామారావుకు. నెత్తిన పిలకా, నుదుట నామాలతో దర్శనం ఇచ్చారు డాక్టరుగారు. కాస్సేపు ఆ ప్రశ్నలూ ఈ ప్రశ్నలూ వేసి, ఆయాసం వచ్చినపుడు అలా ఉంటుందా, ఇలా ఉంటుందా అని అడిగి– కనీసం పదేళ్ళనుంచైనా మీకు ఈ రోగం ఉండి ఉండాలన్నాడు ఆయన.

"కచ్చితంగా చెప్పారే, ఎంత అనుభవం ఉందో ఈ డాక్టరుకు" అని ఆశ్చర్యపోయాడు రామారావు. ఓ ఐదు నిమిషాలదాకా గుడ్లప్పగించి చూస్తుండిపోయాడు. "అంత కరెక్టుగా ఎలా చెప్పారు సార్ ?" అనడిగాడు చివరికి నోరు పెగల్చుకుని.

"ఏముందీ ! ఈ మాత్రం దానికి అనుభవం కూడా కావాలా? పదిహేనేళ్ళ నుంచి నేను అనుభవిస్తూనే ఉన్నాగా !" అన్నాడు డాక్టరుగారు చిరునవ్వు చిందిస్తూ.

మారు మాట్లాడకుండా ఇంటికి వెళ్ళాడు రామారావు. ఆ తరవాత మరెప్పుడూ మందులు వాడిన జాడ కనిపించలేదు ఎవరికీ.

– వి. ఎన్.



ఈతోగా నే సచ్చినా అంతేనా!" అంది పుత్రమ్మ.

"పండుగ పూటా సావు సంగతి ఎందుకే నేను గొడ్లపాకలో తొంగుం టున్నానేంటి? నే తొంగొన్నా అమ్మగారు తొంగోనిత్తాదేటి? తొంగుంటే—ముందు మండువాలో సాపేసుకు తొంగుంటాను. లేకపోతే— పొలం పంటమీద ఉన్న ప్పుడు, కుప్ప నూర్పుడు రోజుల్లోనూ, పొలంలో మకాం కాడ తొంగుంటాను. నువ్వేమను కుంటన్నావో కానీ నీకంటే మా అమ్మగారు నన్ను సానా బాగా సూత్తది. ఓ మాట్లో సెప్పాలంటే నన్ను ఇంటికి పెద్దకొడుకులా సూత్తది... ఏవనుకుంటా్నావో!?" అన్నాడు కడవలో మంచినీళ్లు ముంచుకు తాగుతూ రాముడు.

"నిజమేరా ... ఆ తల్లి బంగారు తల్లి. పేదోళ్ళని ఓ కంట కనిపెడద్దిరా. నేనెప్పు డెళ్ళినా— నీకేం కావాలో అడిగి పట్టికెళ్ళే ముసలీ... ఇదంతా నీ మన వడు పండించిన పంటే — అంటదిరా నోరారాను. అలాఅన్నెప్పి నువ్వు ఇంటికి రావంట్రా? నిన్ను రోజూ ఇంటికెలా రప్పించాలో నాకు తెలుసులే..." అని— అంతలోనే కోపగించుకుంది పుత్రమ్మ.

రాముడు నవ్వుకొని "ఇంతలోకే కోపమెందుకే? నన్నెలా రప్పిత్తావేటి రోజూనూ?" అన్నాడు.

"ఆ మూడు ముళ్ళూ ఏసేసి ఆ పిల్లని నా దగ్గరెట్టుకుంటే తిక్క సక్కగా కుదిరి, సీకటడే సరికి ఇల్లె క్కడుందా అని ఎతుక్కుంటూ వత్తావు" అంది ముసలమ్మ కోపంలో నవ్వును మేళవించి.

ఆ మాటలకి రాముడు పక పకా నవ్వేడు. ఆ నవ్వులకు క్రినీడలో నులక మంచంలో పడుకున్న రత్తి ఒళ్ళు విరుచు కొంటూ "ఎవరే బామ్మా? ఆ నవ్వేంది... ఇంత రేత్రేల— కప్పెగిరి పోయేలా నవ్వుతున్నాడూ!" అంది.

"ఇదెవరే?" అన్నాడు రాముడు

"ఎవరేట్రా? మన రత్తి ... ! మా అప్ప మనవరాలు. నాకు తోడుగా ఉంట దని నేనే పిలిపించాను" అంది నవ్వుతూ పుత్రమ్మ.

"దీన్నసాన్దియ్య! ముడుచుకు తొంగుంటే మంచంమీద నేను సూల్లేదు. ఒళ్ళిరుసుకుంటే మంచమంత పొడుగూ ఉందేటే ... ఎప్పుడో సిన్నప్పుడు సూసేను... గెలెయ్యడానికి సిద్దమయిన అరిటిసెట్టులా ఇంతయి పోయిందేటే?" అన్నాడు.

రత్తి రాముడివైపు ఓ తిగిరి మసక చీకట్లో పలకరిస్తూ "నువ్వేదగ లేదేటి. పోతు బొప్పాసు చెట్టులా!" అని బదులు చెప్పింది.

"సిన్నప్పుడించక్కా ఆడుకునీ వోరు గందా, కలిసి మెలిసి ఉంటారూ ... అని నిన్ను పిలిపిత్తే, అణ్ణీ సూడగానే కలియబడ్తావేటే? నీ ఇల్లు బంగారం గానూ!" అంది పుత్రమ్మ—మనపడూ, మనవరాలి పరాసికాలకు మురిసిపోతూ.

"కలియబడద్దే — కలియబడదు మరీ—? అప్పలాముడి కూతురా, మరొకటా? దాని పోరుసే అంత!" అన్నాడు రాముడు.

"బాగా సెప్పేవులే గానీ ... ఈ యేసమేంటి? గేసోళ్ళమల్లుపంచీ, సిలుకు

సోకాా తొడిగేవ్, పెల్లి కొడుకులాగా? పండగ ముత్తాబా? పెల్లి సూపులకెల్లొచ్చేవా" అంది రత్తి.

"పండుగ ముత్తాబై పెల్లిసూపుల కొచ్చేనే... దీన్తస్సాదియ్య! సెట్టంత మగోడు కూకునుంటే తొంగొనీ అవూసు లేంటే? లెయ్యహే!!" అని రాముడు తేచి రత్తి పిర్రమీద ఒకటి తగిలించాడు. దాంతో రత్తి పిర్ర పాముకుంటూ నవ్వుతూ లేచింది. ఆ ఇద్దరి సరసానికి పుత్రమ్మ ఎంతో మురిసిపోయింది. రత్తి "నిన్నొచ్చేను, బాయ్యా! వొచ్చిన కాణ్ణించీ నీకోసం కళ్లు కాయలు కాసి పోయేలా సూత్తన్నాను. 'ఏరు దాటి అవతలొడ్డుకి ఎల్దామె జతరాయే' అంటే ఈ ముసిల్దానికి కాల్నొప్పి. ఇదిగో వొత్తాడు అదిగోవొత్తాడు...అంటదే కానీ నన్నొకర్తినే ఏరుదాటనివ్వదు. తను జత రాదూ! మొత్తానికి ఇయాలొచ్చేవు...కొత్త అమాసనాడు...సీకట్లో అడ్డబడి కొంపకి జేరేవు...నన్ను కట్టుకున్నాక ఇలాగొత్తే అరుగు మీదే తొంగోవాలి ..." అంది రత్తి.

రాముడు నవ్వుకొని "దీన్తస్సాదియ్య ... ఇదెక్కడి పిల్లే? వాగుడు కాయిలా ఒకటే వాగుడు — అప్పుడే సుట్టరికం కలిపేత్తంది!" అన్నాడు

"మేనత్త మేనమామ బిడ్డలు — తప్పేముందిరా? ఎప్పటికైనా జరగాల్సిందేగా! నా కళ్ళ ముందు జరిగితే ఇల్లామీరిద్దరూ సిల్లో బొల్లోమంటూ ఉంటే నాకు సంతోషం." అంది పుతమ్మ.

"సరేలే తొంగో! రత్తికి పక్కలో మనిషి లేకపోతే నిద్రపట్టేలాలేదు. నేను అరుగు మీద తొంగుంటాలే" అని రాముడు మూలనున్న తాటాకు చాప తీసుకొని అరుగు మీదకి వచ్చి పడుకున్నాడు.

* * *

అదే రాత్రి—

ఆ ఉగాది పండుగ రోజు రాత్రి-ఊరంతా చిమ్మ చీకటిగా ఉంది. నెలవంక సంధ్యవేళే అగుపించి మాయమైంది. బైట ఉన్న చీకటిలాగే కొందరి మనసులో చీకటి కమ్ముకుని ఉంది. చీకటిలో ఉండలేని కొన్ని మనసులు వెలుగుకోసం తాపత్రయ పడ్తున్నాయి. చుట్టూ ఉన్న చీకటిని కప్పగా వాడుకుని— ఆ చీకటి మాటున తమ కోర్కెలను తీర్చుకునేందుకు తాపత్రయ పడేవాళ్ళు కొందరు జారులు, చోరులు. ఆ వూళ్ళో చోరభయం లేదు. అలాంటి పల్లెటూళ్ళలో ఇంతో అంతో జారత్వం లేకపోతే ఊరనిపించుకోదు.

రామాలయంలో దేవుడి ముందున్న దీపం చీకట్లను చీలుస్తోన్నట్లుగా నిజంలా నిలబడి వెలుగుతోంది. సాధారణంగా ఆలయ ప్రాంగణంలో నూనెవాసన, హారతి కర్పూరపు వాసన ఎప్పుడూ ఉంటాయి. ఉన్నట్టుండి సెంటువాసన కమ్ముకుంది.

నెత్తిని ముసుగు వేసుకొని పిల్లిలా అడుగులో అడుగు వేసుకుంటూ,ఆలయ ప్రాంగణంలోకి ఆచారి అడుగుపెట్టాడు.

గుడి వెనకాల కూడా ఆలయానికి కొంత పెరడు ఉంది. ఆ పెరట్లో

అక్కడక్కడ పూలమొక్కలూ తులసి మొక్కలూ, కాస్త ఎత్తుగా ఎదిగిన తెల్ల గన్నేరు చెట్లూ ఉన్నాయి. గన్నేరు చెట్టు మొదట్లో చుట్టూ సిమెంటు అరుగు కట్టి ఉంది. ఆ అరుగుకి కాస్త ఎడంగా బావి, బావి చుట్టూ సిమెంటు చప్టా ఉన్నాయి.

అలా ఆలయంలోకి అడుగు పెట్టిన ఆచారి దేవుడి కళ్ళ ముందునుంచే ఆలయం వెనక్కి వెళ్ళి దేవుడికి కనుమరుగయ్యాడు. చీకట్లోనే కళ్ళు పెద్దవి చేసుకొని గన్నేరు చెట్టు చుట్టూ ఉన్న అరుగు మీదా, నూతి చప్టామీద మంగి కోసం చూశాడు. మంగి జాడలేదు. 'ఇంకా రాలేదేంటిదీ?' అనుకొన్నాడు.

ఇంతలో వెనక గాజుల చప్పుడై ఉలిక్కిపడి వెనక్కి తిరిగాడు.

"నీ దుంప తెగ. ముంగిలా అలా వస్తావేం, అలికిడి లేకుండానూ?" అన్నాడు.

"లేకపోతే అరుస్తూ రమ్మంటారేటి?" అంది మంగి కాస్త రహస్యంగా.

"ఇంతకీ బైట తలుపు గడియ పెట్టేవా?" అనడిగాడు ఆచారి.

"తలుపేత్తే అనుమానం వొత్తది. అలా తెరిసుంటేనే ఎవరూ పట్టించుకోరు... అది కాక పోయినా ఇంత సీకట్ను ఎవరొత్తారు లెండి గుళ్ళోకి!" అంది మంగి సిమెంటు అరుగు మీద కూర్చుంటూ

"అలా అనకే... మనలాంటి జంటే మరొకటి రావొచ్చు" అన్నాడు ఆచారి నవ్వుతూ.

"వత్తే గొడవేలేదు. దొంగా దొంగా ఎదురైతే తప్పుకు పోతారు గాని తగాదా పడరు!" అంది మంగి.

"దేనికయినా తెగించినదానివి. నా భయం ఎవరో వస్తారని కాదు. మా మునసబూ, ప్రెసిడెంటూ చటుక్కున ఎవర్నయినా వెంటపెట్టుకు రావచ్చు... లేకపోతే మన రాసక్రీడలు చూద్దాని కయినా రావచ్చు. ఎందుకయినా మంచిది తలుపేసి వస్తానుండు" అని ఆచారి వెళ్ళి గుడి ముందున్న ప్రహరీ తలుపులు మూసివచ్చాడు.

మంగి పక్కనే కూర్చుంటూ "అన్నమాట ప్రకారం వచ్చేసేవే ... నీ కోసమని నేతిగారెలు పొట్లం కట్టించి పట్టుకొచ్చాను. ఇంద'' అంటూ పొట్లం విప్పి మంగిముందు పెట్టాడు.

మంగి ఓ గారె తీసుకొని తింటూ "మీది మా గొప్ప ధయిర్యవండీ! పొగటేళప్పుడు ధేవుడికి పూజ సేత్తారు. రేత్తిరయ్యేసరికి ఆ దేవుడి ఎనకాలే ఎవ్వారం సాగించేత్తారు" అంది.

"ఓసి పిచ్చి మొహమా! నువ్విదేదో పాపమని అనుకుంటున్నావు గాని, ఇదెంత మాత్రం తప్పుకాదు. ఎందుకంటావా...అసలు గుళ్ళెందుకు పుట్టేయో నీకు తెలుసా."

"ఎందు కంటారు!"

"పోనీ దేవాలయం మీద బూతు బొమ్మలు ఎందుకున్నాయో తెలుసా"

"నాకేం తెలుసండీ ! అవునునిజమే. గుళ్ళమీద బూతు బొమ్మలు ఎందుకెట్టారూ"

"చెబుతా విను. అలాంటి బొమ్మలు

ఈ మధ్య వచ్చినవి గాదు. గుడి పుట్టిన ప్పటి నుంచీ ఉన్నాయి. పూర్వం-అంటే మనిషి ఇల్లూవాకిలీ లేనప్పుడూ, ఇంత తెలివి తేటలు లేనప్పుడూ, మని షికి ఈ బొమ్మలు బాగా ఉపయోగ పడేవి. కొంత మంది శాస్త్రజ్ఞులు అంటారూ... ఇలాంటి బూతు బొమ్మ లున్న ఆలయాల్లోకి వెనకటి రోజుల్లో కొత్తగా పెళ్ళయిన దంపతులని తొలి రాత్రి గడపడానికి పంపేవారట. ఆ దంపతులు అటువంటి బొమ్మల్ని చూసి ఉద్రేకంచెంది రసకందంలోకి దిగేవారట. అందుచేత-మనం గుళ్లో చేస్తూన్న పనేమి తప్పుకాదు. అనాదినుంచి ఇలాంటి యెవ్వారాలు గుళ్లలో సాగుతూనే వచ్చాయి. ఇకనువ్వు పాపం, గీపం అని భయపడకు''అని ఆచారి మంగికి ధైర్యం చెప్పాడు.

"మీకు లేని పాపం నాకేంటి? మీరు రమ్మన్నారు. నేనొచ్చాను. మీకెంత పాపమో నాకు అంతే పాపం!" అంది మంగి.

"మనిద్దరికీ పుణ్యమేనే!" ఈ రోజు లలో ఇలాంటి వ్యవహారాలకి గుడే చాలా అనువైన స్థలం. ఎందుకంటే— ఇంత రాత్రివేళ ఎవరూ ఆలయంలోకి రారు... ఇలాంటివి జరుగుతాయని అనుమానించరు. పట్నాల్లో అయితే పోలీసుల భయం కూడా ఉంటుంది. లాడ్జీలమీద రెయిడు చేసేరని విన్నావు కాని గుళ్ళ మీద పోలీసులు రెయిడు చేసేరని ఎప్పుడయినా విన్నావా! 'అందుకే ఇంటి కంటే గుడి పదిలం' అంటారు" అంటూ మంగిని సందిట్లోకి తీసుకున్నాడు ఆచారి.

"ఏదో మాటాడే పనుందన్నారు... ఇదేనేటి!" అంది మంగి కాస్త కొంటెగా.

"ఈ పని మనకెప్పుడూ ఉన్నదే... ఈపనే అని ఎలా చెప్పమన్నావు నోటి తోటి... అందుకే మాటాడేపనుంద న్నాను."

"ఇంత పండగొచ్చిందీ...: ఓ కొత్త చీరయినా కొన్నారుకాదు" అంది మంగి.

"నీకు చీరల కరువేమిటి? ఊరందరి చీరలూ నీ యింట్లోనే వుంటాయి. కంటికి ఏచీర నచ్చితే ఆ చీరే కట్టుకోవచ్చు. ఇంతకీ ఈచీర ఎవర్ది?"అన్నాడు ఆచారి. మంగి కోరికను దాటవేస్తూ.

"ఇంత మంచి చీరలు కట్టేవాళ్ళు మమూర్లో ఎవరున్నారు! ఈరోజు మొత్తం ఏసమంతా కమలమ్మ గారిదే!" అంది మంగి.

"అందుకే...ఇంత చీకట్లో కూడా-ఈ చుట్టు జరీ తెల్ల చీరలో దేవకన్యలా మెరిసిపోతున్నావ్" అన్నాడు ఆచారి నవ్వుతూ.

"ఊరికే ఇలా ఊసెట్టుకు కూకుంటే ఈ ఆలికిడికి మీ పెసిడెంటో, మున్సబో తలుపు తట్టినా తట్టొచ్చు" అంది మంగి 'ఇంకా ఆలస్యం దేనికి, అన్నట్టు.

"సరేలే. పెసిడెంటుకీ, మునసబుకీ మన సంగతి తెలియదా ఏమిటి! వాళ్ళకి నువ్వేమన్నా కొత్తా!" అన్నాడు ఆచారి కొంటెగా.

"ఇదిగో... అలాంటి మాట్లంటేనే నాకు చిరాకు. ఊరికి పెద్దోళ్ళు గాబట్టి

జడిసి ఒప్పుకోవటంగ్గాని, ఆరికి నేనొక్క తినే నేటీ! మీకూనాకూ అంటే ఏనాటి నుంచో ఉన్న రండాగొండి!" అని ప్రేమ చిలకరించింది మంగి.

ఆచారి మురిసిపోయాడు. ముసిముసి నవ్వులు నవ్వుకుని మంగి బుగ్గగిల్లి "అందుకేనే దేవుడి ప్రసాదం రోజూ ఓ కొబ్బరికాయ చెక్కైనా నీకు యివ్వక పోతే నామనసొప్పదు" అంటూ మంగి పమిట ఒత్తిగించాడు.

మంగి కొంచెం సిగ్గుని అభినయించింది. చీకట్లోనే ఆచార్లు మంగి అందాలను చేతులతోనే చూశాడు.

"మంగీ...ఈ కంపెనీ బాడీ ఎక్కడిది!" అన్నాడు మంగి చెవిలో.

"కమలమ్మ గారిదని చెప్పానుగా— అంది మంగి.

"అది సరేకాని వెళ్ళేటప్పుడు ఈబాడీ నాకు వదిలేసి వెళ్ళు" అన్నాడు ఆశగా ఆచారి.

"లెక్క ప్రకారం బట్టలు అప్పజెప్పక పోతే అమ్మగారు ఈపు సీరుద్ది. అది కాకపోయినా ఇదేం బుద్ధీ! ఆ బాడీ చూసుకుని లొట్టలెయ్యడానికా!" అంది మంగి నవ్వుతూ.

"నేను లొట్టలెయ్యడానికి కాదే. ఆ బాడీతో చాలా పనుంది. అదొక చిదంబర రహస్యం. మళ్ళీ వెళ్ళేటప్పుడు మర్చిపోతావు. ఇప్పుడే ఇచ్చెయ్. దీనితో బోలెడంత మ్యాజిక్కు చేస్తాను. దీని ఖరీదు ఇచ్చేస్తాన్లే" అని ఆచారి తొందరపెట్టాడు మంగిని.

మంగి కాదనలేకపోయింది....

ఇంతలో ఎవరో ప్రహరీ తలుపు తట్టారు. కంగారుపడి మంగి పమిట నిండుగా తీసుకొని నూతి వెనక్కి వెళ్ళి నక్కింది. ఆచారి తలుపు దగ్గరికి వెళ్ళి నెమ్మదిగా 'ఎవరూ' అన్నాడు.

"నేనే లేవయ్యా తలుపు తియ్'" అన్నాడు ప్రెసిడెంటు.

ఇక తప్పదని ఆచారితలుపు తీశాడు. "పండగ కదా ? మందుపార్టీ చేసుకుందామని మీయింటికి కబురంపితే లేవన్నారు. సరే, ఇంకెక్కడికి పోతాడులే దుకాణం గుళ్ళోనే పెట్టుంటాడని తలుపు తట్టాను. ఏటికత! మంగిని ఎక్కడ దాచేవు? అన్నాడు ప్రెసిడెంటు నవ్వుతూ.

ఆచారి "అయ్యా మీకు దండం పెడతాను. ఎంత చెడినా ఆడది. సిగ్గుపడి పోతుంది. తమరు వెళ్ళిరండి. నేను చిటికలో వచ్చి వాల్తానక్కడ. వాలడమే కాదు గొప్ప మ్యాజిక్కు కూడా చూపిస్తాను" అని బతిమాలి పంపించాడు ప్రెసిడెంటుని.

తలుపులు మూసి గుడి వెనక్కి వచ్చి మంగిని బైటకి సాగనంపాడు. మంగి వదిలేసిన బాడీని మాత్రం ప్రాణప్రదంగా ఒక్కసారి గుండెలకు హత్తుకుని, ముద్దు పెట్టుకొని మొల్లో దోపుకున్నాడు. దాని మీద పై పంచెను గట్టిగా బిగించి కట్టుకున్నాడు. ప్రెసిడెంటు ఇంటికి బయల్దేరాడు.

* * *

అప్పటికే ప్రెసిడెంటూ, మునసబూ సగం సీసా ఖాళీ చేశారు.

ఆచారి 'ఏ తీరుగ నను దయ చూచెదవో ఇనవంశోత్తమ రామా!' అని

కూనిరాగం తీసుకుంటూ గదిలోకి అడుగు పెట్టాడు.

"ఆ గుళ్లో రాముడు నిన్ను దయ గానే చూస్తున్నాడు లేవయ్యా. అందుకే నీ ఆటలు సాగుతున్నాయి" అన్నాడు ప్రెసిడెంటు.

"నన్ను దయతో చూస్తున్నది రాముడు కాదండీ, మీరిద్దరూ చూసీ చూడనట్టు ఊరుకుంటున్నారు కాబట్టి, నా ఆటలు సాగుతున్నాయి" అన్నాడు ఆచారి.

"ఊరికే గోలా, రొష్టూ తప్ప నువ్వు మిణికేదుందా, ఏడిసేదుందా? పెద్ద మొగోడిలాగ! గుళ్లోకి ఆ మంగిని రమ్మ నడం కొబ్బరికాయ సెక్కలూ, అరటి పళ్లూ ఇచ్చి పంపడం తప్ప-" అన్నాడు మునసబు నవ్వుతూ.

"అదేమన్న మాటలే. లేగదూడని దువ్వినట్టు కాసేపు ఒళ్లంతా దువ్వి పంపుతాడు" అన్నాడు ప్రెసిడెంటు.

"అయ్యో, అలవాటు పడ్డ ప్రాణం. ఈ వేళ ఉన్నట్టుండి అలవాటు మార్చు కోవాలంటే ఎందుకో ప్రాణం ఒప్పదు! నా సంగతి తెలుసుండి కూడా నన్ను ఆట పట్టించడం దేనికి చెప్పండి!" అన్నాడు ఆచారి.

"సరేలే నువ్వు లేకపోతే సభకి నిండుతనం ఉండదయ్యా ... ముందో రౌండు ఏస్కో. కాత్త ఓపిక ఒత్తది" అన్నాడు మునసబు.

"కష్టపడి ఏడిసింది ఏం ఉంది గనక? ఓపిక లేక పోపడానికి? కాకపోతే దీనికీ అలవాటు పడ్డ ప్రాణం కనక తప్పదు. కృష్ణార్పణం!" అంటూ మునసబు అందించిన గ్లాసుని రెండు గుక్కల్లో సగం ఖాళీ చేశాడు ఆచారి.

"దీన్నగలెయ్య! ఇది మా గొప్ప వ్యసనమండీ! కొంత వయసు దాటేక ఆడదాని మీది వ్యసనం పోతుంది గానీ, ఈ వ్యసనం మాత్రం మనిషి చచ్చేదాకా కూడా ఉంటుంది. ఈ శుభ సమయంలో మీకొక చిత్రమైన అందాన్ని చూపించ దల్చుకున్నాను" అన్నాడు ఆచారి.

"ఏంటయ్యో, అది?" అన్నాడు మునసబు.

"అలా తొందర పడితే ఎలా? నే చూపించబోయే అందం అల్లాటప్పాది కాదు. స్వర్గలోకం నుంచి తెచ్చిన పారి జాతం లాంటిది. మీ కళ్లముందు పెడితే ఈ ఔషధం సేవించడం మానేసి ఆ అందాన్నే చూస్తూ అలా ఉండిపోతారు" అని ఊరించాడు ఆచారి, గ్లాసుని పూర్తిగా ఖాళీ చేసేస్తూ.

"అలా ఊరించకపోతే, అదేమిటో చూపించ కూడదూ?" అన్నాడు ప్రెసిడెంటు.

"ముందా గ్లాసులో మరికాస్త ఔషధం వెయ్యండి" అన్నాడు ఆచారి.

వెంటనే మునసబు గ్లాసులో కాస్త మందు పోసి గోలీసోడా కొట్టి గ్లాసు నింపాడు. ఆచారి తృప్తిగా గ్లాసుని చూసుకుని నడుముకి బిగించిన పై పంచెను విప్పి మొల్లో ఉన్న బాడీని రెండు చేతుల్తోటీ పట్టుకుని భక్తులకి విశ్వరూపాన్ని చూపించినట్టు, నవ్వుతూ నిలబడ్డాడు.

మునసబు నవ్వి "నీ తస్సదియ్య! ఇంకా యేంటో అనుకున్నాను. ఇంతా చేసి బాడీయా? ఇదెక్కడ దొరికిందయ్యా? ఇంతకీ ఎవర్దీ?" అన్నాడు.

"దీని వెనక ఎంత కథ ఉందో మీకు తెలీదు. ఈ బాడీ ఎవర్దో తెలిస్తే-అంత తేలిగ్గా కొట్టి పారెయ్యరు!" అని మరి కాస్త వూరించాడు ఆచారి.

ప్రెసిడెంటు కాస్త చిరాకు పడ్డాడు. "ఎవరిదో చెబుదూ?" అనేశాడు.

"కమలమ్మది... అహ. అరకు రాణిది!" అన్నాడు మునసబు కళ్లలోకి చూస్తూ ఆచారి.

మునసబూ, ప్రెసిడెంటూ కూడా ఆ బాడీనే రెప్పార్పకుండా చూస్తూ ఒక్క క్షణం బొమ్మల్లా ఉండి పోయారు.

"కమలమ్మ బాడీ నీకెలా దొరికిందయ్యా?" అన్నాడు ప్రెసిడెంటు.

"ఏవుండీ! ఏ మందివ్వడానికో వెళ్లుంటాడు ఆళ్లింటికి. ఆవిడగారు సూడకుండా దండేనికున్న బాడీ మందుల పొడిలో కుక్కేసి ఉంటాడు" అన్నాడు మునసబు

"అంతేనా ఆచార్లూ?" అనడిగాడు ప్రెసిడెంటు.

"ఇద్దరూ పప్పులో కాలేశారు. ఆ ఇంట్లో ఎవరికయినా జబ్బు జేస్తేగా, నేనా ఇంట్లో అడుగు పెట్టగలిగేది?" అన్నాడు ఆచార్లు ఇంకా ఊరిస్తూ.

"మరెలా సంపాదించావయ్యా, ఈ బాడీ?" అన్నాడు మునసబు.

"కమలమ్మ బాడీని మంగి వేసు కొచ్చింది. దాన్ని బతిమాలి ఇది సంగ్రహించాను" అన్నాడు ఆచారి నవ్వుతూ.

"నీ తస్సదియ్య. మంగేసు కొచ్చిన బాడీ మాకు చూపిస్తున్నావా? బలేవోడి వయ్యా!" అన్నాడు మునసబు.

"అయినా, బలే నిండుగా ఉందిలే!" అన్నాడు ప్రెసిడెంటు. ఆచారి చేతుల్లోని బాడీని తను తీసుకుంటూ.

"దీని సైజెంతంట్రావ్?" అన్నాడు మునసబు.

"ఏదో అంకి, ఎనకాల పటకా మీద వేసుంటది"అన్నాడు ప్రెసిడెంటు.

"ఆ అంకిల్తో మనకేం పనీ? వడ్లపూడి నారింజో, గొర్రిపూడి జామో, కోనసీమ కొబ్బరో అనుకుంటే సరిపోయె!" అన్నాడు ఆచార్లు.

ముగ్గురూ విరగబడి నవ్వుకున్నారు.

మునసబు నవ్వాపుకొని "అన్నట్టు ఆచార్లూ ... సైజులంటే జ్ఞాపకం వచ్చిందీ...పట్నంలో చదూకుంటున్న మా మేనల్లుణ్ణి సూడ్డానికి ఓసారి నేనెళ్లేనయ్యా. ఆడున్న లాడ్జింగ్ కెళ్ళాను. అది స్టూడెంట్సు లాడ్జిలే. మా మేనల్లుడు ఎంత దూరం నుంచయినా సరే, సిన్న కార్ని సూసి అదే సంవత్సరం మోడలో సెప్పేసేవోడు. అది స్నేహితుడోడున్నాడు. ఆ కుర్రోడు బలే సాకులాంటోడులే ...! ఆ లాడ్జింగ్ కిటికీలోంచి చుట్టు పక్కలున్న ఇళ్ళ పెరట్లో ఆరేసిన బాడీల సైజులు కరెక్టుగా సెప్పేసేవోడు. అలా బాడీల సైజులు సెప్పడం ఇషయంలో ఆ కుర్రోడు సాలా పందేలు కట్టేడంట. ఎంత అనుభవం ఉండాలంటావ్, అలా సెప్పాలంటేనూ"

అన్నాడు మునసబు.

అలా ఆ మందు విందులో ఆ ఖాదీ గురించీ, కమలమ్మ గురించీ, ఆమె అందాల గురించీ చాలాసేపు సాగింది. సీసా ఖాళీ అయింది. పండగ రాత్రి మందు విందు ముగిసింది.



## 5

కమలమ్మ రాముణ్ణి ఏ స్థాయిలో ఉంచాలి అన్న విషయంపట్ల ఓ నిర్ణయానికి వచ్చింది. ఉగాది వెళ్ళిన మూడవరోజు రాముడికి తెలియకుండానే చుక్కమ్మచేత టైలర్ని ఇంటికి పిలిపించి రాముడికి బట్టలు ఏర్పాటు చేసింది. రాముడు ఆ రోజు నుంచీ కమలమ్మ ఆదేశానుసారం ఉద్ధారుడిలాగే జనం దృష్టిలో వ్యవహరిస్తున్నాడు. ప్రెసిడెంటూ, మునసబూ, ఆచారీ—రాముడు ఎంతగానో ఎదిగిపోయాడు ... అన్న నిర్ణయానికి వచ్చేశారు. అరవై ఎకరాల సేరీ వాడి గుప్పిట్లో చిక్కుకు పోయిందని మధన పడిపోతున్నారు. ఏదో పన్నాగం పన్నాలనుకున్నారు. ఒక రోజున నరసింహాన్ని చిత్తుగా తాగించారు.

"నువ్వుండగా కూడా, ఆ పాలేరు వెధవకి పట్టం కట్టిందేవిటయ్యా మీ చెల్లెమ్మా?" అన్నాడు ప్రెసిడెంటు.

"దానాస్తి ... దానిష్టం వచ్చినట్లు చేసుకుంటుంది. మన మీద నమ్మకం లేదు. వాడు తన చెప్పుచేతల్లో ఉంటాడు. తప్పేముంది?" అని సరిపెట్టుకున్నాడు నరసింహం.

మునసబు "అది సరేనయ్యా, నలుగురి దృష్టిలోనూ నువ్వు పల్చబడి పోవడంలే? సరదాగా పేకాడుకుందుకు... ఒక వందిరూపాయలు కావలిస్తే.... ఆడదానిముందు చేతులు కట్టుకొని నిలబడి అడగాలీ అంటే— తల కొట్టేసినట్టు అన్పించదూ మగాడికి?" అన్నాడు. అని నరసింహాన్ని రెచ్చగొట్టేడు. ఆచారి ఒక సుక్క గుటుక్కున మింగి "నేనో సలహా చెప్పనా?" అని ఆగేడు.

'ఏమిటది?' అన్నట్టు ప్రెసిడెంటూ, మునసబూ అతని ముఖంలోకి చూశారు.

"చిల్లర మల్లర ఖర్చులకింద మీ ఇద్దరి దగ్గరా పదేసివేలు నరసింహం పుచ్చుకున్నట్లుగా ప్రోనోటు సృష్టిండామనుకోండి... ఒక్కసారిగా ఇరవై వేలు నరసింహం చేతుల్లోకి వస్తాయి... ప్రస్తుతానికి నరసింహం ఆటకీ అడ్డు ఉండదు ... ఈ పాచిక గనక పారినట్లయితే గాదికింద పందికొక్కు గాదికిందే బతికినట్లు మన నరసింహం— దఫదఫాలుగా అలా వసూలు చేసుకుంటూ మనతో పాటు హాయిగా బతికేస్తాడు..." అని సలహా ఇచ్చాడు ఆచారి.

"సయాపైస ఇవ్వను... అవతలికి పొమ్మంటేనో కమలమ్మ?" అన్నాడు

మునసబు.

"అదీ పాయింటే'" అన్నాడు ప్రెసిడెంటు.

"...అందుకని అట్నించి నరుక్కు రావాలి. ఆ రావుడుగాణ్ణి మన గుప్పిట్లో పెట్టుకుంటే అన్ని సంగతులూ చక్క బడతాయి, కొన్నాళ్ళకి రావుణ్ణి బైటికి పొమ్మంటది కమలమ్మ... ఆ తరవాత మనం దగ్గరవచ్చు. సిలక పంజరంలో సిక్కినట్టే" అన్నాడు మునసబు.

"అమ్మా! మునసబుగిరీ చేస్తున్నావు గాని... నీది కరణం బుర్రయ్యా...!!" అని ఆచారీ, ప్రెసిడెంటూ కూడా మెచ్చుకున్నారు.

"నన్ను మెచ్చుకోటం మాటకేం గానీ— ఆ రావుడుగాణ్ణి దార్లో పెట్టా లంటే నువ్వే నడుంకట్టాల ఆచార్లూ... ఆడు మమ్మల్ని నమ్మడు" అని భారం ఆచారి నెత్తినే పెట్టాడు మునసబు.

"అదెంత పని? మజ్జిగను పాలుగా మార్చడం కష్టంగాని, పాలను విరిచే దానికి ఒక ఉప్పుకల్లు చాలు. ఆ బరువు బాధ్యతలు నాకు వదిలెయ్యండి. నేచెప్పిన సలహా కొట్టెయ్యకండి... ఇరవై వేలకీ నరసింహంచేత ప్రోనోటు సృష్టిస్తే— మొట్టమొదటిసారి అన్నగారి పరువు కాపాడ్డం కోసం కమలమ్మ కాదనదు" అన్నాడు ఆచారి మరో రౌండుకి సిద్ధ మవుతూ.

"మందుమీద నీ బుర్ర బలేగా పన్చే స్తదయ్యా" అన్నాడు ప్రెసిడెంటు.

"మందు ... మందు ... అని పది సార్లు అనకండి నాకేదో ఎబ్బెట్టుగా ఉంటుంది. ఏముందయ్యా ఇదీ? వట్టి బాలింత మందు. ప్రతి బాలింతరాలూ పురుట్లో తాగే బ్రాందీ" అన్నాడు ఆచారి.

అందరూ నవ్వుకున్నారు. ఆచారి సలహా ప్రకారం నరసింహంచేత ప్రామిసరీ నోట్లు పదేసివేలకు రాయించారు. తాగుడు మైకంలో ఉన్న నరసింహం సంతకాలు చేశాడు. ఓపక్క తనను కాదని రాముణ్ణి నెత్తికి ఎక్కించుకొం టోందన్న కోపం కూడా అతనలా సంతకం చేయడానికి కారణమయింది. ఆచారి నవ్వుకొని "పద్మవ్యూహం పన్నేం. ఎవరు అభిమన్యుడో...ఎవరు సైంధవుడో చూద్దాం" అన్నాడు.

నరసింహం "నువ్వు మాత్రం శ్రీకృష్ణుడవయ్యా ... నీకు నామా లున్నాయి. నమస్కారం." అన్నాడు.

ముగ్గురూ మళ్ళీ నవ్వుకున్నారు.

* * *

**ప్రెసిడెంటు వెంకటయ్య పుట్టుకతోటే శ్రీమంతుడు కాదు. అలా అని చెప్పి తిండికీ, బట్టకీ లోటు లేదు. పది ఎకరాల పొలం, ఐదు ఎకరాల మెరక— తాత తండ్రులిచ్చిన ఆస్తి ఉంది. ఆ భూమిని దున్నుకొని, పండించుకుంటూ ముప్పయ్యేళ్ళ వరకూ ఊరిని అంటిపెట్టుకుని ఉన్నాడు వెంకటయ్య. ఊరి పొలిమేరలు దాట లేదు. కమలమ్మ భర్త రాయలంగారి సరిహద్దు చేనే వెంకటయ్యది. దాంతో ఒకసారి రాయలంగారితో పరిచయం అయింది. వెంకటయ్య అణకువా మంచితనం చూసి**

రాయలంగారే చేరదీసేరు. వ్యవసాయం పనుల్లో కూడా రాయలంగారి ఎడ్లనూ, నాగళ్ళనూ, మిగిలిన వరి ఆకునూ వెంకటయ్య వాడుకుంటూ ఉండేవాడు.

దాంతో రాయలంగారి లోగిలి అరుగులు వెంకటయ్యకి ఆశ్రయం అయ్యాయి రాయలంగారు పుట్టుకతోటే సంపన్నుడు గాబట్టి ఇలాంటి వాళ్ళను చాలా మందిని ఆదుకొనేవాడు. ఆయనకు పాతికేళ్ళు వచ్చేసరికి తల్లిదండ్రిపోయేరు. పెత్తనం చేతికి వచ్చింది. ఇంటి పెత్తనంతోబాటు తండ్రి చలాయించే వూరి పెత్తనం కూడా ఆయన చేతులకు వచ్చింది.

తండ్రిపోయిన తరవాత, తండ్రిలాగే ఆయన ఆవూరి ప్రెసిడెంటు అయ్యేడు. దాంతో చీటికీ మాటికీ పక్కనున్న పట్నానికి వెళ్లడం, సమితి మీటింగులకి వెళ్ళడం మామూలైపోయింది. గ్రామాల్లో అలాంటి పెద్దవాళ్ళకు వెనక ఎవరో ఒకరు తోకలా ఉండడం రివాజు. ఆ తోక—వెంకటయ్య !

రాయలంగారి బేగు పట్టుకోవడం, ప్రయాణం చేసేటప్పుడు బస్సు టికెట్లూ, రైలు టిక్కెట్లూ కొనడం, సినిమాకి వెళితే సినిమా టికెట్లు తీయడం – వెంకటయ్య కార్యకలాపాలు. వెంకటయ్య మొత్తం ఖర్చు భరించడం రాయలంగారికి మామూలు విషయం. అలా అంటి పెట్టుకొని ఉండడంతో వెంకటయ్యను రాయలంగారు పంచాయితీ బోర్డు మెంబరు చేశారు. వెంకటయ్యకు కాస్త హోదా పెరిగింది. ఖద్దరు పంచీ, ఖద్దరు లాల్చీ వేసుకోవడం మొదలుపెట్టాడు. చుట్టలు కాల్చడం మానేసి, సిగరెట్లు తాగడం మొదలుపెట్టాడు. రాయలంగారి పక్కని కూర్చునే స్థాయి, రాయలంగారు ఇచ్చిన చనువు మూలంగానే వచ్చినా, దాన్ని నిలదొక్కుకోవాలన్న తాపత్రయం బయలుదేరింది అతనిలో.

రాయలంగారి వెంట సమితి ఆఫీసుకీ, పట్నానికీ వెళ్ళినపుడు అధికార్లతో పరిచయాలు పెంచుకున్నాడు. నమస్కారాలు పెట్టడం అలవాటు చేసుకున్నాడు. పొందికగా మాట్లాడ్డం, మాటల్లో నాజూకు తనం వచ్చే యతనికి. అంతేకాకుండా, అప్పుడప్పుడు రాయలంగారితోటీ, రాయలంగారు ఆఫీసర్లకీ ఇచ్చే విందులతోటీ పరిచయం ఏర్పడింది. ఆ విందులనుకొత్తల్లో ఏర్పాటు చేసేవాడిగా ఉండి, నెమ్మదిగా పాల్గొనే వాడయ్యాడు. దాంతో మందు అలవాటయ్యింది.

రాయలంగారి దయతో, ఆఫీసర్ల పరిచయాలతో చిన్న చిన్న కాంట్రాక్టులు మొదలు పెట్టాడు. పెట్టుబడి రాయలంగారిదే ... అడ్డదార్లో డబ్బు సంపాదించడానికి మార్గాలు తెలుసుకున్నాడు. మందు, మగువ ఎటువంటి పనులనైనా సాధించడానికి తారక మంత్రాలని గ్రహించాడు. ఆ మంత్రాన్ని జపిస్తూ ఒక్కొక్క మెట్టే పైకి ఎక్క సాగేడు. అటువంటి సమయంలో అనుకోకుండా రాయలంగారు పోయారు. ఊళ్ళో ఖద్దరు పంచీ, ఖద్దరు టోపీ వేసుకొనే మగాడు రాయలంగారి తర్వాత వెంకటయ్యే !

దాంతో - అధికార్లతో ఉన్న పరి

చయాన్ని అడ్డుపెట్టుకుని ఊరికి ప్రెసి డెంటు అయ్యాడు. అది నుంచీ సిరి సంపదలు ఉన్నవాళ్ల ప్రవర్తన జనాని కంత ఇబ్బందిగా ఉండదు కాని, నడ మంత్రపు సిరి వచ్చినవాడి ప్రవర్తన జనకంటకంగానే ఉంటుంది. ప్రెసి డెంటయిన సంవత్సరమే వెంకటయ్యకు కళ్ళు నెత్తికెక్కాయి. అధికారం చెలా యించాలన్న కోరిక పెరిగింది. కొత్తగా మనిషి నెత్తురు చవి చూసిన పులిలా ఊరిమీద పడ్డాడు. స్కూల్లో పని చేసే పంతులమ్మల్నీ, కాస్త కంటికి అందంగా అగుపడే ఆడ కూలీలనూ వేటాడ్డం మొదలు పెట్టాడు. అధికారానికి తల వొంచి కొందరు లొంగేవారు. కొందరు తెలివిగా తప్పించుకునేవారు.

ఒకరోజున...

తన పొలంలో పని చేసే వీరిగాడి పెళ్ళాన్ని పాకలోకి పిలిచి వెంకటయ్య చెయ్యి పట్టుకున్నాడు. వీరిగాడి పెళ్లాం సీతాలు ఎదురు తిరిగింది.

"పెద్దోరు. మీలాంటారికిదేంబుద్ధండి? కూటికోసం(వం)ని ఫన్లో కొచ్చేం గానీ, కులం సెరుపుకొందికి కాదు! మాది తక్కువ కులమే అయినా మాకూ గుణ వుంటాది. మా మావకి తెలిత్తే గొడవ సానా దూరం పోద్ది!" అని ముఖం వాచేలా చీవాట్లు పెట్టి వెళ్ళిపోయింది.

దాంతో ఎలాగైనా సీతాల్ని దారికి తేవాలన్న పట్టుదల వెంకటయ్యకి కలి గింది. ఒకరోజు...

వీరిగాణ్ణి కుప్ప దగ్గర కాపలా ఉంచి, సీతాలుని మొగుడికి ముంత తెమ్మని కబురంపేడు వెంకటయ్య. రాత్రి పూట సీతాలు కుప్ప దగ్గర కాపలా ఉన్న వీరిగాడికి ముంత తెచ్చింది.

అదే సమయానికి—

వీరిగాడికి ఏదో పని పురమాయించి పక్క ఊరికి పంపించాడు. సీతాలుని బలవంతంగా చెరిచాడు. ఆ అవమానం తట్టుకోలేక సీతాలు ఆత్మహత్య చేసు కుంది.

సాధారణంగా, ఆత్మహత్య చేసు కున్న మనిషి శవాన్ని—శవపరీక్ష చెయ్యకుండా దహనం చెయ్యరు. కాని మునసబు ఆసరాతో సీతాలు శవానికి అటువంటి పరీక్షలు ఏమీ లేకుండా వీరి గాడు దహనక్రియలు చేసుకునేందుకు అవకాశం కల్పించాడు వెంకటయ్య. ఆ రకంగా మునసబు ప్రెసిడెంటుకి చేరువ అయ్యాడు.

మునసబుకి వీరిగాడి పెళ్లాం ఎలా పోయిందో కొంతవరకూ తెలుసు. వీరి గాడికన్నా తరవాత్తరవాత కొంత వరకూ విషయం అర్థమైంది. చాటు మాటుగా "ఆ ప్రెసిడెంటు మూలానే నా పెళ్లాం పోయింది. నా కోసం పొలా నికి ముంతట్టుకొచ్చిందట. ఆ తరవాత దాని శవం కోనేట్లో తేలింది. ఎప్పటి కైనా ఇసయం పూర్తిగా బైటపడాల. దాని సావుక్కారనమైనోడు నా సేతులో సావాల!" అంటున్నాడు అక్కడక్కడ.

ఆ మాటలు వెంకటయ్య చెవిని పడ్డాయి.

ఆ వీరిగాణ్ణి ఎలా వదిలించుకోవడమా అనేది ఒక సమస్య అయింది వెంక

టయ్యేకు.

అదే సమయానికి—

ఊరు పక్కగా ఉన్న మునసబు చేనుకోసం హరిజనులు దరఖాస్తు పెట్టుకున్నారు. అధికారులు వచ్చి తనిఖీ చేసి ఆ పొలాన్ని ఇళ్ల స్థలాలుగా కేటాయించడానికి అంగీకరించారు. తన చేను హరిజనుల ఇళ్ళ స్థలాలకు ఇవ్వడం మునసబుకి సుతరామూ ఇష్టం లేదు. అటువంటి సమయంలో ప్రెసిడెంటు వెంకటయ్య మునసబుని ఆదుకున్నాడు. తన పలుకుబడి ఉపయోగించి తాసీల్దార్ని ఒప్పించి, రెండెకరాలే ఉన్న మరొక చిన్న రైతు పొలాన్ని హరిజనులకు ఇళ్ల స్థలాలుగా ఇప్పించాడు. ఆ చిన్న రైతుకి ప్రభుత్వం నుంచి నష్టపరిహారమైతే వచ్చింది కాని, అదే డబ్బుకి రెండెకరాల భూమి రాక, భూమి లేనివాడయ్యాడు. రైతు—కూలీగా మారిపోయాడు.

దాంతో మునసబుకీ ప్రెసిడెంటుకీ స్నేహం బాగా పెరిగిపోయింది. మునసబుకి కరణంతో పడక, ప్రెసిడెంటు అండకూడా అవసరమైంది. అలా వాళ్ళిద్దరూ పాలూ, నీళ్లుగా కలిసిపోయారు.

ఒక మండు వేసవి కాలంలో—

ఓ రైతు కుప్ప అంటుకుంది. ఆ కుప్పను వీరిగాడే అంటించాడని దొంగ సాక్ష్యం పుట్టించి మునసబు చేత బకీదు రాయించాడు వెంకటయ్య. పోలీసులు వచ్చి వీరిగాణ్ణి అరెస్టుచేసి తీసుకువెళ్లారు. చెవులే కాని కళ్లు లేని కోర్టు మునసబు-ప్రెసిడెంటు సృష్టించిన సాక్ష్యాలను నమ్మి, నిజాన్ని చూడలేకపోయింది. వీరిగాడికి ఏడేళ్ళు జైలు శిక్ష పడింది. జైలు శిక్ష పడిన నాటి రాత్రి "ఆడు శిక్షయిపోయేక మళ్ళీ వస్తాడు. నువ్వు జాగ్రత్తగా ఉండాలిస్మా" అన్నాడు మునసబు వెంకటయ్యని హెచ్చరిస్తూ.

"సరేలే. ఏడేళ్ళ తరవాత మాట కదా? అప్పటికి నువ్వు నా పక్కని ఉండవా! ఆడు ఊళ్ళోకి రాకుండా, అక్కణ్ణించి అక్కడే మరో కేసు బనాయించి ఆణ్ణి బొక్కలోకి తోయించలేమా? ఇదిగో ఈ వెయ్యి రూపాయిలూ నీ దగ్గరుంచు" అన్నాడు ప్రెసిడెంటు కొత్త నోట్ల కట్ట మునసబుకి అందిస్తూ.

గ్రామ మునసబుగా అంత రాబడిని ఒక్కసారిగా కళ్ళజూడడం అదే మొదటిసారి మునసబుకి. అలా మునసబు ప్రెసిడెంటుకి అమ్ముడుపోయాడు. ప్రెసిడెంటు డబ్బు, అధికారం మునసబునీ, మునసబులాంటి ఆచారినీ, ఇంకా చాలామందినీ కొనేసింది ఆ వూళ్ళో.

తన గుట్టూ మట్టూ తెలిసిన మునసబుకి వెంకటయ్య తన సుఖాల్లోనూ, వినోదాల్లోనూ కొద్దో గొప్పో వాటాయిస్తాడు. కొత్త కొత్త మైకాలను రుచి చూపిస్తాడు. మునసబుని మైకంలోనే ఉంచుతాడు...అదీ వాళ్ళిద్దరి స్నేహం, అన్యోన్యతా!



# 6

రెండు రోజులపాటు రాముడికెక్కడా ఊపిరి సలపనంత పని. చెరకు కొట్టించి, లారీలకు ఎక్కించి ఫ్యాక్టరీకి తోలిస్తున్నాడు. తాను ఉద్ధారుడని కమలమ్మ చెప్పినా కూలీల్తో కలిసి రాముడు చెరుకు నరుకుతూనే ఉన్నాడు. సాయంత్రపు వేళ కూలీలందరికీ 'కూలి' బట్వాడా చేసి మధ్యాహ్నపు వేళ వచ్చిన భోజనం అప్పుడు తింటున్నాడు. రెండు రోజుల్నుంచీ రాముడు ఇంటికి రాకపోవడంతో రత్తి ఏటికి అడ్డం పడింది. ఏరులా పొంగే వయసులో ఉన్న రత్తి చిరుపొంగులో ఉన్న ఏటిని పాయలు చేసుకొంటూ ఊరున్న ఒడ్డుకు వచ్చింది. మోటర్ షెడ్డు దగ్గర కూర్చుని భోజనం చేస్తున్న రాయిడు రత్తి కంటపడ్డాడు. చేనడ్డంబడి చెరుకుతోటగోదుల్లోంచి బాకుల్లా విచ్చుకున్న చెరకు ఆకుల్ని తప్పించుకొంటూ రాముడు కూర్చున్న మోటర్ షెడ్డు దగ్గరికి చేరుకుంది. అతని వెనకాల్నుంచి పిల్లిలా అడుగులో అడుగు వేసుకొంటూ వచ్చి, దరిదాపుల్లో ఎవరూ లేరని నిర్ధారణ చేసుకొని రత్తి రాముడి కళ్లు మూసింది. రాముడు ఉలిక్కిపడి గాజుల అలికిడి విని "ఏయ్! ఎవరే అది?" అన్నాడు—ఎడం చేత్తో ఆమె చేతుల్ని విదిలిస్తూ.

రత్తి మోటర్లోంచి పడుతున్న నీటి ధారలా గలగలా నవ్వింది. మొదటిసారిగా సంధ్య వెలుగులో రాముడు రత్తిని చూశాడు! తన ఇంట్లో దీపం వెలుగులో రత్తిని తానంతగా పరకాయించి చూడలేదు. మాటలు మాత్రమే విన్నాడు. చెరకాకు పసల్లా, బాకుల్లా వంపు తిరిగిన చెంపకు చారెడేసి కళ్లూ...సంపెంగ మొగ్గలాంటి ముక్కూ... చిరుగాలికి ముఖం మీదికి జారిన ఉంగరాలు తిరిగిన ముంగురులూ...కళ్లకు నల్లగా మెరిసే కాటుకా...నుదుట కుంకుమ బొట్టూ, మెళ్లో గుళ్లపేరూ... పిటపిటలాడే జాకెట్టూ, సన్నని నడుమూ...మడమల పైన ఎగిరెగిరి పడే లంగా కుచ్చిళ్లూ— చూడ్డానికి రత్తి తొలికాపుకి వచ్చిన గున్నమామిడి మొక్కలా అన్పించింది. రాముడికి.

రత్తి అలా చూస్తూ ఉండిపోయిన రాముడి పక్క కుర్చుంటూ "కళ్లు మూత్తే 'ఎవరే అది?- అంటున్నావ్... ఈ ఊళ్ళో ఇంకా ఎవరైనా ఉన్నారేటి ? నాలా కళ్లు మూసి నీతో పరాసికాలాడే వోళ్లు?" అంది.

"నీ తస్సాదియ్య! ఆల్లేదు సూల్లేదు కొడుకు పేరు సోమలింగం అన్నట్టు నీ మెడలో ఇంకా నేను తాళికట్ట లేదూ... నువ్వు నా పెళ్లాం అవలేదూ...అప్పుడే సవితి నెతుక్కుంటున్నావా సవతుల కయ్యానికి?" అన్నాడు రాముడు నవ్వుతూ.

"నీ మీద నాకా అపనమ్మకం లేదు

బావయ్యా నీ పేరు రాముడు. ఆ రాముడికి సీతొక్కత్తె అయినట్టు, ఈ రాముడికీ రత్తి ఒక్కర్తే..." అంది రత్తి ఎంతో నమ్మకంతో రత్తి నమ్మకానికీ, ఆప్యాయతకీ రాముడు తనలో తనే ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. పైకి మాత్రం నవ్వేసి "మాటలు నేర్చేవే..." అంటూ రత్తి బుగ్గ మీద చిటిక వేశాడు. రత్తికి తొలిసారిగా ఒళ్లంతా సరికొత్త పులకింతలు కలిగించింది- ఆ చిటిక! రాముడు అక్కడనుంచి లేచి "పోదాం పద" అన్నాడు.

రత్తి చెంగున లేచి "ఇంటికేనా?" అంటూ రామునికంటే ముందు నడిచింది. ఆమె వెనకనుంచి రాముడు పిరుదుల మీదికి వేళ్లాడే జడను అందుకొని "ఏటే ఆ పరుగూ?... గజ్జెల గుర్రంలాగా!" అని జడను వెనక్కి ఒక గుంజు గుంజాడు. రత్తి ఆ వూపుకి రాముడి గుండెల మీద వాలింది. రాముడి చేతి లోని జడలాక్కుని "సుతి మించి పోకురో పోకిరీ పిల్లాడా... ఇల్లాటే సాలేత్తె బామ్మతో చెప్తాను." అంటూ జడ లాక్కోబోయింది. రాముడు రత్తిని గట్టిగా సందిట్లో బిగించి "ఏమని చెప్తావే?" అంటూ డిడిక్కి కొట్టాడు.

"అమ్మో... పోట్లగిత్తలా ఏంటీ ఇసురూ!" అంటూ విదిలించుకొని రత్తి పరుగెత్తింది.

రత్తి వెనక రాముడూ పరుగెత్తాడు. రత్తి అందాలను చూసిన తరవాత రాముడి మనస్సు ఉరకలు వేస్తోంది. అతనిలో కొత్త అల్లరి బయలుదేరింది. అది వాళ్లిద్దరికీ వయసు ఇచ్చిన వరం.. అమాయకమైన ఆప్యాయితతో నిండిన మనసు చెప్పిన పాఠం. మొత్తానికి ఏటి ఒడ్డున పరుగెడ్తున్న రత్తిని బాణం వేయకుండా లేడిని పట్టుకోవాలనుకున్న వేటకాడిలా, రాముడు పట్టుకున్నాడు. రత్తి ఆయాసపడుతోంది. ఆమె వయసు ఏటి కెరటాల్లా ఎగిరెగిరి పడుతోంది. రాముడి చెయ్యి పట్టుకొని "రా బాయ్యా... ఇయాల మన గుడిసికెల్దాం. బామ్మ నీ కోసం రెండు రోజుల్నించీ ఎదురుసూ తంది" అంటూ చేతిని భుజం మీద వేసుకొని లాక్కుపోతోంది రత్తి.

అల్లంత దూరం నుంచి రాముణ్ణి వెతుక్కుంటూ వస్తూన్న ఆచారి వాళ్లిద్దరి సరసాన్ని కళ్లారా చూశాడు. 'రాముడు కృష్ణుడై పోయాడేమిటీ?' అనుకుంటూ గబగబా అంగలు వేసుకుంటూ "రాముడూ "రాముడూ" అంటూ అరుస్తూ వచ్చాడు. ఆ పిలుపు విని రాముడు ఆగేడు.

"ఈయనెవరు మద్దిలో?" అని గొణిగింది రత్తి.

"పానకంలో పుడక..." అని రత్తి చెవిలో చెప్పి "దండాలండి... ఇలా వచ్చేరేటి?" అన్నాడు ఆచారితో రాముడు.

వచ్చిన పని మరిచిపోయిన ఆచారి రత్తిని రెప్పవాల్చకుండా చూస్తూ "ఈ పిల్ల ఎవర్రా?" అనడిగాడు.

"మనూరిది కాదు లెండి. పొరుగూరి పిల్ల మా మామ కూతురు..." అన్నాడు కాస్త సిగ్గు పడ్తూ.

"అలా సూటిగా చెప్పొచ్చుగా! ఈ డొంక తిరుగు డంతా ఎందుకురా? వెధవ మొహమాటం నువ్వూనూ... పిల్ల పంచదార చిలకలా ఉంది. పైగా పోనివ్వకు ముహూర్తం పెట్టించేసుకో. నేను దగ్గిరుండి అక్షింతలు వేయించేస్తాను," అని ఉషారిచ్చేడు ఆచారి.

"నా పెళ్లికేం తొందరొచ్చింది లెండి ఇంతకీ తమరేం పని మీద వచ్చేరూ!" అన్నాడు రాముడు.

"నువ్వు వేరే పనిమీద ఉన్నట్టున్నావు... ఒక ముఖ్యమైన విషయం నీతో మాట్లాడ్దామని వచ్చాను. పోనీ... తర్వాత మాట్లాడ్దాంలే..." అని నసిగాడు ఆచారి.

"పర్లేదు...సెప్పండి... నువ్వింటికి నడే రత్తీ! ఆచారి గారితో మాట్లాడొత్తాను" అన్నాడు రాముడు.

రత్తి బుంగమూతి పెట్టి, పాదాలను నేలకు బాదుకుంటూ "బేగా రావాలీ మరి!" అంటూ ఏరు దిగిగూడెం వేపు బయల్దేరింది.

ఆచారి తన వ్యూహాన్ని పన్నడం మొదలెట్టాడు.



# 7

వ్యవసాయం తెలిసినవాడు ముందుగా నేలను పదునుచేసి విత్తనం నాటుతాడు. వ్యవహారం తెలిసినవాడు ఎదుటి మనిషిని ముందుగా తనమాట వినేలా తనవైపుకు తిప్పుకొని ఆ తర్వాత తాను చెప్పదల్చుకున్నది చెప్తాడు. ఆచారి వ్యవహర్త, మాటకారి. తాను రాముడి దగ్గరికి వచ్చిన పనివేరే అయినా దేవుణ్ణి అడ్డుపెట్టుకొని చదరంగం ప్రారంభించాడు.

"ఎల్లుండి ఏకాదశిరా ... రామాలయంలో ఏకాహం ఉంది. ఒక అరటి పళ్ళగెల ఇస్తావేమోనని వచ్చాను" అన్నాడు ఆచారి రాముడితో.

రాముడు వెనకా ముందూ ఆడకుండా గెలను పంపిస్తానన్నాడు.

"మీ అమ్మగారేమన్నా అంటారేమో? అయినా... ఈ చిన్న విషయం ఆవిడకి తెలియడమెందుకులే?" అని గొణిగాడు ఆచారి

రాముడు నవ్వుకొని "దేవుడికిచ్చినందుకు అమ్మగారెప్పుడూ అడ్డు చెప్పరు లెండి. ఆరికి సెప్పకుండా పూచికపుల్ల కూడా నేనూ ఎవరికీ ఇవ్వను" అన్నాడు.

ఆచారి రాముణ్ణి ఎంతో జాలిగా చూస్తూ "వెర్రిమొహమా! ఇంత పండిస్తున్నావ్. ఇంత వ్యవసాయం చేస్తున్నావు... అమ్మగారికి తెలియకుండా ఒక్క అరటిపళ్ళగెల దేవుడికిచ్చే స్వాతంత్ర్యం లేదు నీకు" అన్నాడు.

"అదేవన్న మాటండీ? అమ్మగారి సొత్తు దానమియ్యడానికి నేనెవర్ని?" అన్నాడు రాముడు అమాయకంగా..

"కావాలనుకుంటే అన్ని అధికారాలూ

సంపాదించుకోవచ్చు. నీ అంతట నువ్వు దానమిచ్చి పుణ్యమూ మూటగట్టుకో వచ్చు" అన్నాడు ఆచారి.

"కూలి పన్జేసుకు బతికేవోణ్ణి. అధికారాలూ పున్నెలూ నాకెందుకు లెద్దురూ? తిండికీ గుడ్డకీ లోటులేకుండా ఇలా సాగిపోతే సాలు!"

"ఈ తృప్తేరా మనిషిని ఎదగనివ్వకుండా చేస్తున్నది. ఈ సమయంలో నువ్వు తలుచుకుంటే పదెకరాలు కొంద్రా సంపాదించుకోవచ్చు.... ఆ గూడెం వదిలేసి ఏటపతల గుమ్మడి గింజలాంటి డాబాయిల్లూ కట్టుకోవచ్చు".

"బలేవోరే! ఏదేనా పాతేనా దొరకాలి...లేకపోతే లాట్రీయైనా రావాలి... అయ్యన్నీ మనకెలా పత్తాయండీ!"

"నువ్వు సరేనను. రెండేళ్ళు తిరగకుండా పదెకరాల కొంద్రా, డాబా ఇల్లూ నీకు నేను ఏర్పాటు చేస్తాను. మన ప్రెసిడెంటుగారేమన్నాడో తెలుసా? అసలు నువ్వంటే ఎంత అభిమానవో! తెలుసా ఆయనకి...! 'రాముడంతటి నిజాయితీపరుడు లేడు వూరిమొత్తం మీద... పాపం వాణ్ణొకంట కనిపెట్టాలి మనం'— అన్నాడు..."

"పెద్దోరి కామాత్రం దయుంటే సాల్లెద్దురూ" అని సిగ్గుపడ్డాడు రాముడు.

"అంతేకాదురా... లారీలకు లారీలు చెరుకు సుగర్ ఫేక్టరీకి తోలుతున్నావా? ఈ సీజన్లో రోజుకి రెండు లారీలు చొప్పున ఈ చేలోవి ప్రెసిడెంటుగారి ఎకవుంటులో పడేలా చూసేవనుకో... ఈ సీజన్లోనే పదివేలు తక్కువ కాకుండా సంపాదిస్తావు.... నువ్వు సైయంటే ప్రెసిడెంటు సిద్ధమే" అని విషయాన్ని విడమర్చాడు ఆచారి.

రాముడు స్థానంలో మరెవరైనా ఉంటే ఏంచేసేవారో, రాముడు మాత్రం నిప్పురవ్వలా మండిపోయాడు. కానీ తమాయించుకున్నాడు. పూజారి ముఖంలోకి సూటిగాచూస్తూ "బాబూ, దేవుణ్ణి కొలవడానికొచ్చేవోళ్ళు పాపాలు చేయొచ్చు. రోజూ దేవుడి దగ్గరే ఉంటూ దేవుడి మనిషిగా చెలామణీ అయ్యే మీలాంటి పెద్దోళ్ళు నాలాంటి తెలీనోడికి— మంచి చెప్పాలగానీ ఇలా చెడు బోధించకూడదు. ఇలాంటి లుచ్చా పన్లకి దిక్కూడదు బాబుగారూ! ఆ దేవుడేవొచ్చి సెప్పే మాత్రం నా తల్లిని మోసం జేత్తానా! గోచిపాతతో నేనా కమతంలో చేరితే ఈ నాటికి నన్నింతటోడిని చేసింది. నన్ను నమ్మి ఈ సేరీ అంతా నాకప్పజెప్పింది. డబ్బుకోసం గడ్డితిన్నం నాచేత కాదు బాబూ" అని రాముడు ముఖం మీద కొట్టినట్టు చెప్పాడు ఆచారికి.

వాడి నిజాయితీ, కమలమ్మ అంటే వాడికి ఉన్న మూఢ విశ్వాసం ఆచారి వలలో వాడిని చిక్కనివ్వకుండా కాపాడేయి.

ఆ దెబ్బతో రాముడి ద్వారా ఏదో సాధించాలి... కమలమ్మ కమతాన్ని గుల్లచెయ్యాలి.... అన్న ఆలోచనను ప్రెసిడెంటూ, మునసబూ విరమించుకున్నారు. మరో మార్గం తొక్కడానికి నిర్ణయించుకున్నారు.

సాధ్యమైనంతవరకూ సరాసరి కమలమ్మతోనే పరిచయం పెంచుకుని ఆమెకు నమ్మకం కలిగించి ఆమ ఆస్తి మీద పెత్తనం చలాయించాలి... అన్న ఆలోచనలు వాళ్ళ ముగ్గురి మధ్యా సాగుతున్నాయి. అంతరాంతరాల్లో— అసలు కమలమ్మనే చేజిక్కించుకుంటే వ్యవహారం అన్ని విధాలా సానుకూలం అవుతుందన్న తలంపు కూడా ప్రెసిడెంటు మనసులో లేకపోలేదు. కానీ, మధ్యా మండువా గుమ్మం తెరదాటి బైటికి అడుగుపెట్టని, నిప్పులాంటి కమలమ్మకు చేరిక అవడానికి మార్గమేమీ తోచడం లేదు.

'మచ్చిక చేసుకుంటే పాములూ చెప్పినట్లు ఆడతాయి. అడవి జంతువులా తోకాడిస్తాయి...'అని తనకు తనే నచ్చ చెప్పుకున్నాడు ప్రెసిడెంటు.



# 8

ఆ రోజు చినబాబుకి జ్వరం వచ్చింది

మూసిన కన్ను తెరవటం లేదు. కమలమ్మకి ఏం చేయడానికీ తోచలేదు. చుక్కమ్మను పిలిచి ఆచారి గారిని పిలుచుకు రమ్మంది. ఊళ్లో ఉన్న వైద్యుడతడొక్కడే. కమలమ్మ దగ్గర్నించి కబురు రావడమే అదృష్టం అనుకుని రెక్కలు కట్టుకు వాలేడు ఆచారి.

అయిదేళ్ల చినబాబు కమలమ్మ పడగ్గదిలోనే మంచం మీద మూలుగుతూ పడుకున్నాడు. బాబు పక్కనే వాడి మీద చెయ్యి వేసి కూర్చుంది కమలమ్మ. బాబు కనురెప్పలు తెరిచీ తెరవనట్టు మూతలు పడివున్నాయ్. చుక్కమ్మ వెనక ఆచారి ఆత్రంగా కమలమ్మ పడగ్గదిలోకి అడుగుపెట్టాడు. ఆ గదిలోకి అడుగు పెట్టడం అతనికదే మొదటిసారి. పెళ్లి చూపులు తరవాత కమలమ్మను కళ్ల నిండా చూడ్డం మొదటి సారిగా రాయలంగారు పోయినప్పుడు. తర్వాత మళ్లీ ఇప్పుడే! కమలమ్మ అందాన్ని చూసే సరికి ఆచారి కళ్లు జిగేలుమన్నాయి.

'పెళ్లి నాటి కంటే ఇప్పుడే బాగుంది. పువ్వు మొగ్గగా ఉన్నప్పుడు కంటే, పూర్తిగా విరిసేకే మరీ అందంగా ఉంటుంది.' అనుకున్నాడు లోలోపలే ఆచారి. తననే చూస్తూ నిలబడిపోయిన ఆచారి పరిస్థితిని గమనించి అతను వచ్చినపనిని హెచ్చరిస్తోన్నట్టు–"బాబుకి రాత్రినుంచీ జ్వరం. అందుకే మిమ్మల్ని పిలిపించాను" అంది కమలమ్మ కొంగు నిండా కప్పుకొంటూ.

"ఆఁ... ఆఁ... చుక్కమ్మ చెప్పింది." అంటూ ఆచారి బాబు చిన్నారి చేతిని తన చేతుల్లోకి తీసుకొని నాడి పరీక్షిస్తూ "నిన్న రాత్రి భోం చేసాడా?" అన్నాడు.

"సరిగ్గా తిన్లేదండి" అంది కమలమ్మ.

"జ్వరం బాగా ఉంది." అంటూ

బాబు చెయ్యొవదిలేసి, చేతిలో ఉన్న అట్ట పెట్టెలోంచి థర్మామీటర్ తీసి బాబు చంకలో పెట్టాడు... చంకలోంచి థర్మామీటర్ తీసి "నూట రెండు డిగ్రీలదాకా ఉంది జ్వరం. ఫర్వాలేదులే అమ్మా కంగారు పడకు. తగ్గిపోతుంది. నేను పొట్లాలిస్తాను. రోజుకి మూడు చొప్పున తేనెతో నాకించు" అన్నాడు ఆచారి.

పొట్లాలు తీసి కమలమ్మ చేతికి అందివ్వబోయాడు.

"మంచం మీద ఉంచండి" అంది ముక్తసరిగా కమలమ్మ.

ఆచారి వెళ్ళిపోయాడు.

తనకు ఇన్నాళ్లకు, మళ్లీ కమలమ్మను కళ్లారా చూసే అదృష్టం కలిగినందుకు లోలోనే మురిసిపోతున్నాడు ఆచారి. తనకు కలిగిన అదృష్టాన్ని గురించి, ఆమె అందాన్ని గురించీ-ప్రెసిడెంటుకీ, మునసబుకీ చెప్పాలన్న తహతహతో వాళ్లిద్దర్నీ వెతుక్కుంటూ వెళ్లాడు.

దీపావళి మతాబాలా వెలిగిపోతున్న ఆచారి మొహం చూసి, "ఏంటయ్యా ఆచారీ ఇయ్యాల మరీ వుషారుగా ఉన్నావ్... కల్లో దేవుడు కాని కనబడ్డాడేటి?" అన్నాడు మునసబు చుట్ట ముట్టించుకొంటూ.

"దేవుడు కాదు, దేవతే కనబడింది. కానీ పాపం నుదుట పసుపు కుంకుమ ల్లేవు. ఆ దేవతను చూస్తూంటే నా మనసు నీరై పోయిందంటే నమ్మండి... ఆహా...ఏమి అందం! ఏమి సొగసు? మాట ఎంత మెత్తన...!!" అని దండకం చదవసాగేడు ఆచారి.

ప్రెసిడెంటు "ఏయ్...ఆగవయ్యా, సొద! పొద్దున్నే మందుల పొది పట్టుకొని ఒత్తన్నావ్... ఎక్కడ తగిలిందేటి గిరాకీ ?" అని అడ్డు తగిలేడు, ఆచారి దండకానికి.

"కమలమ్మ గారింటి దగ్గర్నించి బాబుకి జ్వరమని కబురు చేస్తే వెళ్లాను. అక్కడ్నించి సరాసరి ఇక్కడికే వచ్చాను... ప్రసిడెంటు గారూ, చెబితే నమ్మరు గానీ... అందమంటే కమలమ్మదేనండీ... ముప్పేట మీదున్న కొబ్బరిముక్కలా ఉందనుకోండీ. ఎక్కడుండవలసిన పుష్టి అక్కడ... దబ్బపండు చాయ ... జున్నుముక్కల్లాంటి బుగ్గలు... ఒంటినుంచి మొలిచినట్టున్న జాకెట్టు... చుట్టు జరీ తెల్ల చీర... బండి చక్రమంత బర్మాముడీ... అబ్బబ్బబ్బ... ఏ కోణంలోనుంచి చూసినా కళ్లు జిగేల్మని పోతున్నాయ్. అయితేనేం, పాపం, నుదుట కుంకుమ రేఖకు నోచుకోలేదు. బతుకంతా అడివి కాసిన వెన్నెలయి పోయింది..." అన్నాడు ఆచారి బాధగా.

ప్రెసిడెంటు- "ఎందుకయ్యా, అనవసరంగా నువ్వు కంట తడి పెట్టుకుంటావ్? ఇంతకీ నువ్వక్కడికెళ్లి ఆ కుర్రోడి నాడి చూశావా, లేకపోతే ఆవిడ చెయ్యట్టుకున్నావా?" అన్నాడు.

మనసబు నవ్వేడు. "ఏం(వ)న్నారు! ఆవిడ చెయ్యి పట్టుకున్నానా అన్నారా ! అంతటి అదృష్టం ఎప్పటికో నాకు?" అని తన్మయత్వంలో మునిగిపోయాడు

ఆచారి.

"ఆచారి ఇంతగా చెప్తున్నాడు..., మనం కూడా ఓసారి... చూస్తే పోలా? ఆ అందాన్ని...!" అన్నాడు మునసబు ప్రెసిడెంటుతో.

"రైటే అనుకో. మనం వెళ్లి ఆ ముందుమండువాలో కూకోడం...ఆవిడ గోరు తెరెనకాల నిలబడ్డం...కాళ్ల తప్ప మనకేం కనబడ్తయ్?... కాళ్లీడ్సు కుంటూ ఎల్దంగాని..." అన్నాడు ప్రెసిడెంటు.

ఆచారి పెద్ద ఉపాయం తట్టినవాడిలా మొహం పెట్టి "ఓ పని చెయ్యండి. రేపు నాతో నరసింహం రాసిన నోటు పట్టుకు

రండి. ముందు మండువాలోంచే కమలమ్మ గారూ—అని నేను పిలుస్తాను. నా దగ్గర ఆవిడ ఘోషా వదిలేసిందిగా. నేనొక్కణ్ణే వచ్చేననుకొని, సరాసరి ముందు మండువాలోకి వచ్చేస్తుంది. ఆవిడనూ చూడనూ వచ్చు. నోటు బాకీ సంగతి తేల్చుకోనూ వచ్చు" అని సలహా ఇచ్చాడు.

"తస్సదియ్యా! నీకు వయసు మళ్లే కొద్దీ బుద్ధి సిచ్చుబుడ్డిలా పని చేస్తం దయ్యా" అన్నాడు మునసబు నవ్వుతూ.

"దయచేసి వయసు సంగతి పదే పదే ఎత్తొద్దు!" అన్నాడు ఆచారి చేతులు జోడించి.



# 9

మరునాటి ఉదయాన్నే—గుళ్ళో పూజ ముగించుకోగానే సరాసరి కమలమ్మ ఇంటికి బయల్దేరాడు ఆచారి. మునసబూ, ప్రెసిడెంటూ ముస్తాబై అతని వెంట పడ్డారు. కమలమ్మ లోగిట్లోకి అడుగు పెట్టి ముగ్గురూ ముందు మండువాలో నిలబడ్డారు.

"కమలమ్మ గారూ!" అని పిలిచాడు ఆచారి

కమలమ్మ లోపల్నించే 'ఆఁ' అని బదులు పలికింది. క్షణంలో కమలమ్మ తమ కళ్ళ ముందు ప్రత్యక్ష మౌతుందని ఉవ్విళ్ళూరు తున్నారు ముగ్గురూ. తీరా పని మనిషి చుక్కమ్మ వచ్చి "తమర్ని లోనకి రమ్మంటున్నారండి" అని ఆచారితో చెప్పి "తమర్ని కూకోమన్నారండి" అని మునసబూ, ప్రెసిడెంట్లతోటి చెప్పి లోపలికి వెళ్ళిపోయింది.

ఆచారి లోపలికి వెళ్ళాడుఆచారి లోపలికి వెళ్ళగానే, పడగ్గది గుమ్మం దగ్గర నిలబడి కమలమ్మ "రండి" అంటూ ఆహ్వానించింది లోపలికి.

"ఎలా ఉంది బాబుకి ?" అంటూ పడగ్గదిలోకి వెళ్ళి బాబు నాడి పరీక్ష చేశాడు ఆచారి.

"ఫర్వాలేదు. జ్వరం తగ్గు ముఖం

**మినీకథ**

# రహస్యం




పద్మ ఇంట్లో పనంతా పూర్తి చేసుకుని వచ్చేసరికి అప్పటికే అక్కడ గిరిజ కూర్చొని స్వెట్టర్ అల్లుకొంటోంది.

పద్మకు బాధ కలిగింది – ఎంత అవస్థ పడింది తను! తెల్లవారు జామునే లేచి నిద్ర మానుకొని వళ్లంతా హూనం చేసుకొని, ఇంట్లో పనంతా పూర్తిచేసుకొని, వచ్చేసరికి...వచ్చేసరికి ఏముందీ, తనకన్నా గిరిజ ముందే రెడీ!

మనసంతా బాధ పరచుకొన్నా, పెదాల మీదకు నవ్వు తెచ్చుకొనివచ్చి కూర్చుంది పద్మ, గిరిజ పక్కనే. గిరిజ నిన్న మొదలు పెట్టిన స్వెట్టర్ ఈ రోజుకు పూర్తికావస్తోంది కూడానూ!

...ఎలా చేయగలుగుతోంది ఇంత త్వరగా?

—పద్మకు ఇది ఎప్పటి నుంచో ఉన్న సందేహం. గిరిజ తన కన్నా ముందే అన్ని పనులూ ఎలా చేయగలుగుతోందా అని!

అప్పటికీ పద్మ మొగుణ్ణి రోజూ పోరి, పోరి కుక్కర్, గాస్ ఇలా ఇంకా ఏవేవి కొనాలో అన్నీ వరసగా కొంది. అన్నిటితోబాటుగా వంట, ఇంటి పనులు త్వరగా పూర్తిచేసుకొని బయటపడేది. కానీ, అప్పటికే గిరిజ రెడీ!

— కిటుకు తెలిసిపోయిందనుకొని పద్మ తెల్లవారు జామున కూడా లేవటం ప్రారంభించింది. పనంతా పూర్తయి బయటికి వచ్చేసరికి 'గిరిజ' అప్పటికే నీటుగా డ్రెస్సయి...

పద్మ ఇంక ఉండబట్టలేక పోయింది. ఏమైనా సరే, ఆ కిటుకు తెలుసుకోవాలనే కాంక్ష తనను నిలవనివ్వకపోతే ఆఖరికి గిరిజనే అడిగి తెలుసుకోవాలని ఆవిడ దగ్గరచేరి తన సందేహం బయట పెట్టింది.

గిరిజ నవ్వి ఓ కాగితం తెమ్మని, ఆ కాగితంమీద ఓ వాక్యం రాసి ఇచ్చింది. పద్మ చదివిన వాక్యం ఇది: "భార్యను సుఖ పెట్టకలిగే అన్ని సాధనాలలోకీ, సహాయం చేసే భర్తే గొప్ప సాధనం!"

—పాలకోడేటి

# జబ్బు

రామశేషయ్యకి కేన్సరొచ్చింది. అతని అశ్రద్ధవల్ల అది ముదిరిపోయింది కూడా. రామశేషయ్య కొంచెమో గొప్పో ఉన్నవాడే కావడంవల్ల వచ్చిపోయేడాక్టర్లతోనూ, పరామర్శించడాకి వచ్చే స్నేహితులతోనూ అతని మేడ ఓ జనరల్ హాస్పటల్‌లా తయారయింది.

స్పెషలిస్టులు పరీక్షచేసి వ్యాధి బాగా ముదిరిపోయింది కనుక ఆపరేషన్ చేయక తప్పదని నిర్ణయానికి వచ్చేసారు. ఆ విషయం రామశేషయ్య భార్య, కొడుకులకి చెప్పారు.మర్నాడు ఉదయమే ఆపరేషన్ చేస్తామనీ, హాస్పటలులో చేర్చమని చెప్పి వాళ్ళు వెళ్ళిపోబోయారు.

అంతలో మెల్లిగా రామశేషయ్య ఓపిక చేసుకొని ఫేమిలీ డాక్టరుని పిలిచి "ఏం నిర్ణయించారు?" అని అడిగాడు లోగొంతుకతో. "ఏముంది? ఆపరేషన్ చెయ్యాలి రేపే ఆపరేషను. నేను దగ్గరుండి చూస్తాగా, ఏం ఫరవాలేదు, భయపడకండి" అన్నాడు డాక్టరు ధైర్యంచెప్తూ.

"అది సరే, ఎంత ఖర్చవుతుందేమిటి?" అడిగాడు రామశేషయ్య మెల్లిగా.

"పెద్దగా ఏంకాదు, అన్నీ కలిపి ఓ రెండు వేలౌతుందేమో, అంతే!" అన్నాడు డాక్టరు ఆ సొమ్ము మీకు పెద్ద లెక్కలోది కాదన్నట్లు.

"అయితే ఆపరేషను వద్దులెండి. ఒకవేళ ఇవాళో, రేపో నేను పోయినా, దినవారాలకి వెయ్యికంటె ఎక్కువకాదు" అన్నాడు రామశేషయ్య నీరసంగా.

—కోటేశ్వర్



పట్టింది. ఎల్లుండి పత్యం పెట్టెయొచ్చు" అన్నాడు ఆచారి.

"మీతో ఎవరో వచ్చినట్టున్నారు?" అంది కమలమ్మ.

"ఇంకెవరమ్మా ... మన ప్రెసిడెంటూ, మునసబూనూ, ఇలా బాబుకి జ్వరమని తెలియగానే — చూడాలి ... చూడాలి— అంటూ వెంట పడ్డారు. పెద్ద వాళ్లకూ పెద్ద వాళ్లకూ ఉండే మర్యాదలు కదా ..." అన్నాడు నవ్వుతూ ఆచారి.

"ఆలాగా? సుఖవుగానే ఉందని చెప్పండి బాబుకి" అని ఆచారికి చెప్పి "వారికి కాఫీ ఇచ్చేవే చుక్కమ్మా" అని పురమాయించింది కమలమ్మ ఆ ఇంటి మర్యాద ప్రకారం.

చుక్కమ్మ ముందు మండువాలో కూర్చున్న మునసబుకీ, ప్రెసిడెంటుకీ కాఫీ ఇచ్చి, తిరిగి కమలమ్మ దగ్గరికి వచ్చింది. 'ఏమిటి?' అన్నట్టు చూసింది కమలమ్మ. చుక్కమ్మ "తమర్తో మాటాడాలంటున్నారండి?" అని చెప్పి వెళ్ళిపోయింది.

"మిమ్మల్ని పలకరిద్దామని కాబోలు!" అన్నాడు ఆచారి ముక్తసరిగా.

ఆచారి ఇచ్చిన మందు పొట్లాలు కమలమ్మే స్వయంగా తీసుకుంది. ఆచారి వేళ్లకు కమలమ్మ అరిచేయి తగిలింది. ఆచారికి ఒళ్లంతా జలదరించినట్టు అయిపోయింది. కదలకుండా నిలబడిపోయిన ఆచారిని ఉద్దేశించి — "ముందు మండువాలో కూర్చోండి. వస్తున్నాను" అంది కమలమ్మ. ఆ మాటలో అంతర్గతంగా ఆదేశం ధ్వనిస్తోంది. ఆచారి మారు మాటాడకుండా పసిపిల్లవాడిలా ముందు మండవాలోకి వెళ్ళిపోయి — ప్రెసిడెంటూ, మునసబుల్తో బాటు కూర్చున్నాడు ... ఆవిడ రావడం తోటే ప్రోనోట్ల సంగతి కూడా కదపమని వాళ్ళిద్దరితో చెవులు కొరికాడు ఆచారి. కమలమ్మ లోపలి మండువా గుమ్మం దాకా వచ్చి — తెర వెనకే నిలబడి పోయింది. ముగ్గురూ తెరవైపే చూస్తున్నారు, గడప దాటి ముందు మండువాలోకి ఆమె అడుగు పెడ్తుందన్న ఆశతో. తెర వెనుక నుంచే కమలమ్మ తియ్యని పలకరింపు— "పొద్దున్నే పని కట్టుకొని బాబును చూడ్డానికి వచ్చారట. చాలా సంతోషం. మీ దయవల్ల సుఖవుగానే ఉంది" అంది కమలమ్మ.

మునసబు "అదే కావల్సిందమ్మా బాబుకి జ్వరమని వినేసరికి—ఒక వేళ పట్నానికి తీసుకు వెళ్ళాల్సిన అవసరం ఉంటుందేమోనని వచ్చేశాం. మన ఆచారి గారు వైద్యంతో తగ్గక పోవడం ఉండదనుకోండి. అయినా ఆత్రుత కద!?" అన్నాడు.

ప్రెసిడెంటు వంత పాడుతూ — "నాకీ వేళసలూ—సమితి మీటింగుంది. బాబుకి జ్వరమని తెలిసేక ఎళ్ళ బుద్ధి కాక మానేసేను...!" అన్నాడు.

"వారికీ మీకూ ఉండే స్నేహం అలాంటిది..." అంది కమలమ్మ ముక్తసరిగా.

"స్నేహాలేంటండీ...' ఇచ్చి పుచ్చుకోడాలయినా, ఏ వ్యహారమయినా, నోటి

మాట మీదేగా! ఆరికీ, మాకు అలా కల్సి పోయింది. అందుకే-ఈ లోగిట్లో ఏదైనా జరిగిందంటే – వొచ్చి వాలిపోవల్సిందే! లేక పోతే మనసొప్పదు" అన్నాడు ప్రెసిడెంటు.

ఆమె కంటికి కనబడకపోయినా ఆమె తియ్యని స్వరం చెవిని పడడమే ఒక వరంగా మురిసిపోతూ అతను.

సంభాషణ పెడదారి పడ్తోందని గ్రహించిన ఆచారి "ఈనాడంటే నోట్లూ, ప్రోనోట్లూ, పత్రాలూ వచ్చేయికానీ, వారి హయాములో అంతా నోటి మాటే కదండీ?" అని ప్రోనోట్ల సంగతి వాళ్ళిద్దరికీ గుర్తుకు తెచ్చాడు. దాంతో మునసబు– ఈ లోకంలోకి వచ్చి "అన్నట్టు మరిచేపోయాను ప్రోనోటంటే జ్ఞాపకం వచ్చింది... మొన్నీమధ్య మన నరసింహంగారు ఏదో అవసరం ఉండి డబ్బుచ్చుకొని ఎంత వొద్దన్నా వినకుండా, నోటు రాయించి ఇచ్చి వెళ్లేరు..." అన్నాడు.

"నాకూ అలాగే ఓ నోటు రాసిచ్చేరు... మన్లో మనకి నోట్లూ పత్రాలూ ఏంటంటే ససేమిరా కుదరదని నోటు జేబులో కుక్కి మరీ వెళ్ళిపోయారు!" అన్నాడు ప్రెసిడెంటు.

కమలమ్మ తెర వెనుకే, బరువుగా నిట్టూర్చింది. ఆమెకు తల తిరిగినట్టయింది. ఆమె బాధ డబ్బుపోతున్నందుకు కాదు, తన ఇంటి పరువు బజార్న పడ్తున్నందుకు. అంతలోనే తేరుకుని, "ఆ ప్రోనోట్లు తీసుకువచ్చారా?" అనడిగింది.

"ఆఁ మీకిచ్చేసి పోదామని తెచ్చేను" అన్నాడు ప్రెసిడెంటు.

"నేను మీముందు ఆ నోటు చించేసి పోదామని పట్టుకొచ్చేను." అన్నాడు మునసబు.

"అంత పని చెయ్యకండి. మీకు అభ్యంతరం లేకపోతే ఆ నోట్లు రెండూ ఆచారిగారి చేతికిచ్చి వెళ్లండి. లెక్క కట్టించి ఆచారిగారి చేతికి డబ్బిచ్చి పంపిస్తాను" అంది కమలమ్మ.

ఆ ప్రోనోట్ల మూలంగా తప్పనిసరిగా ఏదో గొడవ జరుగుతుందని అనుకున్నారు ప్రెసిడెంటూ, మునసబూ. అంత సుళువుగా వ్యవహారం తేలిపోతుందని అనుకోలేదు వాళ్లు ఇద్దరూ. ప్రెసిడెంటూ, మునసబూ కూడా ప్రోనోట్లు రెండూ ఆచారి చేతిలో పెట్టి కమలమ్మతో 'వెళ్ళొస్తా'మని చెప్పి వెళ్ళిపోయారు.

ఆచారి ప్రోనోట్లు రెండూ కమలమ్మ చేతిలో పెడ్తూ "ఇలా వీళ్ల దగ్గిర డబ్బు తీసుకున్నట్టు అన్నయ్య తమతో చెప్పాడా?" అన్నాడు.

"అవసరముండి నేనే తెమ్మన్నాను" అని మాత్రం అంది కమలమ్మ.

కమలమ్మ గుట్టు చూసి ఆచారి ఆశ్చర్యపోయేడు. ఈ మనిషిని ఎవరూ ఏమీ చెయ్యలేరనుకున్నాడు ప్రోనోట్లు రెండూ విప్పి చూసి లెక్క కట్టింది కమలమ్మ. బీరువా తెరిచి డబ్బు తీసుకొచ్చి ఆచారి చేతికి ఇచ్చింది. మునసబుకీ, ప్రెసిడెంటుకీ అందచెయ్యమని చెప్పి ఆచారిని సాగనంపింది. ఆచారి మారుమాటాడకుండా వెళ్ళిపోయాడు.

కమలమ్మ జరిగినదానికి కొంచెమైనా చలించలేదు. ఆదారి వెళ్ళిపోయాక తన గదిలోకి వెళ్ళి పది నిమిషాలు మౌనంగా కూర్చుంది. ఏదో ఒక నిర్ణయానికి వచ్చింది. బీరువా తెరిచి ఇరవై వేల రూపాయలు తీసింది. చరచరా ముందు మండువాలో అన్నగారి గదిలోకి అడుగు పెట్టింది. అన్నగారు తన ఇంటికి వచ్చిన తరవాత, ఒక రకంగా అదే మొదటిసారేమో...ఆమె అతని గదిలోకి అడుగెట్టడం! గెడ్డం గీసుకుంటున్న నరసింహం కమలమ్మను చూడగానే—ఏదో షాక్ తిన్నట్టు లేచి నిలబడ్డాడు.

"చూడన్నయ్యా! నువ్వు మునసబు దగ్గరా, ప్రెసిడెంటు దగ్గరా చేసిన బాకీ తీర్చేశాను. నువ్వు ఎప్పుడడిగినా, నీకు కావలసిన డబ్బు నేనిస్తూనే ఉన్నాను. అయినా వాళ్ల దగ్గర ఎందుకు అప్పు చేశావో నాకు తెలియదు. డబ్బు పోయిందని కాదు... ఇది ఈ ఇంటి పరువుకు సంబంధించిన విషయం. ఇప్పుడు నేను నీ చెల్లెల్ని మాత్రమే కాదు, ఈ ఇంటి కోడల్ని. నన్ను ఈ ఇంటి కోడల్ని చెయ్యటంతోటే అన్నగా—నాపై నీకున్న బాధ్యత తీరిపోయింది. ఆ తర్వాత నుంచి ఈ ఇంటి పరువుప్రతిష్ఠలు కాపాడ్డం నా బరువూ, బాధ్యతా. నువ్వు నా అన్నవే అయినా, నీవల్ల ఈ ఇంటి పరువుకి మచ్చ రావడం నేను సహించలేను. ఇదిగో మరో ఇరవై వేలు. ఈ డబ్బు తీసుకొని, ఈ ఇల్లు, ఈ వూరూ వదిలెయ్. నీ ఇష్టం వచ్చిన చోటికి వెళ్లు. అవసరమయితే అక్కణ్ణించే ఉత్తరం రాయి. ఎంత డబ్బు కావాలన్నా పంపిస్తాను. నీ చెల్లెలుగా వేడుకుంటున్నాను. ఈ ఇంటి యజమానురాలిగా ఆజ్ఞాపిస్తున్నాను. ఈరోజే నీ ప్రయాణం!" అని నరసింహానికి మాట్లాడ్డానికి కూడా అవకాశం ఇవ్వకుండా చెప్పదల్చుకున్న నాలుగు మాటలూ అన్నగారికి చెప్పేసి బయటికి వచ్చేసింది కమలమ్మ.

ఇక చేసేది లేక నరసింహం ఆనాడే పట్నానికి ప్రయాణమై వెళ్లిపోయాడు.

ఆ రాత్రంతా కమలమ్మకు నిద్ర పట్టలేదు. ఒంటరితనం వేటకుక్కలా తనని వేటాడుతున్నట్టనిపించింది. తృప్తిగా భోరున ఏడ్వాలనుకుంది. అంతలోనే పక్కలో ఉన్న చినబాబు ఆమె మెడకు చేతులు చుట్టి నడుం మీద కాలు వేసి, ఆమెకు దగ్గరగా ఒత్తిగిల్లేడు. వాడిని గుండెలకు హత్తుకుంటూ "వారి గుర్తుగా, వీడు మిగిలాడు నాకు. వీడి కోసం నేనేపరిస్థితి అయినా ఎదుర్కోవాలి. గుండె చిక్కబట్టుకోవాలి. వీడి కోసం బతకాలి!" అనుకుంటూ నిద్రపోయింది.

* * *

ఇరవై వేల రూపాయలతో నరసింహం పట్నానికి చేరుకున్నాడు. అతను ఆ ఊళ్ళోనే చదువుకున్నాడు. అతనూ, కమలమ్మా ఆ ఊళ్ళోనే పెరిగారు. వాళ్ళ తండ్రి గుమస్తా ఉద్యోగం చేసి రిటైరయ్యేరు. తల్లి చిన్న తనంలోనే చనిపోయింది. నరసింహం చదువు ఇంటర్మీడియెట్ తోటే ఆగిపోయింది. కమల మాత్రం స్కూల్ ఫైనల్ దాకా

## మినీకథ



రామం ప్రేమ లేఖలెప్పుడూ రాయలేదు. తనే ప్రేమ లేఖ రాయాల్సి వస్తుందని ఇప్పటిదాకా అనుకోలేదు. అసలు దీనికంతకీ కారణం ఎదురుగ్గా డాబా ఇంట్లో ఉంటున్న రాధ. రాధ అందంగా వుంటుంది. రెండు జడలు వేస్తుంది. వెన్నెల విరిసేట్టు నవ్వుతుంది. కొత్తగా చేరిన రోజుల్లో ఆ ఒక్కగదికి వంద రూపాయలు అద్దె చెల్లించడానికి ఇబ్బందిగా ఫీలయ్యే రామం నిత్యం రాధ దర్శనం లభించటంతో అద్దె ఇంకో యాభై అయినా పర్వాలేదుఅనుకున్నాడు. రామంలో మార్పులొచ్చాయ్. ఇన్‌షర్ట్ చేయడానికి ఎప్పుడూ ఇష్టపడని రామం ఇప్పుడు 24 గంటలూ 'టక్'లో ఉంటున్నాడు. గంటసేపు అద్దం ముందుంటున్నాడు. ఆఫీసులో ఉన్నా, బజార్లో నడుస్తున్నా, రాత్రిళ్లు నిద్దుర రాక ఏ పుస్తకమో తిరిగేసినా, కళ్ళు మూసుకున్నా రాధే ప్రత్యక్షం కావడంతో తను రాధని ప్రేమించటం. నిజమేనని తెల్సుకున్నాడు.

ఆ రోజు సాయంకాలం తీరిగ్గా కూర్చొని నీలిరంగు కాగితంపై ప్రేమనంతా గుమ్మరించి ప్రేమ లేఖని సిద్ధం చేశాడు. ఇంటివాళ్ళ పనిపిల్లని పిలిచి కవరు చేతిలో పెట్టి రాధమ్మకిమ్మని చెప్పాడు. కాస్సేపటికి ఆ పిల్ల వచ్చి ఇచ్చానని చెప్పింది.

ఆ మర్నాడు సాయంత్రం సదరు పనిపిల్ల పరిగెత్తుకుంటూ వచ్చి రామానికి చీటి ఒకటి ఇచ్చివెళ్ళిపోయింది. ఉక్కిరి బిక్కిరి అయ్యే హృదయాన్ని అదిమి పట్టుకుని చీటి విప్పాడు. రామం కళ్ళు పనిచేయటం మానేశాయి. బుర్రగిర్రున తిరుగుతున్నట్లు అనిపించింది.

చేతిలోని ఉత్తరం జారి నేల మీద పడింది.

'దొరా!

నువ్వు ఎట్టా పిలిసినా పలుకుతా. నా మడిలో ఉన్నట్టే కరట్టుగా రాశారు. నువ్వా గదికొచ్చి నవ్వుతున్నం చీసూత్తుండా. మా అయ్య కాడి కొచ్చి మాటాడితే మనం మనువాడవచ్చు ... ఉత్తరం సరిగా రాయలేను.

...నీ...వెంకటి"

—సవ్యసాచి

## మినీకథ

# ఫలితం

రామచంద్రానికి వ్యాపార ప్రకటనలలో మంచి గురి ఉంది. ఆమధ్య ఓ రైలు ప్రయాణంలో ప్లాట్‌ఫారం మీద సూట్‌కేసు మరిచిపోయి రైలెక్కేశాడు అతను. తీరా ఓ పంద మైళ్ళు ప్రయాణం చేశాక జ్ఞాపకం వచ్చింది తన సూట్‌కేసు మరిచిపోయానని. మర్నాడు అన్ని పేపర్లలోనూ తాను ఫలానా రైల్వేస్టేషను ప్లాట్‌ఫారం మీద ఫలానా రంగు సూట్‌కేసు మరిచిపోయానని అది అప్పజెప్పిన వారికి తగిన బహుమతి ఇస్తాననీ దాని కొలతలతో సహా ప్రకటించాడు. వారం తిరక్కుండా అతని సూట్‌కేసు తెచ్చి ఇచ్చారెవరో. దాంతో అడ్వర్టయిజ్‌మెంట్లమీద మరింత నమ్మకం ఏర్పడింది అతనికి.

ఈ సంగతిని రామచంద్రం తన మిత్రుడు కృష్ణమూర్తితో చెప్పి "మాశావా? పేపర్లో ప్రకటించడంవల్ల ఎంత మంచి జరిగిందో?" అన్నాడు గర్వంగా.

"ఆఁ. ఎడ్వర్టయిజ్‌మెంట్లవల్ల ఎంత మేలు జరుగుతుందో నాకు బాగా తెల్సు. ఓసారి మా ఫ్యాక్టరీకి నైట్ వాచ్‌మెన్ కావాలని పేపర్లో ప్రకటించిన రోజు రాత్రి ఫ్యాక్టరీలో బ్రహ్మాండమైన దొంగతనం జరిగి నాలుగు లక్షలు నష్టం వచ్చింది" అన్నాడు కృష్ణమూర్తి.

—నాగేశ్వరరావు



చదువుకుంది. ఆ తరవాత ఆడపిల్లకు చదువు అనవసరం అని తండ్రిమాన్పించేశారు. రిటైరైన కొద్ది రోజులకే తండ్రి పోవడంతో ఆయన పెన్షన్ తాలూకు డబ్బు కొంత నరసింహంచేతికి వచ్చింది. ఇంట్లో పెద్ద దిక్కు ఎవరూ లేక పోవడంతో నరసింహం ఎలా తిరిగినా అడిగే వాళ్ళు లేకపోయారు. కమలమ్మ అన్నగారు ఎక్కడ తిరిగి వచ్చినా అంతి పట్టించుకునేది కాదు.

తండ్రి మిగిల్చిపోయిన పెన్షన్ డబ్బుతో చెల్లెలు పెళ్ళి చేయాలనుకునేవాడు నరసింహం. మంచి సంబంధం చూసి పెళ్ళి చేయాలంటే ఆ డబ్బు చాలదు అనుకొనేవాడు. చిన్నగా పేకాట ప్రారంభించాడు. అది అచ్చిరాలేదు. బ్రాకెట్ ఆడాడు. అలా అలా ఇంటి ఖర్చులకీ, జూదానికీ, జూదంతోపాటు అలవాటైన తాగుడుకీ, వయస్సులో ఉన్న తనకు కలిగిన కోర్కెలు తీర్చుకోడానికీ — ఉన్న డబ్బు కాస్త కరిగిపోయింది. ఏదో ఒక ఉద్యోగం తప్పని సరిగా అవసరమయింది. సినిమా రిప్రజెంటేటివ్‌గా తన తండ్రికి తెలిసిన ఒక పెద్దమనిషిని పట్టుకొని చేరేడు.

ఆ పనిలో చేరిన కొద్ది రోజులకే ఆ ఉద్యోగం కల్పతరువు అని గ్రహించాడు. ఏ హాలుకి రిప్రజెంటేటివుగా వెళ్తే ఆ హాలు వాళ్ళే అతనికి కావలసిన సౌకర్యాలు ఏర్పాటు చేసేవారు. పైగా చేతికి కొద్దో గొప్పో డబ్బు కూడా వచ్చేది. పట్నంలో ఉన్న కమలమ్మకు డబ్బు పంపుతూ ఉండేవాడు. ఎన్ని సుఖాలు అనుభవించినా, ఎన్ని వ్యసనాలకు లోనయినా కమలమ్మ పెళ్ళి సంగతి మాత్రం మర్చి పోలేదు. ఆ ఒక్క బాధ్యతా తీరిపోతే తాను సర్వ స్వతంత్రుడి నవుతాననుకొనేవాడు. అటువంటి సమయంలో ఆచారి పరిచయం అయ్యాడు, ఒక సినిమాహాల్లో.

అలా పరిచయం పెరిగి ఆచారికి ముడుపు చెల్లించుకొని కమలమ్మ పెళ్ళి చేసేశాడు.

రాయలంగారు పోయిన తరవాత కమలమ్మ అడక్క పోయినా, చెల్లెలు సంసారం చక్కదిద్దడం తన బాధ్యత అనుకుని కమలమ్మ ఇంటికి చేరాడు. ఆ వూళ్ళో ఆచారి ద్వారా మునసబూ, ప్రెసిడెంటూ పరిచయం అయ్యారు. వాళ్ళు పరిచయం కాకుండా ఉంటే, ఆచారి ఆ వూళ్ళో లేకపోతే, తనకు వ్యవసాయమంటే ఏమిటో తెలీక పోయినా, రాముడి ఆసరాతో చెల్లెలు కమతాన్ని చేసుకుంటూ ఉండేవాడేమో.. కాని, ప్రెసిడెంటూ, మున్సబుల పరిచయంతో నరసింహానికి వ్యవసాయం మీద కంటే జల్సాల మీదే మనసు మళ్ళింది.

నరసింహం చేతిలో పెత్తనం ఉన్న రెండేళ్ళపాటు మునసబూ, ప్రెసిడెంటూ ఆచారీ—అతన్ని మునగచెట్టు ఎక్కించే కబుర్లు చెప్పి, అతని చేతే ఖర్చు పెట్టించారు. నిత్యం ఊళ్ళో తాగుడుకీ, తరచుగా పట్నం వెళ్ళి చేసే జల్సాలకీ మొత్తం ఖర్చు నరసింహమే పెట్టేవాడు. వాళ్ళు ముగ్గురు అతన్ని 'పిల్ల

జమిందారు' అని అంటూంటే 'కామోసు' అనుకునే వాడేకాని కమలమ్మ కమతం మీద తనకున్న హక్కేమిటో, ఆమె తనకు అప్పచెప్పిన బాధ్యత ఏమిటో ఎన్నడూ ఆలోచించలేదు. ఆ కారణం చేతనే, ఈనాడు ఆ యింటికే దూరం కావలసి వచ్చింది. ఒకే రక్తం పంచుకు పుట్టిన చెల్లెలే తనతో మాట్లాడమే మానేసి, చివరకు ఇంట్లోంచే పొమ్మంది. ఇరవై వేలిచ్చి రక్తసంబంధాన్ని తెంచు కుంది.

నరసింహం ఇరవై వేల డబ్బుతో పట్నంలో నడి రోడ్డుమీద నిలబడ్డాడు. ఏం చేయాలన్నది సమస్య. పట్నంలో ఇరవై వేల డబ్బు గలవాళ్ళు, లక్షాధి కారి కావడానికి అవకాశాలు ఉన్నాయి. ఇరవై వేలనూ హారతి కర్పూరంలా హరాయించగల ప్రలోభాలూ ఉన్నాయి.

ఏం జరగాలీ అన్నది ఆయా వ్యక్తులు తీసుకునే నిర్ణయాల మీదా, వాళ్ళకి గల నిగ్రహం మీదా ఆధారపడి ఉంటుంది. నరసింహం ఒక నిర్ణ యానికి వచ్చాడు. ఈ ఇరవై వేలనూ లక్ష చెయ్యాలి. తానో లక్షాధికారి అని పించుకోవాలి. తాను ప్రయోజకుడు అనిపించుకొని చెల్లెలికి తిరిగి కన్పిం చాలి. ఆమె ఎప్పుడేనా ఆపదలో ఉంటే అన్నగా తను ఆదుకోవాలి ... అను కున్నాడు

కాని, కష్టపడి ఇరవై వేలనూ లక్ష రూపాయలు చేసే మార్గాలు అతనికేమీ తోచలేదు. స్వతస్సిద్ధంగా అతనికి కష్టపడే అలవాటు లేదు. తనకు చేత నైన మార్గాలు జూదాలు. దాంతోనే పైకి రావాలనుకున్నాడు. ఇరవై వేల తోటి క్లబ్బులోకి అడుగుపెట్టాడు. అతని జేబులో ఉన్నడబ్బు అతనికి చాలా గౌరవం తెచ్చి పెట్టింది. క్లబ్బంత అగ్గగ్గ లాడింది. పెద్ద స్టేకులో కూర్చు న్నాడు. ఆట సాగుతూంది. వందలకు వందలు టేబిలు మీద తిరుగుతున్నాయి. డబ్బు వస్తోంది. పోతూంది.

ఒక రోజు ..

రెండువేలు గెలిచాడు నరసింహం. ఎందుకో, విశ్రాంతి తీసుకోవాలనీ, కాస్త సుఖపడాలనీ అనిపించింది. క్లబ్బు కుర్రాడు కిష్టిగాడు నరసింహాన్ని 'బేబీ' ఇంటికి తీసుకువెళ్ళాడు.

బేబీ అంటే పసిపాప కాదు. పసిడి బొమ్మలా ఉంటుంది. రాత్రికి రెండు వందల రూపాయలు ఇవ్వగలవాణ్ణే తన గడప తొక్కనిస్తుంది. గడప దాటి లోపలికి అడుగు పెట్టిన వాడికి అన్ని సుఖాలనూ ఇస్తుంది. అన్ని సదుపాయాలు సమకూరుస్తుంది. సాధారణంగా ఆ గడపలోకి అడుగు పెట్టినవాడు డబ్బు జేబులో ఉన్నంత వరకూ ఆమెను మర్చిపోలేడు. డబ్బు అయిపోయిన తర్వాత గుర్తుంచుకున్నా అలాంటి వాళ్ళని బేబీయే మర్చిపోతుంది.

అట్లాంటి బేబీ ఇంటిలోకి నరసిం హం అడుగు పెట్టాడు. క్లబ్బు కుర్రాడు కిష్టిగాడు నరసింహం సంగతీ నరసిం హం దగ్గరున్న డబ్బు సంగతి ముందు గానే బేబీకి చెప్పాడు. బేబీ ఎంతో చాక చక్యంతో నరసింహాన్ని తన యింట్లో

కట్టేసింది. ఇంతో అంతో రసికుడయిన నరసింహం బేబీ వలలో త్వరగానేచిక్కు కున్నాడు.

క్లబ్బుకి వచ్చి పేకాడినా, ఎంత రాత్రయినా బేబీ యింటికి వెళ్ళిపోయేవాడు. క్లబ్బులో చాలా మంది బేబీని నరసింహం ఉంచుకున్నాడనే వారు. నరసింహానికి ఏదో కొత్త జీవితందొరికినట్టనిపించింది. ఆరు మాసాలపాటు బేబీతో సంసారం చేస్తున్నట్టు బతికాడు.కాకపోతే ఏసంసారీ పెట్టనంత ఖర్చుతో బతికాడు. ఆరు మాసాలుగడిచేసరికి తను తెచ్చినఇరవై వేలూ, అప్పుడప్పుడు గెలిచిందీ...అంతా కరిగిపోయింది.

బేబీ నరసింహాన్ని వదిలించుకునేందుకు ఇంటికి తాళం పెట్టి హైదరాబాదు వెళ్ళిపోయింది. నరసింహం నివాసంక్లబ్బే అయింది. ఆటకి డబ్బులేదు. ఎవరైనా ఆడుతుంటే వెనకాల నిలబడితే, నిన్న మొన్నటిదాకా గౌరవించిన వాళ్ళే చిరాకు పడుతున్నారు. క్లబ్బుకుర్రాడు కిష్టిగాడిని 'టీ' తెచ్చిపెట్టమనీ అడిగితే 'ఉండండీ... పెద్ద టేబులు దగ్గర పనివుంది బైటకెళ్ళి తాగి రాకూడదూ?' అని చిరాకు పడ్తున్నాడు.

అట్లాంటి క్లిష్ట పరిస్థితుల్లో ఒకరోజున ప్రెసిడెంటు వెంకటయ్య కనిపించాడు. నరసింహానికి. ప్రాణం లేచివచ్చినట్టన్పించిందతనికి. వెంకటయ్యే నరసింహాన్ని పలకరించాడు.

"అసలు మనూరు రావటంలేదేంటీ" అన్నాడు వెంకటయ్య నరసింహంతో.

"ఎప్పటి కప్పుడు వద్దామని అనుకుంటూనే వున్నాను. వీలుపడటంలేదు. అంతా బావున్నారా?" అన్నాడు నరసింహం.

"ఆఁ బాగానే వున్నారు. రా కాసేపు ఆడుకుందాం..." అని పిలిచాడు ప్రెసిడెంటు నరసింహాన్ని.

"డబ్బు...లేదయ్యా బేబీ తాళం వేసుకుని ఊరికి వెళ్ళింది. అది వెళ్ళే ముందు నేను క్లబ్బులో ఉండిపోయాను. డబ్బు దానింట్లో ఉండిపోయింది" అని పరువు నిలబెట్టుకునేందుకు ప్రయత్నం చేశాడు నరసింహం.

"ఇకనే...బేబీని మేంటేన్ చేత్తాన్నవన్న మాట. నేనిత్తాన్లే డబ్బు ...రా" అని నరసింహాన్ని తీసుకెళ్ళి పేకాటకో కూర్చోబెట్టాడు ప్రెసిడెంటు.

నరసింహం అదృష్ట వశాత్తూ ఒక వెయ్యిరూపాయల వరకూ గెల్చుకున్నాడు కిష్టిగాడు నరసింహం అడక్కపోయినా టీ గ్లాసు పట్టుకుని పక్కనే నిలబడుతున్నాడు. చెవి దగ్గరకు వంగి "మందు తెమ్మంటారాసార్" అని కూడా పలకరించాడు.

"వద్దులేరా"అని ఈసారి నరసింహం చిరాకు పడ్డాడు కిష్టిగాడిమీద.

అలా కాసేపు పేకాడుకున్న తరవాత ప్రెసిడెంటూ, నరసింహం బైటికి వెళ్ళిపోయారు. ఏదో మాటలమీద నరసింహం తన చేత బినామీ నోటు రాయించుకుని, తన చెల్లెలు దగ్గర వసూలు చేసిన ఇరవై వేల గురించి ప్రెసిడెంటుని కదిపాడు. ప్రెసిడెంటు కాస్తానీళ్ళ నమిలి "మనసబు బాగా చితికిపోయాడయ్యా. అతని

నోటికిందొచ్చిన పది వేలూ కాకుండా, నాకు వచ్చిన పదివేల్లోకూడా అయిదు వేలు తీసుకున్నాడు. అందాక ఈ వెయ్యి రూపాయలూ ఉంచుకో. బతికి బాగుంటే ఆ తరవాత చూద్దాం. నువ్వెక్కడికి పోతావ్ నేనెక్కడికి పోతాను ... మున సబెక్కడికి పోతాడు?" అని తేల్చేశాడు ప్రెసిడెంటు.

చచ్చినవాడి పెళ్ళికి వచ్చిందే కట్న మనుకుని ఆ వెయ్యిరూపాయలూ పుచ్చు కున్నాడు నరసింహం. ఈ సారి ఏమైనా జాగ్రత్తగా ఆడి డబ్బు సంపాదించాలను కున్నాడు. ఎంతడబ్బు వచ్చినా ఆడదాని మొఖం చూడకుండదనుకున్నాడు. ఆడ దంటేనే మోసం అని మండి పడ్డాడు.

పట్టుపలతో వారం రోజులలో తన దగ్గరున్న డబ్బుని తిరిగి ఇరవై వేలు చేశాడు. కిష్టిగాడు నరసింహం ఆడు తున్న టేబులు దగ్గరకొచ్చి 'మీ కోసం అమ్మగారు వచ్చిందండి' అని చెవిలో చెప్పాడు.

"అమ్మగారెవత్తిరా" అన్నాడు నరసింహం.

"బేబీ అండి!" అన్నాడు కిష్టిగాడు.

"పొమ్మను అవతలకి" అని చెండు కున్నాడు నరసింహం.

కిష్టిగాడు బైటకి వెళ్ళి వచ్చి "ఒక్క సారి కన్పించి వెళ్ళిపొమ్మంటున్నారండి" అని మళ్ళీ నరసింహం చెవిలో ఊదాడు.

ఇక తప్పదనుకుని తన్ని తగలేద్దామ న్నంత కోపంతో నరసింహం క్లబ్బు లోంచి బైటకి వచ్చాడు. రిషాలో కూర్చున్న బేబీ దగ్గరికి వెళ్ళాడు. బేబీ ఏడుస్తూ "మా పిన్నిగారింటికి వెళ్ళాను దానికి ఒంట్లో బాగాలేదంటే. అది పోయింది అది నన్ను పెంచింది. అంత మాత్రం దానికే ఇంత కోపగించాలా! ఇంటికి తాళం లేదని క్లబ్బులో ఉండిపో తారా మీరు ఇంటి దగ్గర లేరు కాబట్టి ఇంటికి తాళం వేశాను తాళం పగల గొట్టక పోయారా! అది మీయిల్లు కాదా" అంది.

ఆ మాటలకు, ఆ కన్నీళ్ళకూ నర సింహం కరిగిపోయి బేబీ పక్కన రిషాలో కూర్చొని బేబీ యింటికి వెళ్ళి పోయాడు.



# 10

ఓనాడు సాయంత్రం పొలం పనంతా పూర్తయిన తరవాత రాముడు ఏరు దాటి అమ్మమ్మను చూడ్డానికి వెళ్లాడు. రాముడు రావడం గమనించినా రత్తి మాత్రం మాట్లాడలేదు.

"కాల్నొప్పి ఎలా ఉందే?" అంటూ రాముడు పుత్రమ్మ కాలుమీద చెయ్యి వేసి పాముతున్నాడు.

"కంటికాపడినప్పుడే ప్రేమ. ఆ కమతంలో బడితే ఇంటికాడోళ్ళెవురూ గుర్తుకురారు నీకు" అంటూ రత్తి రాము డిని చూసి మూతి ముప్పయ్ మెలికలు

తిప్పింది. రాముడూ పుత్రమ్మా కూడా నవ్వుకున్నారు రత్తి సాధింపులు విని.

రాముడు రత్తి వంకే చూస్తూ "మామ్మా, దీని మెళ్ళో తాళి కట్టకుండానే నా మీద ఇంతధికారం చెలాయించే స్తందిది— తాళిగట్టిన తరవాత నా మెడకో కాలికో తాడుగట్టి మంచం కోటికి కట్టేస్తదేమోనని భయంగా ఉంది" అన్నాడు.

పుత్రిమ్మ "నీకలాంటి పెళ్ళామే దొరకాలి. దానికోప్కంపం రావటంలో తప్పేముంది? మొన్న నీకోసమని పొలం వచ్చిందా? దాన్నింటికి సాగనంపి, మళ్ళీ ఈ యేలొచ్చావ్... ఆ రేత్తిరంతా సేపల కూరొండి నీ కోసం అలా పెట్టుకొని తనుకూడా తినకుండా కూకుంది. అక్కడికీ నేనన్నాను. అడొత్తాడా పెడ్తాడా... వచ్చినా ఒక్కోపాలి అక్కడ తినేవొత్తాడు ... నువు తిని తొంగోవే అని... ససేమిరా కాదని కూకుంది. నువ్వారేత్తిరి రానూలేదు... ఆ రేత్తిరది కూడు తినాలేదు. ఏమంత దూరం... పొరుగూర్నుంచి పిల్లొచ్చిందా-రోజూ ఓపాలొచ్చి పిల్లనొచ్చి చూసిపోతే ఏమవుద్ది?" అంది.

రాముడికి తను చేసిన తప్పేమిటో అర్థమయింది. అలా పుత్రమ్మ రత్తి గురించి చెప్తూ ఉంటే ఆ మాటలు వింటున్న రత్తి ఇంటిముందు కుండలు కడుగుతూ చెమ్మగిల్లిన కళ్ళను పైట చెంగుతో ఒత్తుకోవడం రాముడు చూశాడు. ఆరోజు వస్తానని చెప్పి ఆచారి గొడవలోపడి తానింటికి రాకపోవడం పొరబాటేననుకున్నాడు. ఆరాత్రి అంతా తనకోసం ఎదురుచూసి భోజనం చేయకుండా పడుకున్న రత్తినిచూస్తూ ఉంటే రాముడికి జాలేసింది. తనంటే రత్తికెందుకో ఇంత అభిమానం అనుకున్నాడు. కడిగిన కుండల్ని లోపల పెడుతున్న రత్తితో "ఈపేల నీతో కలసి కూడు తిన్నాకే ఎల్తాన్లేయే..." అన్నాడు సముదాయిస్తున్నట్టుగా.

ఆ మాట విన్న రత్తి చూపులతోటీ, పెదవుల మీద చిరునవ్వుతోటీ రాముడికి కృతజ్ఞతలు చెప్పుకొంది. క్షణంలో చకచకా వంట చేసింది. తను తెచ్చుకున్న డబ్బుల్తో గూడెంలో తిరిగి గుడ్లు సంపాదించింది. కోడిగుడ్డు కూరతో రాముడికి భోజనం పెడ్తూ, తృప్తిగా తింటున్న రాముణ్ణి తృప్తిగా చూసుకుంటూ ఎదురుగుండా కూర్చుంది రత్తి. సగం ఆకలి తీరిన తరవాత రాముడు ఎదురుగా కూర్చున్న రత్తిని తల ఎత్తి చూశాడు. ముక్కాలి పీటమీద ఉన్న దీపం వెలుగులో రత్తి ఎంతో అందంగా అవుపించింది. రాముడు తలెత్తగానే అప్పటిదాకా రాముణ్ణే చూస్తున్న రత్తి తల వొంచుకుని నేలచూపులు చూస్తూ "ఇంకాత్త కూరెయ్యనా ?" అంటూ కూరదాక అందుకుంది.

"ఒద్దులేయే. నిన్ను సూత్తుంటేనే కడుపు నిండిపోతుంది. మామ్మా, నువ్వూ కూడా కూడు తినేయండి" అని మామ్మకు వినబడేలా చెప్పి, రత్తి చెవిలో— "బైట ఎన్నెల బాగుంది. బేగా కూడు తినెయ్ ఏటవతలికెల్దాం"

అన్నాడు.

అప్పటిదాకా నేలచూపులు చూస్తున్న రత్తి రాముడి కళ్ళల్లోకి కొంటెగా చూస్తూ, చూపులతోటే రాముడికి గిలిగింతలు పెట్టింది. రాముడు చెయ్యి కడుక్కుని అరుగుమీద చాపవేసుకు కూర్చున్నాడు. ముసల్ది ఎప్పుడు కునుకు తీస్తుందా, రత్తి ఇంటిపని ముగించుకొని ఎప్పుడు బైటపడ్తుందా— అని వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తున్నాడు రాముడు. రత్తిచెయ్యి పట్టుకుని, ఏరుదాటి మకాం దగ్గరికి చేరుకోవాలని రాముడి మనసు తహతహలాడుతోంది. క్షణమొక యుగంగా గడుస్తోంది.... మొత్తానికి రత్తి పైటకొంగుతో చెయ్యి తుడుచుకుంటూ గుడిసెలోంచి బైటికి వచ్చింది. రాముడు రత్తిచెయ్యి పట్టుకుని ఏటివేపు బయలుదేరాడు.

వెన్నెల పుచ్చపువ్వులా మెరిసిపోతుంది. వెన్నెల్లో రత్తి చుక్కలా మెరిసిపోతుంది. ఆరోజు ఏరు కాస్త పోటులో ఉంది. అక్కడిదాకా రాముడు రత్తిచెయ్యి పట్టుకొని లాక్కువస్తే, ఏటిలోకి దిగిన తరవాత రత్తి రాముడు చెయ్యిపట్టుకొని నడిపించడం ప్రారంభించింది. పోటెత్తిన యేరు రత్తి వయసు పోటుకి జడిసి దారిస్తున్నట్టు అనిపించింది రాముడికి. మొలదాకా తడిసిన బట్టలతో ఇద్దరూ 'మకాం' దగ్గరికి చేరుకున్నారు.

గడ్డి మేటునానుకొని కూర్చున్నారు. వెన్నెల వెలుగులలో ఒకరి మొహాలొకరికి మసకమసగ్గా కనబడుతున్నాయి. ఆ మసకమసక వెల్తుర్లోనే చూపులతోటీ, పెదవులుతోటీ మాటలు లేకుండానే వారిద్దరి మనసులూ గుసగుసలాడ్తున్నాయి. రాముడు "ఆ చూపేటి? మాటా మంచీ లేకుండానూ...!"అన్నాడు రత్తి తలను మునివేళ్ళతో చిందరవందర చేస్తూ.

"ఏం మాట్లాడమంటావు?" అని మాత్రం అంది, రాముడి చేతిని తన చేతుల్లోకి తీసుకొని రత్తి.

రాముడు నవ్వుకున్నాడు. ఆ క్షణంలో రాముడు పొందిన అనుభూతికి అవధుల్లేవు. చుట్టూ ఉన్న వెన్నెల... చల్లని పిల్లగాలి... వెన్నెల్లో తడుస్తున్న ఆకుపచ్చని ప్రకృతి అందాలూ... అన్నీ వాళ్ళిద్దరికోసమే ననిపించింది రాముడికి. రత్తి భుజం మీద చెయ్యివేసి, గుండెల మీదికి లాక్కున్నాడు. రత్తి రాముడి గుండెలమీద వాలి అతని ముఖంలోకి చూస్తూ"నేను రేపెళ్ళిపోతాను"అంది.

ఆ మాట రాముడికి నచ్చలేదు. తనలోంచి, తన గుండె వేరయిపోతున్నట్టనిపించింది. "ఇప్పుడంత తొందర ఏమొచ్చిందీ, ఎల్దువుగాన్లే" అన్నాడు రాముడు.

"ఇంకా ఎన్నాల్లుండమంటావ్! నేనొచ్చి అప్పుడే పదిరోజులైంది. బొమ్మ కాల్నొప్పి మొన్ననే తగ్గిపోయింది. నీతో సెప్పి ఎల్లిపోదామనాగేను" అంది రత్తి.

"ఇప్పుడంత అరిజంటేమొచ్చిందే? అక్కడకెల్లి పెద్ది గేది పాలుగాని పితకాలా నువ్వు? ఎల్దుగాన్లే" అన్నాడు.

"ఇంకా ఎన్నాల్లుండమంటావ్...?"

"ఎన్నాళ్లైనా ఉండొచ్చు. ఇదేం నీకు పరాయిల్లా?"

"నేనిక్కడుండేలాగ నువ్వు సేసుకుంటే నేను కాదన్నానేటి? అప్పుడు సొంతిల్లు లాగే చూసుకుంటాను. అందాక ఎన్నాళ్లున్నా ఎప్పుడో ఓ అప్పుడు తిరిగెల్లాల్సి దేగా?" అంది రత్తి.

ఆ మర్నాడు రత్తి వెళ్ళిపోయింది. రత్తి జ్ఞాపకాలు మాత్రం రాముళ్లో చోటు చేసుకొని స్థిరపడిపోయాయి.



# 11

ఊళ్లోని జనం దృష్టిలో కమలమ్మ ఏ సమస్యలూ లేనిది. బంగారు పిచ్చిక. ప్రెసిడెంటూ, మునసబూ, ఆచారీ నిరంతరం ఆలోచించేది ఆ బంగారుపిచ్చికను తమ పంజరంలో ఎలా బంధించాలా అని... ఏఆలోచనా లేనివాడు రాముడు. తన పని తను చేసుకుంటూ కమలమ్మ తనమీద ఉంచిన నమ్మకాన్ని నిలబెట్టుకొని ఆ కనుతాన్ని మరింత పెంచడమే రాముడి లక్ష్యం. కాని, కమలమ్మకు అన్నీ సమస్యలే. బాబుకి అయిదేళ్లు నిండాయి. వాణ్ణింక స్కూల్లో చేర్పించాలి. బోలెడంత ఆస్తి ఉన్నా, ఆసరాగా నిలబడే మగదిక్కు తనకి లేదు. ఊళ్లో పెద్దలనుకునే ముగ్గురికీ తన గురించీ; తన ఆస్తి గురించీ ఎటువంటి ఉద్దేశాలున్నాయో ఆమెకు చూచాయగా తెలియకపోలేదు. ఉన్న ఒక్క అన్నగారూ ఎందుకూ కొరగానివాడయ్యాడు. తనవాడు కాకపోయినా ఈనాటికి తనవాడుగా ఉన్నవాడు రాముడొక్కడే. చుక్కమ్మ కూడా నమ్మకమైన పనిమనిషి. వాళ్లిద్దరూ కూడా లేకపోతే ముఖ్యంగా రాముడే లేకపోతే తన బతుకు ఎలా ఉండేదో, ఎంత భయంకరంగా ఉండేదో, ఎవరెవరి కాళ్లు తను పట్టుకోవలసి వచ్చేదో అని కమలమ్మ నిరంతరం ఆలోచిస్తూనే ఉంటుంది.

ఏది ఏమైనా రాముణ్ణి తప్ప ఆమె ఎవ్వర్నీ నమ్మదలుచుకోలేదు. బాబుకి స్కూల్లో చేరే వయసు వచ్చింది. ఇంట్లో తనే వాడికి అక్షరాలు నేర్పింది. అయినా ఏదో ఒకరోజున వాడిని స్కూల్లో చేర్పించాలి. ఊళ్లోనే ఉన్న వీధిబడిలో చేర్పించడం ఇష్టం లేదు తనకి.

ఓ రోజున రాముణ్ణి పిలిచి పట్నం వెళ్లడానికి సవారీ బండి సిద్ధం చెయ్యమంది. చినబాబుని తీసుకొని పట్నానికి బయలు దేరింది. బండికి ముందూ వెనకా కూడా దుప్పట్లు తెరలుగా కట్టారు. ఆది నుంచీ కూడా ఆ లోగిట్లోని ఆడవాళ్లు బైటికి వెళ్తే బండికి తెరలు కట్టుకొని వెళ్లడమే రివాజు. కమలమ్మ కాస్త చదువుకున్నదే అయినా ఆ కుటుంబ ఆచారాల్నీ, సంప్రదాయాల్నీ మనసా వాచా పాటిస్తోనే ఉంది. రాముడే స్వయంగా బండి తోల్తున్నాడు.

బండి పట్నం చేరుకుంది. బాబుని ఓ గురుకులంలో చేర్పించింది. అక్కడ ఉన్న ఉపాధ్యాయులకి మరీ మరీ చెప్పి అప్పచెప్పింది. బాబుని చీటికీ మాటికీ ఊళ్ళోకి తీసుకురాకుండా తానే నెలకొక సారి వచ్చి చూసి వెళ్తానని హెడ్ మాస్టరికి చెప్పింది. స్కూల్లో బాబును విడిచి వచ్చేటప్పుడు కమలమ్మకు మరీ బాధనిపించింది. కాని వాణ్ణి చదివించాల్సిన సమయంలో చదివించకుండా తనకి తోడుగా ఆ లోగిట్లోనే బంధించేస్తే వాడెందుకూ పనికిరాని వాడై పోతాడు. ప్రపంచం అంటే ఏమిటో తెలియనివాడై పోతాడు. పెద్ద ఆస్తికి వాడు వారసుడు. దానిని నిర్వహించుకొనేందుకు తగిన శక్తి సామర్థ్యాలు వాడికి అవసరం. అందుకే వాడు చదువుకోవాలి. తను ఒంటరిగా లంకంతలోగిట్లో ఉండాల్సి వచ్చినా బాధలేదు. ప్రస్తుతానికి తాను ఒంటరిదే అయినా తనకీ ఒక కొడుకు ఉన్నాడు. వాడు పెరిగి పెద్దవాడయితే, వాడి నీడనే ఏ బాదరబందీ లేకుండా హాయిగా తన ముప్పు చెరిగిపోతుంది. అందాకా ఈ ఒంటరితనం, ఈ సమస్యలూ, ఆలోచనలూ, తనని పీడిస్తూనే ఉంటాయి ... అనుకుంటూ బాబుని స్కూల్లో దిగవిడిచి ఆమె, రాముడూ కలిసి తిరిగి ఇంటికి వచ్చేశారు.

ఇంటికి వచ్చాక నాలుగైదు రోజుల పాటు కమలమ్మకు పిచ్చెత్తినట్టు ఉంది. బాబు పక్కలో లేకపోవడంతో నిద్ర పట్టేదికాదు. ఒకోసారి నిద్దట్లోనే బాబు కోసం పక్కంతా తడుముకునేది. కళ్ళు తెరిచి చూసి, బాబు పట్నంలో ఉన్నాడని గుర్తుకు తెచ్చుకొని గుండెరాయి చేసుకొని మళ్ళీ పడుకొనేది.

* * *

నరసింహం చేతికి మళ్ళీ డబ్బు వచ్చింది- అని తెలుసుకున్న బేబీ కన్నీటి కళ్ళెం వేసి నరసింహాన్ని ఇంటికి తెచ్చుకుంది. నిప్పు తగిలితే కరిగిపోయే మైనం ముద్దలా నరసింహం మనస్సు బేబీ కన్నీటికి కరిగిపోయింది. ఆమె మాటలను నమ్మాడు. వారం రోజుల పాటు నిలవనీడ లేకుండా చేసినా, ఆమె వచ్చి పిలవగానే ఆమెతోబాటు పెంపుడు కుక్కలా వెళ్ళిపోయాడు.

బేబీ చాలా తెలివైనది. నరసింహం లాంటి వాళ్లనీ, నరసింహం కంటె రసికుల్నీ చాలామందిని చదరంగంలో పావుల్లా నడిపించింది. ఆమెకు నరసింహం ఒక లెక్క కాదు. ఆమెతో పాటు నరసింహం వచ్చిన రోజున ఆమె ప్రవర్తన నరసింహం ఎన్నటికీ మర్చిపోలేడు.

తాను లేకపోతే పాపం బేబీ బతికదేమో-అని నరసింహం మనస్ఫూర్తిగా నమ్మేటట్లు వ్యవహరించింది బేబీ ఆ రోజు. నరసింహం ఆమె తనను దగా చేసిందని అనుకున్నందుకు మనసులోనే ఎంతో బాధ పడిపోయి నోరు విప్పి క్షమాపణ చెప్పుకున్నాడు.

"ఛ...ఈ మాత్రం దానికే క్షమాపణ దేనికీ? అనుమానాలూ, అపార్థాలూ ప్రేమికుల మధ్య కాకపోతే ముక్కూ మొహం ఎరగనివాళ్లమధ్య ఉంటాయా?"

అంది బేబీ.

"అది కాదు బేబీ...నేను నీ గురించి చాలా నీచంగా ఆలోచించాను. డబ్బు ఉన్నన్నాళ్ళూ ఉండి, నా దగ్గర డబ్బయి పోవడంతోటే నన్ను కోటితో పొమ్మన లేక ఇంటికి తాళం పెట్టి ఎక్కడికో పోయింది—అనుకున్నాను" అన్నాడు నరసింహం.

"పోనీలెండి. నా గత జీవితం అలాంటిది గాబట్టి, నా వృత్తి అలాంటిది గాబట్టి మీరలా అనుమానించడంలో తప్పులేదు. మనం కలిసి ఆరు మాసాలు పైనే కావస్తూంది... ఎప్పుడయినా, మీ మనసు నొప్పించానా? మీకు నచ్చనట్టుగా ప్రవర్తించానా... సూటిగా ఒక్కమాట చెప్పండి. మీరు నా మెడలో తాళి కట్టక పోయినా, తాళి కట్టించుకున్న భార్య లాగే ఉన్నానుగాని, ఎవరినేనా కన్నెత్తి చూసి ఎరుగుదునా!" అంది బేబీ.

"ఛ. అవేం మాటలు? నేనన్నానా?" అన్నాడు నరసింహం.

"లేదనుకోండి. నా మనసు మీకు తెలియాలిగా. అందుకని చెప్తున్నాను. దేవుడిమీద ఒట్టేసి చెప్తున్నాను. నాది అంటూ ఏమీ లేదు. మీది కానిది నా గ్గర ఏమీ లేదు. నేనూ, నా సర్వస్వం మీకేనాడో అంకితం అయిపోయాయి" అంది బేబీ.

ఆ మాటలకు నరసింహం కళ్ల వెంట నీళ్లు తిరిగాయి. ఆమెను హృదయానికి హత్తుకుని "నేను ఇన్నాళ్ళూ ఏకాకిని బేబీ ఇప్పటికి నాకూ ఒక జంట దొరి కిందనిపిస్తూంది..." అన్నాడు నరసింహం మనస్ఫూర్తిగా.

ఆ సమయంలో నరసింహం, బేబీల మధ్య అరమరికలు లేవు. వ్యాపారం లేదు. కోరిక లేదు. ఉన్నదల్లా ఆప్యాయత, అనురాగం... ఇది నరసింహం నమ్మకం.

కాని—

బేబీ మనసు వేరు, మనిషి వేరు... అగుపించే మనిషికీ, అగుపించని మనసుకీ చాలా తేడా ఉంది ఆమె విషయంలో.

బేబీ నవ్వుతూ— డబుల్ కాట్ మీద పడుకుని సిగరెట్ పొగ రింగులుగా వదులుతూ తీయని ఊహల్లో తేలిపోతున్న నరసింహం పక్కని కూర్చుంది. ఒంటి మీద బిగువైన బాడీ, లంగా తప్ప మరేమీ లేవు. నరసింహం బనీనూ, లుంగీతో ఉన్నాడు. బేబీ అతని గుండెల మీద ఆని అతని ఉంగరాల జుత్తుతో మునివేళ్ళతో ఆడుకుంటోంది. నరసింహానికి ఆ రోజే ఇంద్రపదవిని అలంకరించినట్టు అన్పించింది. బేబీ ఏ వరం అడిగినా ఇచ్చేసేలా ఉన్నాడు.

"ఈమధ్య మీచెయ్యి బాగుందట..." అని అంది బేబీ చూచాయగా ఏదో చెప్తున్నట్టు.

"బాగుండడంలోనూ అలాగా ఇలాగా కాదు. నువ్వు ఊరికి వెళ్ళే సరికి నా జేబులో పది రూపాయలనోటు మాత్రం ఉంది. వారం రోజుల్లో నువ్వు తిరిగి వచ్చేసరికి దగ్గిర దగ్గిర పాతిక వేలు అయ్యాయి." అన్నాడు నరసింహం

# మినీకథ

"పెళ్ళి చేసుకొచ్చావేంటోయ్ సుబ్బారావ్?"

"నీకెలా తెలిసింది?" అన్నాడు సుబ్బారావు ఆశ్చర్యంగా.

నిన్ను చూస్తే తెలియటంలా?" అన్నాడు రామారావు సుబ్బారావు మెడ వంకే చూస్తూ విరగబడి నవ్వి. పచ్చని సుబ్బారావు మెళ్ళో పసుపు తాడుకు కట్టిన మంగళ సూత్రాలు అతని పల్చని టెర్లిన్ తెల్ల చొక్కా లోంచి తళతళ లాడుతూ స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆఫీసులో అందరూ అతని వంకే ఆశ్చర్యంగా చూడటం మొదలు పెట్టారు—

"అయితే మా ఆవిడ చాలా తెలివి లేసోయ్. నాకిప్పటికి నమ్మకం అన్నాడు సుబ్బారావు.

"అదెలా?"

"ఎలాగేమిటి—'శోభనం నాటి రాత్రి గదిలో పెళ్ళయిన ఆడదాన్ని యిట్టే చూసి అట్టే గ్రహించెయ్యొచ్చు. పనికట్టుకొని అడిగితే కాని మొగాడు పదిమంది బిడ్డల తండ్రయిందీ పెళ్ళికాని పైలా పచ్చీసు కుర్రాడైందీ తెలియదు. మట్టెలు నల్లపూసలు, మంగళ సూత్రాలు యిన్ని మంగళ చిహ్నాలూ ఆడవాళ్ళకే ఎందుకు— మీరు మంగళసూత్రాలు కట్టుకోండి నేను నల్లపూసలుంచుకుంటూను' అని మా ఆవిడే గదిలో నా మెళ్ళో మంగళ సూత్రం కట్టిందోయ్!"

"ఛీ! సిగ్గులేదూ నువ్వెందుకు ఒప్పుకున్నావ్?"




"ఆ మాటే నేన్నాను. 'పెళ్ళి చేసుకోగాలేంది ఆ మాట నలుగురికీ తెలిపేందుకు సిగ్గెందుకు? మగవాళ్ళు మెళ్ళో పులిగోరు పతకాలు వేసుకోవటం లేదూ అలాగే యిదీనూ! పెళ్ళిళ్ళ పేరయ్యలే కాకుండా యీ రోజుల్లో అమ్మాయిలు కూడా కాస్త కంటికి నదరగా కనబడ్డ మగవాడు కనబడంగానే ప్రేమించెయ్యటం ఆనక ఉచ్చులు బిగిశాక ఆ అబ్బాయికి పెళ్ళైందని తెలిసినా వదిలించుకోలేకపోవటం తరుచూ జరుగుతూంది. ఇలా చూడగానే తెలిసిపోతుంటే అటువంటి బాధలుండవు' అందోయ్ మాఆవిడ. పైగా వివాహమనే కట్టు కొయ్యకు మనిషిని బంధించే పలుపుతాడు కదా మంగళసూత్రం—యీ పలుపుతాడు పసుపుతాడుగా మెళ్ళో వుంటే పేకాటలో కూర్చున్నప్పుడు, బార్లకి వెళ్ళేటప్పుడూ, రెడ్ లైట్ ఏరియాలకు షికార్లు తిరిగేటప్పుడు కాస్త అడ్డుతాడుగా ఉపయోగపడుతుంది కూడా అందోయ్ మా ఆవిడ. ఆ మాటా నిజమే కదా—" అన్నాడు సుబ్బారావు.

అతని మాటలకు మగవాళ్ళు ధుమ ధుమ లాడితే, ఆడవాళ్ళు కిసుక్కున నవ్వారు. ధుమధుమ లాడినా కిసుక్కున నవ్వినా అతని మాటల్లో ఏమూలోవున్న 'సబబు' వాళ్ళని నిలవనీయకపోతే తలలు విదిలించుకుంటూ కాంటీన్ వైపు నడిచారు!

**ఎస్. రామమోహన్‌రావ్**

ఎంతో గర్వంగా.

గెలుపు సంగతి ప్రియురాలితో చెప్పే టప్పుడు మగాడికి మరీ ఆనందమేమో! బేబీ కిల కిలా నవ్వి "అందుకే మీ చెయ్యి బాగుందీ—అన్నాను. ఇటువంటి సమయంలో ఈ చిన్న పట్నంలో ఉండి చిన్నాట ఆడేకంటే హైదరాబాదో, మద్రాసో పోయి రేసులు ఆడుకోవడం మంచిది. ఏ మనిషికేనా లక్కీ పీరియడ్ కొంత కాలమే ఉంటుందంటారు..." అంటూ సలహా ఇచ్చింది బేబీ.

ఆ సలహా నరసింహానికి నచ్చింది కూడా. ఇద్దరూ బయల్దేరారు.

శుక్రవారం నాటి సాయంత్రానికి హోటల్ బ్లాక్ స్టార్‌లో 'మిస్టర్ అండ్ మిసెస్ నరసింహం' పేరుతో బేబీ, నర సింహందిగారు. శనాదివారాల్లో నరసింహం బేబీని వెంట పెట్టుకుని మలక్‌పేట రేసు కోర్సుకి వెళ్ళాడు. బిగినర్స్ లక్ కలిసి వచ్చింది. బుక్కీస్ మీదా, తనాలా మీదా పదివేలు దాకా గెల్చుకొన్నాడు. అలా హోటల్ రూమ్‌లోనే కాపరం ఉండి పోయారిద్దరూ.

శని, ఆదివారాల కోసం ఎదురు చూడ్డం, రేసులకు వెళ్ళడం, కొద్దో గొప్పో గెల్చుకొని, వారం అంతా ఆడూ పాడూ గడిపేయడం—అదీ వాళ్ళిద్దరి జీవితం.

కాకపోతే నరసింహానికి బాగా అను భవం వచ్చింది రేసుల్లో. కొత్త పరి చయాలు ఏర్పడ్డాయి. అందులోనూ అందమయిన ఆడది పక్కని ఉన్న ప్పుడు, పరిచయాలు మరీ సులువుగా ఏర్పడతాయి. పెద్ద పెద్ద పంటర్స్‌తో జాక్‌పాట్ కాంబినేషన్స్ వేస్తున్నాడు నరసింహం. అతని పక్కని ఉంటూనే బేబీ పరిచయం అయిన పెద్దవాళ్ళతో చూపులతోటే ఎగ్రిమెంట్లు చేసుకుం టోంది. నరసింహం కాస్త కనుమరు గయితే పరిచయస్తుల్ని మాటల్తో కవ్వి స్తోంది. నరసింహం స్నేహితుల దృష్టిలో బేబీ ఒక చక్కటి సొసైటీ లేడీ. నర సింహం దృష్టిలో ఆమే తన సర్వస్వం. ఆమే తన అదృష్టం!

అదృష్టం కలిసివచ్చింది నర సింహానికి.

రెండు వేల రూపాయిల కాంబి నేషన్‌లో సాల్వ్‌కాని జాక్‌పాట్ నర సింహం సరదాగా కొన్న ఒకే ఒక్క టికెట్టుతో సాల్వ్ అయింది. ఒక్క మారుగా లక్షా ఏభై వేలు నరసింహం ఒళ్లో వచ్చి వాలేయి. బ్లాక్‌మనీగా చేసుకు నేందుకు రేసులకు వచ్చే చలపతి లక్షా ఏభై వేలు గెల్చుకొన్న టికెట్టును పాతిక వేలు అదనంగా యిచ్చి కొనుక్కు న్నాడు.

నరసింహం దగ్గర లక్షా డెబ్బయ్ అయిదు వేలు ఉన్నాయని ఒక్క చల పతికీ, బేబీకి మాత్రమే తెలుసు.

ఆ రాత్రి... మర్యాద కోసం నర సింహం చలపతిని విందుకు పిలిచాడు. బేబీ కళ్లలో అగుపించే మత్తు చలపతిని ఆ ఆహ్వానాన్ని అంగీకరించేలా చేసింది. చలపతి బేబీ కళ్లల్లోకి చూస్తూ "మీరు పిలిస్తే ఎలా కాదంటాను? ముందుగా

పార్టీ నేనివ్వాలి. తరవాత మీరు..." అన్నాడు.

నరసింహం ఏదో అనబోతూ ఉండగానే "ఓకే" అని గ్రీన్ సిగ్నల్ ఇచ్చేసింది బేబీ.

"స్నేహితుల మధ్య ముందు వెనక లేముంది? ఈ రోజు పార్టీ మీరివ్వండి. రేపు నేనిస్తాను" అన్నాడు నరసింహం.

"కాని నేనిచ్చే పార్టీ ఈ గదిలోకాదు. ఏదైనా ఊరి చివర గెస్ట్ హౌస్‌కి వెళ్దాం. రికార్డు ప్లేయరూ, చక్కని రికార్డులూ తెస్తాను. మనం ఎలా సరదాగా కాలక్షేపం చేసినా ఎవరికీ ఇబ్బంది ఉండదు" అని తన ప్రతిపాదనను నరసింహానికి తెలియజేశాడు చలపతి.

"అదే బెటర్" అంది బేబీ.

* * *

రాత్రి ఎనిమిది గంటలకు—చలపతి కార్లో—చలపతి, నరసింహం, బేబీ బయలుదేరారు. చలపతే కారు డ్రయివ్ చేస్తున్నాడు. ఫ్రంట్ సీట్లో చలపతిని ఒక్కణ్ణి వదిలేసి బేక్ సీట్లో నరసింహం, బేబీ కూర్చోవడం బాగోదని—బేబీ చలపతి పక్కని కూర్చుంది. నరసింహం దాని గురించి ఏం పట్టించుకోలేదు. కొత్తగా కొత్తనాగరికతను జీర్ణం చేసుకుంటూన్న నరసింహానికి—ఆ నాగరిక నిషాలో అది సర్వసామాన్య విషయంగా తోచింది. కారు గెస్ట్ హౌస్‌కి చేరేలోపున ఒకటి రెండుసార్లు బేబీ చలపతి కాళ్లను తన కాళ్లతో తొక్కింది. చలపతి సుముఖంగానే నవ్వాడు. ఆ నవ్వుని ఆసరాగా తీసుకుని బేబీ మరి కాస్త ఎడ్వాన్స్ అయింది.

బేబీ తన ముందున్న అద్దంలో వెనుక కూర్చున్న నరసింహాన్ని గమనిస్తోంది. అతను విండోలోంచి బైటికి చూస్తూ ఉన్నప్పుడు తన మునివేళ్లతో బేబీ చలపతి తొడమీద సున్నితంగా మీటింది. చలపతి ఓరచూపుతో బేబీకి 'థాంక్స్' చెప్పుకున్నాడు. వాళ్లిద్దరి చూపులూ, నరసింహం చూపుల్లో పడకుండా 'సై' అంటే 'సై' అనుకున్నాయి.

గెస్ట్ హౌస్ ముందు కారాగింది.

చలపతి ఏర్పాట్లన్నీ బ్రహ్మాండంగా చేశాడు.

విదేశీ విస్కీ, విదేశీ సిగరెట్లు విదేశీ సంగీతం ... ... మధ్య స్వదేశీయులు ముగ్గురూ కులాసాగా ఆ రాత్రిని గడుపుతున్నారు. చలపతి మనసులో కొత్త కోరికలు చిగురించాయి. బేబీకి నరసింహం పాతగా కనబడ్డాడు. నరసింహానికి చలపతి ఆత్మీయుడుగానూ, బేబీ తన అదృష్టం గానూ అన్పిస్తోంది.

నరసింహం బాత్‌రూమ్‌లోకి వెళ్లాడు.

బేబీ చలపతికి తొలికానుకగా ఒక చిరుముద్దిచ్చింది. ఆ పెదవుల కలయికలోనే వాళ్ళిద్దరి మధ్యా లక్షలు కిమ్మత్తు చేసే ఎగ్రిమెంట్లు జరిగిపోయాయి.

నరసింహం బాత్రూంలోంచి వచ్చాడు. బేబీ పక్కనే కూర్చున్నాడు. బేబీ మూతలు పడే రెప్పలతో నరసింహాన్ని చూస్తూ అతని ఒళ్లో వాలింది. నరసింహానికి ఎంతో గర్వంగా అనిపించింది. పసిపాపను బుజ్జగిస్తోన్నట్లుగా ఆమె తలనూ, ఒంటినీ ఆప్యాయంగా

నిమిరాడు నరసింహం. అది చూసిన చలపతి "మీరు నిజంగా అదృష్టవంతులు నరసింహం గారూ! బేబీలాంటి భార్య దొరకడం నిజంగా ఒక వరం" అని అభినందించాడు.

నరసింహం 'నిజమే' నన్నట్లు నవ్వాడు.

తెల్లవారు ఝామున ఐదు గంటలకి చల్లని గాలిలో గెస్ట్ హౌస్ నుంచి చలపతి కారు మహానగరం వేపు బయలు దేరింది. సంధ్య వెలుగులో రోడ్డుకి ఇటూ అటూ ఉన్న ద్రాక్ష తోటలూ, గుట్టలూ, అక్కడక్కడ ఏవేవో బిల్డింగులూ బేబీ కళ్ళకు మసక మసగ్గా కనబడుతున్నాయి. బేబీ చలపతి పక్కనే ఫ్రంట్ సీట్లోనే కూర్చుంది. వెళ్ళేటప్పుడు కూర్చున్నంత దూరంగాకాదు, ఎప్పటికీ విడిపోనంతదగ్గరగా కూర్చుంది. ఆమె ముందున్న అద్దంలో బేక్‌సీట్ ఖాళీగా కనబడుతోంది...

బేక్‌సీట్లో నరసింహంలేడు...
గెస్టు హౌస్‌లో నరసింహం నిద్ర
పోవటం లేదు...
కాదు వెనక డిక్కీలో...
...సుదీర్ఘ నిద్రలో ఉన్నాడు నరసింహం.

తనకు ఎవరూ తెలీని నగరంలో, తన గురించి ఎవరూ, పట్టించుకోని నగరంలో, తనను ఏనాడో వదిలించుకున్న ఒక్కగానొక్క చెల్లెలికి ఎంతో దూరంలో...

...చలపతి కారు డిక్కీలో
నరసింహం శవం!

నరసింహం అదృష్టవంతుడు...

ఏ రోడ్డు పక్కనో ఆకలితో మాడి కళ్ళు మూయకుండా విదేశీ సంగీతాన్ని వింటూ, విదేశీ నిషాలో, ప్రియురాలి పక్కనే కూర్చుని ఆప్యాయంగా చలపతి అందించిన గ్లాసును ఖాళీ చేసి, తను ఖాళీ ఐపోయాడు?

ఏ బాధా, యాతనా లేకుండా — ఏ రోగం రొష్టూలేకుండా - సునాయాసంగా కన్నుమూశాడు నరసింహం. అతను ఎందుకు పోయాడో, గెస్టు హౌస్ కి తెలుసు. ఎలా పోయేడో బేబీకి చలపతికి తెలుసు. చలపతి కారుకి తెలుసు ... అతను ఎక్కడ పాతిపెట్టబడ్డాడో నోరులేని సంధ్య వెలుగుకి తెలుసు. నరసింహం జీవితం ముగిసింది బేబీకి కొత్త జీవితం ప్రారంభమయింది.

ఆ జీవితం ఎంతవరకూ సాగుతుందో బేబీ సంగతి తెలిసిన చలపతి, బేబీని ముగిస్తాడో, లేక కొత్త వల పన్ని బేబీ చలపతినే ముగిస్తుందో — కాలానికి తెలియాలి...

కమలమ్మ దృష్టిలో - ఆమె అన్న నరసింహం ఎక్కడో బతికే ఉన్నాడు. అతను బాగుపడడు. తిండి కూడా దొరకనప్పుడు ఆమెను వెతుక్కుంటూ వస్తాడు...!



## 12

ఆది కార్తీక మాసం.

ఆ రోజు మధ్యాహ్నం ప్రెసిడెంటు గారి మామిడితోటలో వనభోజనాలు జరిగాయి. కమలమ్మను కూడా ఆహ్వానించారు. కాని ఆమె రాలేదు. ఒక బస్తా బియ్యం చందా పంపించింది. రాయలంగారు బతికున్న రోజుల్లో ఇలాంటి వనభోజనాలు వారి మకాం దగ్గరే జరిగేవి. ఆయన పోయినప్పటినుంచీ ఈ వన సంతర్పణలు ప్రెసిడెంటు తన మకాం దగ్గరే జరిపిస్తున్నాడు. వన సంతర్పణల నిర్వహణ అంతా ఆదారిదే!

వీటి ద్వారా కూడా ప్రెసిడెంటు కొంత మిగుల్చుకుంటాడు ఏటా...

సాయంత్రం ఐదు గంటలయింది.

భోజనాల కార్యక్రమం పూర్తయిపోయింది. గుండిగలూ, గంగాళాలూ, పాత్రసామాన్లు మంగీ, మరో ఇద్దరు మనుషులూ కడిగి శుభ్రంచేస్తున్నారు. ఆదారి మంగిని పిలిచి "ఆ పాత్రసామాన్లు కడిగే పని త్వరగా పూర్తి చెయ్యే. రాత్రికి పట్నం నుంచి రికార్డు డాన్సర్ కనకాంబరం వస్తూంది. ప్రెసిడెంటు గారి మకాం గాజుల గలగల తోటీ గోలీ సోడా కీచు ధ్వనులతోటీ, గ్లాసుల చప్పుళ్ళతోటీ, ఇంద్రభవనంలా ఉంటుంది. నువ్వు త్వరగా ముస్తాబైరా!" అని దాని చెవిలో ఊదాడు.

ఆదారి ఎప్పుడు చీకటి పడుతుందా-అని ఎదురుచూస్తున్నాడు.

మొత్తానికి కష్టమ్మీద చీకటి పడింది!

జనం అందరూ సర్దుకున్నారు.

ప్రెసిడెంటుగారి మామిడితోటలో ఉన్న పెద్ద మోరపాకలో జంబుకానాలు పరిచి ఉన్నాయి. రెండు పెట్రొమాక్స్ లైట్లు వెలుగుతున్నాయి. పట్నం నుంచి వచ్చిన రికార్డ్ డాన్సర్ కనకాంబరం ప్రెసిడెంటుకీ, మునసబుకీ మధ్య కూర్చుంది. ఆదారి పక్కని మంగి కూర్చుంది. మంగి గ్లాసుల్లో మందును నింపి ఒక్కొక్కరికి అందిస్తోంది. తనో గ్లాసు తీసుకొని గడగడా తాగేసింది.

ప్రెసిడెంటు నవ్వుకుని "నాటుసరకు రుచి మరిగిన మంగికి ఈ సీమసరుకు ఎక్కడానుతుందీ" అన్నాడు.

"ఈయేల మంగి దెబ్బకి ఆదారిగారు తట్టుకోపటం కట్టమే," అన్నాడు మునసబు కొంటెగా.

"సాల్లెండి ... అన్నీ ఇలాంటి ఊసులే మీయీ... "అంటూ మంగి మునసబు తొడ మీద గిల్లింది.

"సీ సిగ దరగ... ఉండే, ఇప్పుడిప్పుడే నా జోలికి రాకు. నాలుగైదు రౌండ్లు అయ్యాక ఏమోగాని ఇపుడప్పుడే నీ జోలికి నేను రాలేను. అన్నాడు మునసబు.

ప్రెసిడెంటు నవ్వాడు.

"కొత్త పిట్ట పక్కన వుంటే అలాగే వుంటది. ఆ మడిసి ముందు గొప్పలు పోకండి. మన రండా గొండి ఇయాల్దా" ఏనాటి నుంచి ఒత్తంది," అంది మంగి. ఆచారి "ఒక్క గ్లాసు తాగావో లేదో అప్పుడే అలా ప్రేటేగి పోతావేమిటి కాసేపు బుద్ధిగా కూర్చో. ఇంకా టైముంది కనకాంబరం చక్కగా పాడుతుంది. ఒక పాటఎత్తుకో అమ్మాయ్" అంటూ మంగిని మందలించి కనకాంబరానికి పాట పుర మాయించాడు ఆచారి.

ప్రెసిడెంటు "ముసలోడికి దసరా పండగ... అందుకోవే ఒకపాట ఆ కేసుని పాటలతోటే సరిపెట్టెయొచ్చు. ఆటల్దాకా రాలేదులే" అన్నాడు.

"భలేవారే! ఆచారిగారి సంగతి నాకు తెలీదా ఏమిటి! మంగికి జడిసి అలా వున్నారేమో కానీ లేకపోతే ఈ పాటికి నా రెండు బుగ్గలూ ఆయనగారి గిల్లుల్తో ఈ పాటికి వాచిపోయి ఉండేవి" అంది కన కాంబరం.

"అదిగో... అదిగో ...అలా నన్ను రెచ్చగొడితే బుగ్గా జబ్బా కూడా గిల్లేస్తా. గిల్లటం ఏమిటి కొరికేస్తానంతే" అంటూ ఆచారికనకాంబరం మీదకి వెళ్ళబోయాడు.

మంగి ఆచారి జబ్బ పట్టుకుని వెనక్కి లాగి కుదేసింది.

"నన్ను ప్రేటేగి పోవద్దని నువ్వు పోట్రేగిపోతావేంటి! నేను పక్కన ఉండ గానే ఈ దూకుడు...?" అని పైటకొంగు నడుంకి బిగించింది మంగి.

ప్రెసిడెంటూ, మునసబూ, కన కాంబరం విరగపడి నవ్వేరు.

"దీని దుంపతెగ ఈ వేళ మంగికి ఏనుగంత బలం వచ్చేసింది" అన్నాడు ఆచారి ముసి ముసి నవ్వులు నవ్వుతూ.

"జాగ్రత్తయ్యో ఆచార్లూ మంగికి వూపొత్తె నిన్ను ఉతికి ఉప్పుల్లించి ఆరే సేత్తది" అన్నాడు మునసబు.

"మంగి మాటకేం గానీ, ఇంత చక్కని పార్టీలో కమలమ్మ కూడా కలిస్తే ఎంత బాగుండేదంటారు?" అన్నాడు ఆచారి.

"ఆదెవరూ?" అంది కళ్ళు చిట్లిస్తూ కనకాంబరం.

"అలా అనకు ప్రస్తుతం ఈ ఊరికి సీతామ్మవారు ఆవిడే" అన్నాడు ఆచారి.

"అవును...ఆచార్లూ సీతమ్మవారంటే జ్ఞాపకం వచ్చింది ఆ రామిగాడికీ, కమ లమ్మకి సంబంధం ఉందని ఊరంతా పెశారం చేస్తే ఎలా ఉంటదంటావ్?" అన్నాడు మునసబు.

"తప్పండీ, కళ్ళు పోతాయి! ఆవిడ నిప్పులాంటి మడిసి" అంది మంగి రెండో రౌండుకు గ్లాసును నింపుతూ.

"సరేలేవే"...పెసిడెంటు కన్ను నీ మీద పడని క్రితం నువ్వుమాత్రం నిప్పు లాంటిదానివి కాదేటి! మరిప్పుడు— నువ్వు దార్లో పడి పోయేవు... పెసిడెంటు కళ్లు పోయాయా, నా కళ్లు పోయాయా, ఆచారి కళ్ళు పోయాయా! మొదట్లో ఎవ రైనా నిప్పే! దార్లో పడేస్తే ఆ నిప్పే నీరైపోతది!" అన్నాడు మునసబు.

"అది సరేగాని, అలాంటి పెశారం మొదలెడ్తే తట్టుకోలేక కమలమ్మే, ఈ వూర్నొంచి ఎళ్ళిపోద్దని భయం!"అన్నాడు

ప్రెసిడెంటు.

"ఎళ్ళిపోతే మరీమంచిది. ఆ కమతం మనకే కౌలుకిచ్చేసి పోతది" అన్నాడు మునసబు.

"కమలమ్మ వెర్రిదేం కాదయ్యా మునసబూ! కమలమ్మ తన కమతాన్ని కౌలుకివ్వడమంటూ జరిగితే రాముడికే యిస్తుంది. వాడంటే ఆవిడకు నమ్మకం. మన సంగతి తెలుసు కాబట్టి మనమంటే అపనమ్మకం!" అన్నాడు ఆచారి.

"నువ్వన్నమాట రైటు ఆచార్లూ! అందుకని ఆ రాముడుగాణ్ణే వూరొదిలి పోయేలా చేస్తే మంచిది" అన్నాడు ప్రెసిడెంటు.

"అలా అన్నారు బాగుంది. దానికి నేనో చక్కని ఆలోచన చెప్తాను" అంటూ ఆచార్లు ఓ గుక్క మింగి "రాముడు గాడికి రత్తంటే ప్రాణం. రత్తి కూడా సురకత్తిలా ఉంటుంది. మన కనకాంబరానికి ఫోక్ డాన్స్ డ్రెస్ వేస్తే ఎలా ఉంటుందో—అలా ఉంటుంది రత్తి. దాన్ని గాడి తప్పించి మన వేపుకి తిప్పుకోగలిగితే రామిగాడు ఊరు వదిలేనా పోతాడు-ఆ అవమానం తట్టుకోలేక చావనైనా చస్తాడు. అదీ ఇదీ గాక బరి తెగించి రత్తికో, మనకో ఏదైనా అఘాయిత్యం తలపెడితే శ్రీకృష్ణ జన్మస్థానానికి పోతాడు" అన్నాడు ఆచారి.

"నీ తస్సదియ్య! సుక్కడితే నీబుర్ర సూరేకారమేనయ్యా!" అని మెచ్చుకున్నాడు మునసబు.

"అంతేగాదు. సుక్కపడ్డంతో బాటు కళ్ళముందో, పక్కనో సక్కని సుక్క కూడా ఉంటే, సిసింద్రీ అయిపోతాడు ఆచార్లు" అన్నాడు ప్రెసిడెంటు.

"అది సరేగాని, రత్తిని ఎలాగయ్యా దార్లో పెట్టడం... ఆ ఇసయం ఆలోసించు" అన్నాడు మునసబు.

"ఏముందీ? చాలా చిన్న విషయం. రాముడుగాడు ఊళ్ళో లేని సమయం చూసి—వాడెలాగూ సుగర్ ఫ్యాక్టరీకో, పట్నంలోని కాయిదా కొట్లకో తరచూ పోతూనే ఉంటాడు కాబట్టి—అటువంటి సమయంలో రాముడు రమ్మన్నాడన్చెప్పి రత్తికి కబురంపాలి. నిజమే అనుకుని రత్తి వస్తుంది. పక్క పొలం మన ప్రెసిడెంటు గారిదేగా... రాముడిక్కడున్నాడే—అని మన ప్రెసిడెంటుగారు పిలుస్తే—అది పాకలోకి వచ్చేస్తుంది... సరే...ఆ తర్వాత మన ప్రెసిడెంటుగారు ఎలాగూ రంగధాముడే గాబట్టి రత్తిని దార్లో పెట్టేస్తాడు" అన్నాడు ఆచారి.

"మంచాలోచన చెప్పావయ్యా! ఆలస్యం ఎందుగ్గానీ, సందకాడ రాముడు పట్నం ఎళ్ళేడు. ఇప్పుడే కబురంపితే పోలే?" అన్నాడు ప్రెసిడెంటు.

"ఎవర్ని పంపుదామంటావు?" అన్నాడు మునసబు.

"ఎవరో ఎందుకూ, సాటి ఆడది మంగి ఎళ్తేనే నయం! ఎవరన్నా చూసినా గొడవరాదు!" అన్నాడు ప్రెసిడెంటు.

మంగికి ధైర్యం చెప్పి, అక్కడికి వెళ్ళి ఎలా వ్యవహరించాలో వివరించి పంపారు. అంత చీకట్లోనూ ఆచారిని జత తీసుకుని మంగి ఏరు దాటి గూడెం

**మినీకథ**



# ఆప రేషన్




భార్య సీతాలుకి గండం గడిచి, తల్లీ, బిడ్డా కూడా క్షేమంగా ఉన్నందుకు రాములు వెంకటేశ్వరస్వామి గుడికెళ్ళి, కొబ్బరికాయకొట్టి నంతోషంగా ఆస్పత్రి కొచ్చాడు. పండులా వున్న పాపాయిని చూసి మురిసిపోయాడు. "ఏమేసీతాలూ ఎట్టావుంది ఒంట్లో" అని భార్యని ఆప్యా

యంగా పలకరించాడు. సీతాలునీరసంగా నవ్వి తల పక్కకు తిప్పుకుంది. "ఇది గోనే పెసాదం. దేవుడు నిన్ను సల్లగా సూశాడు. అందుకని టెంకాయి కొట్టొచ్చాను. లిసు పెసాదం" అంటూ కొబ్బరి ముక్క ఇవ్వబోయాడు సీతాలుకి. అంతలో లేడీ డాక్టర్ వచ్చింది. "చూడు రాముయ్యా పచ్చి బాలింతరాలికి మమ్మల్ని అడక్కుండా నువ్వేమీ తెచ్చిపెట్టకూడదు. తెల్సిందా" అంటూ సీతాలు నాడి చూసింది. ఆరోగ్యం గురించి పరామర్శ చేసి వెళ్తూ "రాములూ' ఓకసారి ఇలారా" అని పిల్చింది. రాములు పసిపాపని తనివిగా ముద్దుపెట్టుకుని డాక్టర్ దగ్గరకి, అవతలకి వెళ్ళాడు. "చూశావా రాములూ! ఎంత గండం గడిచిందో! ఇప్పుడన్నా ఆపరేషన్ చేయించుకోరాదూ. చూడు సీతాలు ఎలా అయిపోయిందో" అన్నది.

రాములు సిగ్గుపడుతూ తలవంచుకున్నాడు.

"అలా ఆడపిల్లలా సిగ్గుపడతావేమిటి. చెప్పు. నువ్వొసరేనంటే, నే ఏర్పాటు చేయిస్తాను."

"అబ్బే... వద్దండీ..." అన్నాడు రాములు.

"ఏం...భయమా! నీకేం భయం అఖ్ఖరలేదు. నీకంత భయమైతే, సీతాలుకి చేయమంటావా ఆపరేషన్" అడిగింది డాక్టరు.

"అమ్మో! అదసలే ఇదిగా వుంది. దానికసలికే ఒద్దండీ" కంగారుగా అన్నాడు.

"అలా మొండిపట్టుపడితే ప్రమాదం అసలీ ఆరో కాన్పులో సీతాలు బ్రతుకుతుందో లేదోనని భయపడ్డాను. అంతా నీ అదృష్టం. ఇప్పటికైనా జాగ్రత్త పడటం మంచిది. తరువాత నీయిష్టం." అని ఖండితంగా చెప్పింది డాక్టర్

"ఆపరేసన్ సేయిచ్చుకుంటే ఇట్టా పెమాదం రాకుండా వుంటదండీ" అడిగాడు రాములు అమాయకంగా.

"ఇంత వెర్రయితే ఎలా... ఇక మళ్ళీ ఇలా జరగనే జరగదు కదా" అంది డాక్టర్ నవ్వాపుకుంటూ.

"ఏమోనండి, అయినా మళ్ళీఎందుకండీ ఆపరేసనూ..." అన్నాడు నీరసంగా. డాక్టర్ ఉలిక్కిపడింది.

"మళ్ళీనా...అంటే ఒకసారి నీకు ఆపరేషనయిందా..."

"అదేటండీ! ఎమర్జన్సీలో, నాలుగోవాడికి జొరంవస్తే, అడ్వాన్సు ఇమ్మంటే ఆపరేషన్ సేయిచ్చుకుంటే యాభైరూపాయిలిత్తానుని తీసికెల్లి సేసేశారుగదండీ"

"ఆఁ...అయితే... ఆపరేషన్ తర్వాత ఇద్దరు పిల్లలు..." నోరు తెరిచింది డాక్టర్.

"మళ్లీ ఓ యాభై యిస్తానంటే నాకభ్యంతరం లేదండీ" అన్నాడురాములు మామూలుగా.

—ఫణి

లోకి వెళ్ళింది. ఆచారి ఏటి ఒడ్డునే ఉండి పోయాడు. మంగి వెళ్ళి 'రత్తమ్మా రత్తమ్మా' అంటూ గుడిసె ముందు నిల బడి పిలిచింది.

"ఎవరదీ?" అంటూ రాముడే బైటికి వచ్చాడు.

మంగి గుండె ఝల్లుమంది.

అనుభవం కలది కనక తమాయించు కుంది.

"నేనే రాముడూ...మంగిని" అంది.

"ఇంత రేత్రి కాడ రత్తితో పనేమొచ్చింది నీకూ?" అన్నాడు రాముడు.

"అబ్బే ఏం లేదు. ఇలా పక్కూరికి ఎల్లొత్తన్నాను. బాగా సీకటిపడిపోయింది గదా... ఏరు దాడ్డం భయమనిపించి రత్తమ్మను లేపి ఓ సాపొకటడిగి అరుగు మీద తొంగుందామనుకున్నాను. దేవుళ్లా నువ్వే ఉన్నావు. కాతంత ఏరు దాటిద్దూ! ఎల్లిపోతాను" అని గుక్క తిప్పుకో కుండా మాట్లాడింది మంగి.

మంగి నోట్లోంచి బ్రాందీ వాసన గుప్పున కొట్టింది రాముడికి. మంగి బతుకు ఊరందరికీ తెలిసిందే! రాముడు ఒక అడుగు ముందుకు వచ్చి—

"ఇంకోపాలి ఈ ఇంటి ముందుకు వచ్చేవంటే మక్కెలిరగదంతాను. పీక ల్దాకా తాగేక...ఏరు దాటడానికి బయం వొచ్చిందా? గుడిసేటి నాయాలా! ఇంకా నిలబడ్డావెందుకే!" అని చెయ్యెత్తాడు రాముడు.

దొంగకు తేలు కుట్టినట్లు మంగి జారుకుంది. ఆచారీ, మంగీ తెల్లమొహాలు వేసుకొని కాళ్ళీడ్చుకుంటూ తోట దగ్గరికి చెరుకొన్నారు.

"ముహూర్తం కుదరలేదండీ ... మరో అప్పుడు ప్రయత్నించాలి" అన్నాడు ఆచారి చతికిలపడుతూ.

"అల్లిద్దరూ పాలూ, నీళ్ళలా కలిసి పోయేరండీ ... ఇడగొట్టడం కట్టం!" అంది మంగి.

తిరిగి అంతా పార్టీలో మునిగి పోయేరు. ఎంత పార్టీలో మునిగినా ప్రెసిడెంటు మనసు మాత్రం అవకాశం కోసం ఆలోచిస్తూనే ఉంది.

* * *

మునసబుకీ, ప్రెసిడెంటుకీ నెలరోజుల నుంచీ, కంటిమీద కునుకు లేదు. కన్ను మూసినా, కన్ను తెరిచినా ఒకటే ఆలోచన. కమలమ్మ అందాన్ని గురించి ఆచారి వర్ణించిననాడే పరాయి ఆడదంటే పడి చచ్చే ప్రెసిడెంటు మనస్సులో కమలమ్మ రూపం ముద్రపడిపోయింది. ఆచారి సలహా మీద నరసింహం చేత రాయించు కొన్న ప్రోనోట్లు నరసింహాన్ని కమలమ్మ ఇంట్లోంచి తరిమేసేలా చేశాయి. నరసింహం అడ్డు కూడా తొలగిపోయింది. పిల్లవాణ్ణి స్కూల్లో చేర్పించడంతో ఆ అడ్డూ తొలగిపోయింది. రాముణ్ణి లో బర్చుకుందామనీ, వాడి ద్వారా కమలమ్మ కమతాన్ని కొల్లగొడదామనీ ఆచారి ద్వారా చేసిన ప్రయత్నం మాత్రం విఫలమయింది. అప్పటినుంచీ ప్రెసిడెంటు కమలమ్మను ఎలాగేనా లొంగదీసుకుంటే ఆస్తికీ, అందానికీ కూడా తాను అధినేతకావచ్చునని తహతహలాడుతున్నాడు ప్రెసిడెంటుకి ఏ పండు దొరికినా మున

సబుకి అందులో వాటా మామూలే గాబట్టి, మంచికేనా చెడుకేనా ప్రెసిడెంటుతో చేతులు కలపడానికి మునసబు సిద్ధమే. చెడురుమదురుగా ఎంతో కొంత ఆచారికి ప్రెసిడెంటు తడుపుతూనే ఉంటాడు కాబట్టి ప్రెసిడెంటూ, మునసబుల ఎత్తుగడలకీ ఆచారి అండదండలు ఎప్పుడూ ఉంటాయి.

చివరికి ఒక రోజున తెగించి ప్రెసిడెంటూ, మునసబూ ఒక నిర్ణయానికి వచ్చారు. ఇద్దరూ కలిసి కాకుండా విడివిడిగా రోజూ ఒక్కసారైనా కమలమ్మ ఇంటికి వెళ్ళి ఏదో పిచ్చాపాటీ మాట్లాడి రావడానికి నిర్ణయించుకున్నారు ఏదో పని కల్పించుకుని అలా వెళ్తూనే ఉన్నారు. రాముడు పొలంపనిలో మునిగి ఉంటాడు, లోగిట్లో కమలమ్మా, చుక్కమ్మా మాత్రమే ఉంటున్నారు, ఎప్పుడు మునసబూ ప్రెసిడెంటూ వెళ్ళినా! ఒకరోజున ఉదయాన్నే ప్రెసిడెంటు కమలమ్మఇంటికిచేరుకున్నాడు.మామూలు మర్యాదల ప్రకారం ముందు మండువాలోనే కూర్చోబెట్టి చుక్కమ్మ కాఫీ ఇచ్చింది. కమలమ్మ వెనక మండువా గుమ్మంలో తెరకెనుకనే నిలబడి ప్రెసిడెంటుతో మాట్లాడుతోంది. తెర అడుగు నుంచి కమలమ్మ పాదాలు మాత్రం ప్రెసిడెంటు కళ్లబడుతున్నాయి.

అతను రాజకీయాలు మాట్లాడం మొదలెట్టాడు. కమలమ్మకు ఇష్టం లేకపోయినా, ఊరుకి ప్రెసిడెంటు కదా అన్న గౌరవంతో, వినక తప్పలేదు.

"చూడండి కమలమ్మగారూ, పోయిన వాళ్లు ఎప్పుడూ అదృష్టవంతులే. చక్రవర్తిలాంటి మనిషి పోయాడని మాకూ బాధ ఉంది. కాని పోయిన వాళ్లతో అందరం పోలేంగదా! అందుకని నాదో చిన్న మనవి. నాలుగైదు నెలల్లో పంచాయితీ ఎన్నికలొస్తున్నాయి. ఏ చెట్టూ లేకపోతే ఆవదంచెట్టు మహా వృక్షమన్నట్టు నేనీ ఊరికి ప్రెసిడెంటు నయ్యాను కానీ... అన్ని విధాల అన్ని అర్హతలూ గలవారు ఆది నుంచీ తమ కుటుంబీకులే. నేను ప్రెసిడెంటు అపనిక్రితందాకా ఈ వూరి పెత్తనం ఎప్పుడూ ఈ లోగిట్లో పెద్దల చేతుల్లోనే ఉండేది. అందుకని రాబోయే పంచాయితీ ఎన్నికల్లో మీరే మా ఊరి ప్రెసిడెంటుగా నిలబడితే బావుంటుందని నా అభిప్రాయం. మీరు సరేనంటే నేను నడుం కట్టుకొని నిలబడ్తాను. మిమ్మల్ని ప్రెసిడెంటు చేసేదాకా నిద్రపోను" అని చిన్న ఎరవేసేడు ప్రెసిడెంటు.

ఎంతటి మనిషైనా పదవి అనే ఎర మాత్రం చాలా సులువుగా ఆకర్షిస్తుంది. కాని కమలమ్మ పేలవంగా నవ్వి "ఆడదాన్ని నాకెందుకండీ ఈ రాజకీయాలు? ఈ ఇంటి కోడలిగా వచ్చిన నాటినుంచి ఈ తెరదాటి నేను బైటికి రాలేదు. ఈ ఊరి రూపురేఖలు ఎలా ఉంటాయో ఎవరిల్లు ఎక్కడ ఉందో, ఎవరి సమస్యలేమిటో నాకు తెలియవు. అన్నీ తెలిసిన మీలాంటి వాళ్ళే ప్రెసిడెంటుగా ఉండడం మంచిది." అని మాత్రం అంది కమలమ్మ.

"నా మాట అంత సులువుగా కొట్టిపారెయ్యకండి. ఆడవాళ్ళు గడప దాటి

బయటకు రాకూడదని ఎక్కడుందండీ? మనది పల్లెటూరు గాబట్టి, ఈ లోగిట్లో ఘోషా అనాటినుండి వస్తున్న ఆచారం గాబట్టి, మీరింత వరకూ ఇలా ఉండి పోయారు. పట్నాల్లో ఆడా మగా భేదం ఏముంది ? మగాళ్ళతో సమానంగా ఆడ వాళ్ళు ఉద్యోగాల్చేస్తున్నారు. ఎమ్మెల్యే లవుతున్నారు. పార్లమెంటు మెంబర్లవు తున్నారు. ఆఖరికీ మంత్రులు కూడా అవుతున్నారు. అందాకా ఎందుకండీ, మీలాగే పరదా వెనకాల ఉండి ఎంతో ఘోషాను పాటించిన రాణులు కూడా ఈనాడు రాజకీయాల్లోకి దిగిపోయారు. మీరూ అంతో ఇంతో చదువుకున్నవారు మీరూ దిగడంలో తప్పేముంది చెప్పండి! నన్నడిగితే ప్రజాసేవకి లింగ భేదం లేదు. అందుకని నా మాట కొట్టెయ్యొ వద్దని కోరుతున్నాను" అని కమలమ్మను ఒప్పించడానికి ప్రెసిడెంటు తాపత్రయ పడ్డాడు.

"ఏమోనండీ, ఆయిన పోవడంతోటే నా బ్రతుక్కు అర్థంపోయింది. ఈ పద వులూ, అధికారాలూ నాకు ఇష్టంఉండవు నన్నిలాగే ఉండిపోనివ్వండి. మీరు కూడ ఆయినకి స్నేహితులూ, ఈ లోగిలి క్షేమం కోరేవారూ, మీరు ఈ ఊరికి ప్రెసిడెంటుగా ఉంటే ఆ పదవీ, అధి కారం ఈ లోగిట్లో ఉన్నట్టే భావిస్తాను. ఇంకా మీరు కావాలనుకుంటే బాబుచదువు పూర్తయిన తర్వాత వాడిని చెయ్యండి ప్రెసిడెంటుగా" అంది తన తుది నిర్ణ యంగా కమలమ్మ.

"అది వేరే చెప్పాలా? బాబు ఈ ఊరి ఓట రైన మరుక్షణం ఆయనే ప్రెసి డెంటు! వెధవది ప్రెసిడెంటేమిటండీ, ఆ సమాయానికి బాబు ఎమ్మెల్యే అవుతాడో మంత్రే అవుతాడో-ఆ సంగతి చూసుకొం దుకి మేమంతా వెనకాల ఉన్నాంగా. ప్రస్తుతానికి మీరుప్రెసిడెంటుగా నిలబడ్తే, ఏదోకాస్త మీకు కాలక్షేపం అవుతుంది. పంచాయితీ ఆఫీసుకు కొత్తకళ వస్తుంది మా అందరికీ ముఖ్యంగా నాకు చాలా ఆనందంగా ఉంటుంది" అని ప్రెసి డెంటు కమలమ్మను ఎలాగేనా ఒప్పించ డానికి తన చాకచక్యాన్ని అంతా ఉపయో గించాడు. అతని మనస్సులోని కోరిక ఏదో విధంగా కమలమ్మను గడప దాటించి, వీధిలోకి తేవాలని. ఆమెకు చేరువ అవ్వాలని అంతరంతరాల్లో ఉన్న ఆలోచన. ఆ లోగిలికి పట్టం కట్టాలని మాత్రం కాదు. కమలమ్మ మీది భక్తి విశ్వాసాలు కావు.

కమలమ్మకు ప్రెసిడెంటు మనసు అర్థమైందో లేదో గాని, తనకు ఇష్టం లేదని, రాజకీయాలు నాకక్కర్లేదనీ ఖచ్చితంగాచెప్పేసింది. లక్ష్మణరేఖలాంటి ఆ ఇంటి గడప దాటకూడదనే కమలమ్మ నిర్ణయించుకుంది.

తానువచ్చిన పన్ను గడ సాగనందుకు బాధ పడుతూ ప్రెసిడెంటు వెళ్ళిపోయాడు. బాధ పడ్డాడేగాని నిరుత్సాహ పడలేదు. ఏదో వంకన రెండు మూడు రోజుల కొకసారి కమలమ్మ ఇంటికి వెళ్తూనే ఉన్నాడు.

అలాగే మునసబూ వెళ్తున్నాడు. ఆవిడ కట్టాల్సిన పన్ను ముందుగా తానే

కట్టేసి రసీదులు పట్టుకువెళ్ళడం, ఏచేను బాగా పండిందో, ఎంతెంత పండిందో మాట్లాడ్డం లాంటి పనులు కల్పించుకొని మునసబు కమలమ్మ ఇంటికి రాకపోకలు సాగిస్తున్నాడు. అయినా ఎన్నాళ్ళకూ

కమలమ్మ వాళ్ళిద్దరి కంటా పడలేదు. వాళ్ళు అలించింది, వాళ్ళకు దక్కడం లేదు. ఆఖరికి ఒక రోజున ప్రెసిడెంటూ మునసబూ, ఆచారీ ఓ కొత్త వ్యూహం పన్నేరు. నెమ్మదిగా రాముడు సరిగ్గా వ్యవసాయం చేయించడం లేదు, ఊళ్ళో

అందరి పొలాల కంటే కమలమ్మ పొలాలు తక్కువ పండుతున్నాయి అని కమలమ్మను నమ్మించే ప్రయత్నంలో పడ్డారు. దాంతో కమలమ్మకు రాముడి మీద నమ్మకం తగ్గుతుందని ఆకారణంగా

వాడు, ఆ కమతానికి దూరం అయితే తాము కోటలో పాగా వెయ్యొచ్చనీ ఊహించారు. ఇక నుంచీ, ఆపని పెట్టుకుని మునసబూ, ప్రెసిడెంటూ కూడా ఒకళ్ళను విడచి ఒకళ్ళు కమలమ్మ ఇంటికి వెళ్ళి రాముడి అసమర్థత గురించీ, నిర్లక్ష్యం గురించీ నూరిపొయ్యడం మొదలెట్టారు.

కమలమ్మ ఒద్దనుకున్నా వినక తప్పడం లేదు. ఖచ్చితంగా మొహంమీద కొట్టినట్టు "మా వ్యవసాయం గొడవలు మీకనవసరం" అని వాళ్ళిద్దరి ముందూ

చెపప్పేకపోతూంది. వినగా వినగా వాళ్ళిద్దరూ రాముడి గురించి చెప్పేది నిజమేనా అన్నఆలోచన్లు కూడా ఆమెలో అప్పు

డప్పుడు కలుగుతున్నాయి. నిప్పుకి నెయ్యి తోడైనట్టు దేవుడు ప్రసాదం ఇవ్వడానికి వచ్చినట్టు, ఆచారి వచ్చి రాముడు రత్తి అనే పిల్ల ప్రేమలో పడ్డాడని, దాంతో వ్యవసాయం కొంచెం దెబ్బ తింటొన్నట్టుంది...అని మాటల సందర్భంలో అనేసి వెళ్తూ ఉండేవాడు.

రాముడు రత్తిని ప్రేమిస్తున్నాడు... అని ఆచారి చెప్పిన మాటలు కమలమ్మలో ఏదో అలజడిని రేపేయి. కమలమ్మ మనసు రకరకాలుగా ఆలోచించసాగింది రాముడు వయసులో ఉన్నాడు. ఏదో ఒక అమ్మాయిని ప్రేమించడంలో తప్పేముంది...అనుకునేదాక్కాక్కసారి. వాడికి ఇప్పుడు ప్రేమదేనికీ... పెళ్ళికి ప్రేమకీ

అంత తొందరొచ్చిందా ... ఏదో సంబంధంచూసి తానే చేసేదిగా వాడి పెళ్ళి అని మరోసారి--అనుకుంటూ ఉండేది.

చివరికి వాడలా ప్రేమలో పడబట్టి వ్యవసాయం సంగతి అంతగా పట్టించుకోపడంలేదేమో–అందుకే ప్రెసిడెంటు మునసబూ పదే పదే వచ్చి చెప్తున్నారు......

అనీ రాముణ్ణి కాదని తాను కాలదన్నుకుంటే తనకి ఉన్నది మాత్రం ఎవరు? ఈ మాత్రం నమ్మకంగా చేసేవాళ్ళింకెవరున్నారు? ఏది ఏమైనా కళ్ళారా చూడ

కుండ ఇంత నమ్మకంగా పని చేసే రాముణ్ణి చెప్పుడు మాటలు విని అవమానించకూడదు - అనీ అనుకుంది కమలమ్మ.



## 13

నరసింహం ఇంట్లోంచి వెళ్ళిపోవడం, ముఖ్యంగా బాబు స్కూల్లో చేరడం కమలమ్మకు కొంత మనశ్శాంతి లేకుండా చేశాయి. ఆమెను ఒంటరితనం వేటాడుతోంది. దానికితోడు ప్రెసిడెంటూ, మునసబూ, ఆచారీ ఏదో వంకని తరచూవచ్చి రాముడి మీద చాడీలు చెప్పడంవల్ల ఆమెకు మరీ అశాంతిగా ఉంది. తనకు కొండంత అండగా ఉంటున్నాడనుకొన్న రాముడు తనకు దూరం అవుతున్నాడన్న ఆలోచన ఆమె మనస్సును వేధిస్తోంది. మనస్సు నిర్మలంగా ఉన్నప్పుడు మనిషి తీసుకునే నిర్ణయాలు సమంజసంగానే ఉంటాయి. మనస్సు అశాంతిలో ఉన్నప్పుడు, గజిబిజిగావున్నప్పుడు తీసుకొనే నిర్ణయాలు అంతంత మాత్రంగానే వుంటాయి. కమలమ్మకు మనశ్శాంతి దొరకడం లేదు. ఏవో పిచ్చి పిచ్చి ఆలోచనలూ, అనుమానాలూ మనసును దొలిచేస్తున్నాయి. తెగించి, రాముణ్ణి నిలబెట్టి తనలో చెలరేగే అనుమానాలకు సమాధానాలు అడగలేక పోతూంది. చివరికి ఒకనాడు రాముడు భోజనం చేస్తూ వుండగా "ఈ రాత్రి నేను మన పొలం చూద్దామనుకుంటున్నాను. బండి సిద్ధం చెయ్యి" అని అన్నది కమలమ్మ.

"అలాగేనమ్మా" అన్నాడు రాముడు.

ఆ రోజు రాత్రి ఊరు మాటు మణిగింది. కమలమ్మ ఇంటి ముందు సవారీ బండి సిద్ధంగావుంది. ఎక్కడో దూరంగా చెదురు మదురుగా కుక్కలు మొరుగుతున్నాయి. చుక్కమ్మను వెంటబెట్టుకొని కమలమ్మ బండి ఎక్కింది. రాముడు గిత్తలను అదిలించాడు. బండి కదిలింది. చుట్టూ పుచ్చపువ్వులా వెన్నెల కాస్తుంది. రాత్రిపూట ప్రయాణం కావడంతో బండికి తెరలు కట్టలేదు. చుట్టూ వున్న వెన్నెలను కమలమ్మ కన్నులవిందుగా చూస్తోంది. తానుమాత్రం బండిలో చీకట్లో కూర్చుంది. తన చుట్టూ పాల జల్లులాంటి వెన్నెల. దిగి వెన్నెట్లో నడిస్తేనే బాగుంటుందనిపించింది కమలమ్మకి. కాని ఎవరి కంటనన్నా పడితే బాగుండదని బండిలోనే చీకట్లో కూర్చుంది.

"చుక్కమ్మా అప్పుడప్పుడు కూలీలకి ముంతలు పట్టుకెళ్తుంటావు కదా, మన పొలం ఎక్కడుందో నీకు తెలుసా ?" అనడిగింది కమలమ్మ. అలా అడగడానికి కారణం లేకపోలేదు. రాముడు పండించిన పంట ఇంటికి తేవడమే తప్ప తమ ఏభై ఎకరాల కమతం అరవైకి పెరిగిందని అనుకోవడమే తప్ప కమలమ్మ ఇంతవరకూ ఎన్నడూ గడప దాటి బయటికి రాలేదు. తన పొలం ఎక్కడుందో తనకి తెలీదు. తాను కళ్ళారా చూసి 'మన పొలంలో పంట ఎందుకు సరిగ్గాలేదు?' అని రాముణ్ణి మందలించాలని తను వెళ్తూంది. తన పొలం

ఏదో తనకే తెలియనప్పుడు రాముడు ఏ పొలం చూపిస్తే ఆ పొలమే తనదని నమ్మాలి. అందుకని చుక్కమ్మని అడిగింది చుక్కమ్మ "అయ్యో, మన పొలం నే నెరక్కపోడ మేంటమ్మా ? ఇన్నేళ్ల బట్టి మీ దగ్గర పన్జేత్తన్నాను. పొలాలకి సుంతలు పట్టికెళ్తన్నాను... మన పొలం ఎక్కడో తెలీకుండా ఎలా వుంటది? మన పొలానికి తూర్పేపున మునసబుగారి పొలం, పడమటిని పెసిడెంటు గారిది. ఉత్తరం యేపే సిన్నేరు. మొత్తం సుట్టుపక్కల పొలాల్లో మన పొలాన్ని కొట్టే పొలం లేదమ్మా. రావుడొచ్చిన కాణ్ణించీ మన పొలం మరీ బంగారమై పోయింది" అంది.

"చాల్లే. ఒక్కటడిగితే వందచెప్తావు" అని చిరాకు పడింది కమలమ్మ.

ఎందుకనో ఆమె మనస్సి మధ్య చిరాగ్గా వుంటోంది. ఎంత ప్రయత్నించినా మనఃస్థిమితం దొరకడంలేదు. బండి ఆగింది. రాముడు బండి తొట్లోంచి కిందికి వురికి గిత్తల పగ్గాలు పట్టుకొని "దిగండమ్మగోరూ–మన పొలం వచ్చేసింది" అన్నాడు.

కమలమ్మా, చుక్కమ్మా బండిలోంచి కిందికి దిగారు. ఇద్దర్నీ రాముడు మకాం దగ్గరికి తీసుకువెళ్ళాడు. ఒక పక్క మోటార్ షెడ్డు వుంది. మోటార్ పని చేస్తోంది. చిన్న జలపాతంలా పంపులోంచి పడుతున్న నీళ్ల బోదుల గుండా పొలాల్లోకి వేగంగా ప్రవహిస్తున్నాయి. చెయ్యెత్తు పెరిగిన చెరుకు తోటలు, దుబ్బుగా ఎదిగిన అరటి తోటలు, ఓ పక్క పంటకు వచ్చిన వరిచేలు మరో పక్క కూరగాయల తోటలు... వెన్నెట్లో కొట్టవచ్చినట్టు కనబడ్డాయి కమలమ్మకు. "ఆపక్క చేను ఎవరిదీ"? అనడిగింది.

"అది మునసబు గారిదండి. సమయానికి పిండివెయ్యక, మోటర్ లేక పోవడంతో తడి దొరక్క చేలు బాగా ఎదగలేదు" అని అన్నాడు రాముడు.

"ఆ పక్క చేను ఎవరిదీ:" అనడిగింది కమలమ్మ.

"అది ప్రెసిడెంటు గారిదండి. ఆయనకు వ్యవసాయం పట్టదు. ఎంతసేపూ తాగుడూ, పేకాటా, తిరుగుళ్ళతోటే సరిపోద్ది" అంది చుక్కమ్మ.

కమలమ్మ మౌనంగా ముందుకు నడిచింది. ఆరుబైట వెన్నెట్లో సింహాల్లాంటి తెల్లటి ఎద్దులు వాటి ముందున్న పచ్చగడ్డిని మేస్తున్నాయి. లేగదూడలు రాముడు రావడం చూసి అరుస్తున్నాయి. ఇంటిదగ్గర పాకలో పాడిదూడలు కొన్ని వున్నాయి. వట్టిపోయిన పాడిదూడలు, ఎడ్లూ, పోతులూ మాత్రం పొలంలో వున్నాయి. అలా తను వెన్నెట్లో తన కమతంలో నడుస్తూ వుంటే చాలాకాలం తరవాత జైల్లోంచి బైటికి వచ్చినట్టనిపించింది కమలమ్మకి. కమలమ్మ ముందు నడుస్తూ వుంటే వెనక రాముడూ చుక్కమ్మా వస్తున్నారు. ఓ పక్క మోటార్ చప్పుడు, బోదుల్లో ప్రవహించే నీళ్ళ సన్నని గలగలలూ, గాలికి కదిలే పంటచేల సహజ సంగీతం–ఏదో ఇంకో లోకంలో మసులుతున్నట్టుంది

## మినీకథ






ఆఫీసు ఇన్‌స్పెక్షన్‌వల్ల గత వారం రోజుల్నించీ రాత్రింబవళ్ళు కష్టపడి పోయాడు ఎల్.డి.సి. గుర్నాధం. నిన్న రాత్రి కొంచెం పులకరంగా అనిపించింది ఖూశా. టెంపరేచరు చూస్తే ఒకటి రెండు డిగ్రీలు జ్వరం ఉంది. తల నొప్పిగా ఉందని నుదుటికి మంచిగంధం పట్టువేసుకొని పడుకున్నాడు.

సాధారణంగా ఉదయం ఆరు గంటలకు లేచిపోయే గుర్నాధం తొమ్మిదైనా

పక్క దిగక పోయేసరికి అతని భార్య సుందరమ్మ కంగారుపడిపోయింది. గురునాధాన్ని బలవంతంగా లేపి "ఏమిటండీ, ఎలా ఉంది ఒంట్లో" అని అడిగింది ఆదుర్దాగా!

"అబ్బే, ఏం లేదు లేవే, ఊరికే కంగారుపడకు. కొంచెం ఒళ్ళు వెచ్చబడింది అంతే" అన్నాడు గుర్నాధం అలసటగా. అతడి ముఖం పీక్కుపోయి ఉంది, కళ్ళల్లో ఎర్ర జీరలు కనిపిస్తున్నాయి, మాట కూడా ధాటీగా లేదు. అతని వాలకంచూసి సుందరమ్మకి ఏమీ తోచలేదు.

"డాక్టర్ దగ్గిరకెళదాం, మొహం కడుక్కోండి, ఈలోగాపిల్లల్ని స్కూలుకి పంపేసివస్తా" అంది గబా గబా తెమిలి పోదామని.

"నువ్వూరికే హైరాణపడకు, నెమ్మదిగానే కానీ,పక్కింటివాళ్ళబ్బాయిని పిలువు ఓసారి, సెలవు చీటీ ఆఫీసులో ఇచ్చి వస్తాడు ఈ వేళ్టికి రెస్టు తీసుకుంటాలే" అన్నాడు గుర్నాధం."

ఇంతలో తలుపు చప్పుడైంది. తలుపు తీసేసరికి పెద్ద కూతురు పద్మావతి వచ్చింది నాలుగేళ్ళ చంటి వెధవని వెంటేసుకొని. "అదేమిటీ, ఉత్తరమేనా రాయకుండా దిగడ్డావు" అంది సుందరమ్మ ఆశ్చర్యపోతూ.

"అయన కేంపెళ్లారు పది రోజుల పాటు; పోనీలే ఓ సారి చూసినట్టుగా ఉంటుందని వచ్చేశాను" అంది పద్మావతి.

"ఏమ్మా, కులాసాగా ఉన్నావా" అంటూ పడగ్గదినుంచి బయటకు వచ్చాడు గుర్నాధం. "నాన్నా నువ్వింకా ఆఫీసుకు వెళ్ళలేదూ?" అంటూ పిల్లాడితో 'అడు కోరా. తాతయ్యా, తాతయ్యా అని చంపావు కదా, వెళ్ళు" అంది పద్మావతి.

నుదుట ఎండిపోయిన గంధంపట్టుతో బూచాడులా ఉన్న గుర్నాధాన్ని చూసి దగ్గిర కెళ్ళడం మానేసి ఏడుపు లంకించుకున్నాడు చంటోడు. "సర్లేరా ఊరుకో" అని మొహం కడుక్కుందామని వెళ్ళబోతూ రెండో కొడుకు ఇంకా స్కూలుకివెళ్ళే ప్రయత్నంలో లేకుండా ఆట బొమ్మలు ముందు పరచుకొని కూర్చుని కనిపించడంతో "ఏరా, స్కూలు కెళ్ళవేమిటి" అని అడిగాడు.

"సంక్రాంతి సెలవులు నాన్నా ఇవాల్టి నుంచీ" అన్నాడు కోతి బొమ్మకు కీఇచ్చి వదలిపెట్టి. అది ధన, ధనా శబ్దంచేస్తూ గంతులు వేస్తోంటే, శాంతి తగ్గిపోయిన తలనొప్పి మళ్ళీ సన్నగా ప్రారంభమయింది గుర్నాధానికి.

ఈ లోగా "ఏమండోయ్, గుర్నాధం గారు, ఇవాళ ఆఫీసుకెళ్ళలేదేమిటి? కృష్ణవేణిని పిలవండి, సాయంత్రం నాకు వేరే పనుంది" అంటూ వచ్చాడు సంగీతం మాష్టారు.

మేష్టారి కంఠం విని గుర్నాధం రెండో కూతురు కృష్ణవేణి సంగీతం పాఠానికి తయారైంది.

సరిగ్గా అప్పుడే వచ్చాడు పక్కింటి అబ్బాయి "సెలవుచీటీఇవ్వండి" అంటూ

"అక్కర్లేదులేబాబూ, నువ్వెళ్ళి ఫస్టూ సుకో" అని చెప్పి అయిదు నిముషాల్లో ఆఫీసుకు బయల్దేరాడు గుర్నాధం.

—శ్రీనివాస్

కమలమ్మకి.

ఇంతలో తాను అక్కడికి యెందు కొచ్చిందో గుర్తుకు వచ్చిందామెకు. ప్రెసిడెంటూ, మునసబూ చెప్పుడు మాటలు విని రాముడి మీద తనకు కలిగిన అనుమానాన్ని తొలగించుకోడానికి వచ్చింది. ఒకరకంగా చూస్తే — ఎంతో కొంత అనుమానం రాముడి మీద కలగబట్టే తా నక్కడికి వచ్చింది. తీరాచూస్తే వాళ్ళ చేలకంటె తన చేసే చాలా బాగుంది. పొలంలోని పశువులక్కూడా రాముడంటే ఎంతో ప్రేమ. వాడు రాగానే మోరలు ఎత్తిపెట్టుకుని ఎడ్లన్నీ వాడినే చూస్తున్నాయి. లేగదూడలు అరుస్తున్నాయి. తన పక్కని నడుస్తూనే ఆ పశువుల ముందున్న గడ్డిని పోగుచేసి వెన్నుమీద చరిచి మరీ వస్తున్నాడు రాముడు. ఎటుపక్క చూసినా, ఏపుగా ఎదిగిన తోటలూ, పంట చేలే కనిపిస్తున్నాయి. ఆ పంటచేల ఏపును చూస్తూ వుంటే, వాటి అందాలు చూస్తూ వుంటే అదంతా రాముడి శ్రమే అన్పించింది కమలమ్మకు. అటువంటి వాడిని అనుమానించినందుకు, చెప్పుడు మాటలు విని వాడి నిజాయితీని శంకించినందుకు మనసులో చాలా బాధపడింది కమలమ్మ. అమాయకమైన వాడి మొహంలోకి చూస్తే తాను వాడిని అనుమానించినందుకు నోరారా క్షమించమని కోరాలన్పించింది. పక్కని చుక్కమ్మ లేకపోతే అంతపనీ చేసి వుండేదేమో! ఇంక వుండబట్టలేక "మన చేలే చాలా బాగున్నాయిరా, రాముడూ! ఇదంతా నీ కష్టమే" అని మాత్రం అంది, నిలబడి రాముడి వేపు చూస్తూ.

ఇంతలో — చెరుకుతోట బోదెలోంచి చరచరా ఒక పాము కమలమ్మ వేపు రావడం రాముడు చూశాడు.. పాముకూ, కమలమ్మకూ మధ్య వున్న దూరం రెండు మూడు గజాలకంటేలేదు. అలాగే కదలకుండా కమలమ్మ నిలబడి వుంటే ఏమయ్యేదో ... పాము రాముడి కంట పడగానే కమలమ్మ మెప్పును విని పించుకోకుండా కమలమ్మను తన సంచిట్లోకి తీసుకొని పక్కకు లాగేశాడు. కమలమ్మ క్షణం సేపు నిశ్చేష్టురాలై పోయింది. స్థాణువులా స్తంభించి పోయింది. రక్తప్రసరణ ఆగిపోయినట్టు అన్పించిందామెకు. పుచ్చపువ్వు లాంటి వెన్నెట్లో కూడా ఆమె కళ్లు చీకట్లు కమ్మాయి. రెప్పపాటులోనే రాముడు తన చేతిలోని కర్రఎత్తి పామును కొట్టేశాడు. కర్రతో పామును ఎత్తాడు. కర్ర మీద వేళ్ళాడుతున్న ఆ పొడపైన పామును అలా చూస్తూ వుండిపోయింది కమలమ్మ.

"గండం తప్పిందమ్మగారూ!" అంది చుక్కమ్మ.

"కాదే—ఈవేళ రాముడు నా ప్రాణం కాపాడేడు" అనిమాత్రం అన్నది కమలమ్మ. ఆ మాటలో కొండంత కృతజ్ఞత ఇమిడివుంది.

చచ్చిన పామును దూరంగా పారేసి "నల్లతాచు అమ్మగారూ... ఇక పదండి ఇంటికెళ్దాం" అన్నాడు రాముడు ఏమీ జరగనట్టే.

ఒక్క క్షణం అలాగే నిలబడి వాణ్ణి చూస్తూ "అర్ధరాత్రీ అపరాత్రీ అనకుండా ఈపొలాలమ్మట తిరుగుతూ వుంటావు. ఈ పురుగూ పుట్రా మధ్య ఎలా వుంటున్నావురా? ఇకనుంచీ ఇంటి దగ్గర్నుంచి మంచం తెప్పించుకుని పడుకో. పాము మంచం ఎక్కదంటారు..." అంది కమలమ్మ.

"భలేవారే! పొలంలో మేడ కట్టుకు పడుకోమన్నారు కాదు. పామంటే మన కెంత భయమో మనం అంటే దానికీ అంతే భయమండీ. ఇక పదండి పొద్దు పోయింది" అని రాముడు కమలమ్మనూ, చుక్కమ్మనూ బండిమీద ఇంటికి తీసుకొచ్చి దింపాడు.

ఆ రాత్రి కమలమ్మకు సరిగ్గా నిద్ర పట్టలేదు. ఏదో భయం. కలత నిద్ర. పిచ్చి పిచ్చి ఆలోచనలు. వాటి మధ్య రాముని బిగికౌగిటిలో ఒక్క క్షణం తానుసలిగిపోయిన అర్థంకాని అనుభూతి. అంతా గజిబిజిగా వుంది. మనస్సంతా చిలుకుతున్న చల్లకుండలా వుంది.

* * *

లోగిలి వెనక పెరట్లో ఏపుగా పెరిగిన కొబ్బరితోట. కొబ్బరి బొండాలు గెలలు గెలలుగా, కిరీటంలోని మణుల్లా కొబ్బరి చెట్ల శిరస్సుల మీద మెరుస్తున్నాయి.

పాకలోని లేగదూడ మెడపలుపుని విదిలించుకొని కొబ్బరి తోటలో కేరింతలు కొడ్తూ పరుగెడుతోంది. ఆవింకా పొలం నుంచి రాలేదు.

కమలమ్మ కాలక్షేపంకాక పెరట్లోకి వెళ్ళింది. సాయంత్రపు చల్లగాలి గిలిగింతలు పెడుతూంది. తల ఎత్తి ఆకాశంలోకి చూసింది. అక్కడక్కడ నల్లని మబ్బులు తెల్లని మబ్బుల వెనక, చెంగు చెంగున ఎగిరే లేళ్ళ వెనక పరుగులు తీసే దుప్పుల్లా పరుగెడుతున్నాయి క్రమక్రమంగా ఆకాశాన్ని నల్లమబ్బులు ఆవరిస్తున్నాయి. తెల్లమబ్బులు నల్లమబ్బుల్ని సందిట్లోకి తీసుకొని తమతో ఐక్యం చేసుకొంటున్నాయి. ఏ గూటి నుంచో ఒక తెల్లని కొంగ ఒంటిరిగా చల్లగాలిలో షికారు బయల్దేరింది.

అది చూసిన మరో అల్లరి కొంగ దాన్ని వెంబడించింది. జంటగా ఆరెండు కొంగలూ కలిసి మబ్బుల్లో ఎగురుతున్నాయి. అలా ఆకాశంలోకి చూస్తూ నడుస్తూన్న కమలమ్మను "ఇటు రాకండమ్మగారూ ! కొబ్బరికాయలు దింపుతున్నాను!" అని చెట్టు మీంచే రాముడు హెచ్చరించాడు.

కొబ్బరి చెట్టు మొవ్వలో ఉన్న రాముడు ఏదో కొండ గుహలోని రహస్యాన్ని ఛేదిస్తోన్న వీరుడిలా కనిపించాడు కమలమ్మకు. మెడలు ఎత్తి రాముణ్ణే చూస్తూ నిలబడింది. మేఘాలు దట్టం అయ్యాయి. గాలి వేగం పెరిగింది. గాలి దుమారంలా ఉంది. గాలి తాకిడికి కొబ్బరి చెట్ల తలలు వయ్యారంగా ఊగుతున్నాయి. ఆకుల కదలిక అదో రకమైన సంగీతంలా వినిపిస్తోంది. రాముడు చరచరా చెట్టు దిగుతున్నాడు. వాడు చెట్టు దిగుతోంటే, వాడి కండరాల కదలికలను, వాడి నేర్పునీ చూస్తూ కమలమ్మ బొమ్మలా నిలబడి

పోయింది. వాడినేచూస్తూ నిలబడిపోయిన కమలమ్మ దగ్గరకి, చెట్టు ఏగిన రాముడు వచ్చాడు.

ఒక కొబ్బరి బోండాన్ని చేతిలోకి తీసుకొని కత్తితో నాజూగ్గా నరికి, చిన్న కన్నం చేసి "తాగండమ్మగారూ" అని కమలమ్మకి అందిచాడు రాముడు.

కమలమ్మ వాడి కళ్లల్లోకే చూస్తూ బోండాన్నిఎత్తి తాగుతోంది. గాలితాకిడికి కమలమ్మ కట్టినున్న చీర ఆకాశంలో ఎగురుతూన్న తెల్లమబ్బుతునకలాగాలిలో రెపరెప లాడుతూంది. ఒంటిని అంటి పెట్టుకు పోయింది చీర. పమిట ఎక్కడికో పరుగులు తీస్తోంది. కమలమ్మ వయసు వంపులు ఒంటికి అతుక్కుపోయిన చీరను చించుకు వస్తున్నట్టుగా ముందుకు ఉరకలు వేస్తున్నాయి. గుక్కతిప్పుకోకుండా కొబ్బరి బోండాన్ని ఖాళీ చేయడంతో ఊపిరాడక కమలమ్మ ఉచ్ఛ్వాస నిశ్వాసాల వేగం పెరిగింది. ఆ వేగానికి ఆమె జాకెట్టు పిట పిట లాడుతోంది.

కొబ్బరి బోండం తాగేటప్పుడు రెండు నీటి చుక్కలు ఆమె పెదవులను తప్పించుకొని ఆమె గుండెలమీదికి జాలు వారేయి. అంచుల కొనలమీద మెరిసే ముత్యాల్లా నిలిచిపోయాయి.

"కొబ్బరి బోండం కూడా తాగడం రాదేమిటమ్మగారూ...! నీళ్లు మీద పోసుకున్నారేంటి చంటి పిల్లలా!' అంటూ రాముడు ఒంపు అంచుల కొనల మీద నిలచిన ఆ నీటి ముత్యాల్ని సులివేళ్ళతో దులిపాడు.

నిద్రిస్తున్న వీణను మీటినట్టయింది కమలమ్మకు. ఆ క్షణంలో తన తనువే ఒకవీణనిపించింది ఆమెకు. ఒళ్ళంతా ఏవో మృదువయిన తీయని తరంగాలతో నిండిపోయింది. శరీరం అణువణువునా ఏదో సరికొత్త నాదం ప్రతిధ్వనిస్తోంది. ఆ నాదంలో రామనామం విలీనమై ఉంది. ఆమె పెదవులు ఆమెకు తెలియకుండానే రామనామాన్ని జపిస్తున్నాయి.

"రండమ్మగారూ, పూ ల తో ట కి వెళ్దాం" అంటూ రాముడు ఆమె చేతిని పట్టుకుని నడిపిస్తున్నాడు.

గతుకుల్లో ఆమె అడుగులు తడబడుతూంటే ఆమె వాడి భుజాన్ని ఆసరాగా తీసుకొంటోంది. రాముడు వాడి ఎడమ చేతిని ఆమె నడుం చుట్టూ చుట్టి తూలిన కమలమ్మను పడిపోకుండా పట్టుకుంటున్నాడు. కండలు తిరిగిన వాడి చెయ్యి కమలమ్మ నడుం చుట్టూ చుట్టినప్పుడు ఆమెకు ఊపిరాడనట్టు అన్పించింది. ఇద్దరూ పూలతోటకు చేరుకున్నారు. వికసించిన ఎర్రగులాబీలు కనులవిందుగా కనిపించాయి.

తాను పువ్వులను నోచుకోలేదన్న సంగతి కమలమ్మ ధ్యాసలో లేదు.

"పు వ్వె లె ం త బాగున్నాయిరా! రాముడూ!" అంది తన్మయత్వంలో.

"నేనింత కష్టపడి ఈ పువ్వులు పూయించేది మీకోసమే అమ్మగారూ" అంటూ దోసెడు పువ్వులు కోసి కమలమ్మ దగ్గరికి తెచ్చి, వాటిలో ఒక పెద్ద పువ్వుని కమలమ్మ సిగలో ముడి

చాడు. మిగిలిన పువ్వుల్ని రేకులుగా చేసి ఆమె మీదకు జల్లేడు.

'ఆ పువ్వులు వాడి చేతిలో నలిగి పోయాయి. వాటిలా నేనూ నలిగి పోతే...?' అనుకుంది కమలమ్మ.

'ఇంతలోనే జెరుకు బెరుగ్గా అంటీ అంటనట్టుండే వీడికి ఇంత ధైర్యం ఎక్కణ్ణించి వచ్చిందో!' అని కూడా అనుకుంది కమలమ్మ.

రెచ్చిపోయి వీస్తున్న ఈ గాలి ... కళ్ళముందు మెరుస్తున్న విరిసిన పూలు... మా ఇద్దరి చుట్టూ గూడు కట్టి నట్టు ఆకాశం నిండా కమ్ముకున్న నల్లని మబ్బులూ...వీడిని రెచ్చగొడుతున్నాయి కాబోలు!' అని సరిపెట్టుకొంది.

వాడినే రెప్పార్పకుండా చూస్తూ నిల బడింది.

"అలా సూడకండమ్మగారూ ... మీరలా సూస్తంటే ఎందుకో నా ఒల్లు జివ్వుమంటది" అన్నాడు రాముడు నవ్వుతూ.

"నన్నేం చెయ్యమంటావు ?" అంది కమలమ్మ.

"నాకు తెల్దండీ. ఓసారి మిమ్మల్ని గట్టిగా ఇలా దగ్గిరికి తీసేసుకుంటే..." అంటూ కమలమ్మని తన బిగికౌగిట్లోకి తీసుకుని "కాత్త ఒల్లు జివ్వు తగ్గినట్లని పిత్తది" అన్నాడు

"ఒరే...ఇలా నీ సందిట్లో నేను నలిగి పోతూ ఉంటే, నా రక్తం అంతా సల సలా మరిగిపోతుందిరా...నా ఒళ్ళు మెలి కలు తిరిగిపోతూందిరా..." అంది కమ లమ్మ.

రాముడి వెచ్చని నిట్టూర్పులు కమ లమ్మ నుదుటికి తాకి, ముంగురులు కేరింతలు కొడ్తున్నాయి. నుదుటిమీద సన్నని చెమటలు పోస్తున్నయ్. కమ లమ్మ ఉఛ్వాస నిశ్వాసలకు రాముడి గుండెల మీదున్న రోమాలు చిరుకెర టాల్లో తేలిపోయే చేపపిల్లలా కేరింతలు కొడ్తున్నాయి.

"అమ్మగారూ!" అన్నాడు రాముడు.

"ఛ ...ఇంకలా పిలవకురా. కమ లమ్మా అను. కావాలంటే కమలా అను. నన్నిలాగే నీ బిగి కౌగిట్లో నే నుగ్గు చేసెయ్యి. నేనిక నిలబడలేకపోతున్నాను" అంటూ వాగిమీద వాలి, సన్నగా జారి, నేలమీద కూర్చుని వాడికాళ్ళకు మానుని అల్లుకున్న లతలా కమలమ్మచుట్టేసుకుంది.

ఆ క్షణంలో ఇంట్లో ఉన్నచుక్కమ్మ గుర్తుకి రాలేదు. ఊరు గుర్తుకి రాలేదు. ఊళ్ళో ఉన్న జనం గుర్తుకి రాలేదు. జన ములో ఉన్న ప్రెసిడెంటూ, మునసబూ, ఆచారీ ఆమె దృష్టిలో అప్పుడు లేరు. తాను తల్లినన్న సంగతికూడా మరిచి పోయింది. అసలు తాను కమలమ్మనన్న సంగతే ఆమెకు గుర్తులేదు.

ఇప్పుడు తనూ, రాముడూ ఉన్నది వేరే లోకం. ఈ లోకంలో రాముడూ, తనూ, ప్రకృతీ తప్ప మరే మనిషీలేడు. వాళ్ళిప్పుడున్నది మనుషుల లోకంకాదు.

రాముడు "అలా నేలమీద కూర్చుంటే మీ ఒళ్ళు కందిపోతుంది. నేలమీద నడిస్తే పాదాలు గులాబీల్లా ఎరుపెక్కి పోతాయి" అంటూ గులాబీ రేకులతో పాన్పు పరిచాడు.

మినీకథ

# తాళాల





శంకరం చిన్నప్పట్నుంచీ ఒట్టివాగుడు కాయ. అస్తమానం వసపిట్టలా వాగిన

వాడు వాగినట్లే వుండేవాడు. కాలేజీదాకా ఇద్దరం కలిసే చదువుకున్నాం. ఈ వాగుడు రోగం కాలేజీలో చేరిం తర్వాత కూడా పోలేదు శంకరానికి. వీడి కొచ్చే పెళ్ళామెవరోగానీ, వీడి వాగుడు వినలేక చస్తుందనుకునే వాళ్ళందరూ. కాలేజీ చదువై పోయిం తర్వాత నేనో బ్యాంకు ఆఫీసరుగా సెలక్టయి ఢిల్లీ వెళ్ళిపోయాను. శంకరం ఎం.ఏ.లో చేరాడు. నేను ఢిల్లీ వెళ్ళిం తర్వాత మొదట్లో కొన్నాళ్ళు ఇద్దరం ఉత్తరాలు రాసుకునే వాళ్ళం. వాడి వుత్తరాలు చదువుతున్నా కూడా వాడి సోది వింటున్నట్లే అనిపించేదినాకు. తరవాత క్రమంగా ఉత్తరాలు తగ్గిపోయినై మామధ్య, ఇరవయ్యేళ్ళు గడిచినై. ఈఇరవయ్యేళ్ళలో నేను ట్రాన్స్ఫర్లమీద చాలా వూళ్ళు తిరిగాను. శంకరం హైదరాబాదులో ఏదో ప్రైవేటు కాలేజీలో తెలుగు లెక్చరరుగా పని చేస్తున్నాడని తెలిసింది. ఒకసారి పనిమీద హైదరాబాదు వచ్చినప్పుడు అనుకోకుండా శంకరం తటస్థపడ్డాడు. అతి వాగుడు విషయంలో పెద్దగా మార్పేమీ వచ్చినట్లు నాకనిపించలేదు. "సొంత యిల్లు కట్టుకున్నాను ఈ మధ్యనే, చూద్దుగాని రమ్మ"ని వాళ్ళింటికి తీసుకెళ్ళాడు. ఇల్లు చాలా బాగుంది. అమాటే వాడితో అన్నాను. ఇక 'కీ' ఇచ్చి వదిలినట్లుగా ఇల్లు కట్టేందుకు తనెంత కష్టపడ్డదీ, ఎంత ముందు జాగ్రత్తతో ఆ యిల్లు కట్టిందీ, అసలు మనిషికి సొంత యింటి అవసరం గురించి ఊదర గొట్టెయ్యడం ప్రారంభించాడు. పిల్లల్ని చూపించలేదు, భార్యని పరిచయం చెయ్యలేదు, ఒక టే సోది: ఇంట్లో ఒక్కొక్కగదే చూపిస్తూ ఏదేదో చెప్పేస్తున్నాడు. ఇల్లంతా తిరిగి మళ్ళీ డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చి కూర్చున్నాం. ఒకఅలమరలో బోలెడన్ని తాళాలు కనిపించినై. "అదేవిట్రా అన్ని తాళాలు" అని అడిగాను బుద్ధితక్కువై. తాళం, దాని ప్రాముఖ్యం, మనిషికి కావల్సిన భద్రత, సంఘంలో దొంగలు, తాళం ఉపయోగం, మొదలైన విషయాలమీద లెక్చరు దంచసాగాడు. అందులోనే శృంగారం, వేదాంతం అన్నీ కలిపి మరీ మహోద్రేకంతో ఉపన్యాసం పూర్తి చేశాడు.

నేనేమీ చెయ్యలేక నిస్సహాయంగా కూర్చున్నాను. ఓ క్షణం అలుపు తీర్చుకుని, ఒక్కొక్కటే చూపిస్తూ, ఏ తాళం దేనికో చెప్పసాగాడు. "ఇది మెయిన్ గేటుకి, ఇది లోపలి గేటుకి, ఇది దక్షిణపు వాకిలికి, ఇది వంట గదికి, ఇది వెనక గదికి, ఇది మెట్ల గదికి, ఈతాళం పచ్చళ్ళ అలమరకి... ఈతాళం..." ధారాపాతంగా చెప్తున్న వాడల్లా స్విచాఫ్ చేసినట్లు ఠక్కున ఆగిపోయాడు ఈ హఠాత్పరిణామానికి ఆశ్చర్యమేసి, ఏమయిందబ్బా అని ఆలోచించే లోపల్నే, శంకరం శ్రీమతి గాబోలు, కాఫీకప్పుల్తో గదిలోకి వచ్చి, కప్పులు టీపాయ్ మీద పెట్టి రివ్వున వెళ్ళిపోయింది సీరియస్‌గా. శంకరం మళ్ళీ నోరు తెరవలేదు. నాకు అర్థమయిపోయింది. ఆవిడ వీడి నోటికి తాళం అయివుంటుంది అనుకున్నాను సంతృప్తిగా.

—కథక్

ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకుని పాన్పు దగ్గరికి తీసుకు వెళ్ళాడు. పాన్పు మీద రాముడు నడుం వాల్చాడు. వాడి గుండెలమీద కమలమ్మ వాలిపోయింది. పాపి కొండలను చుట్టుకొంటూ పరుగులు తీసే వరద గోదావరిలా రాముడి శరీరాన్ని ఆమె చుట్టేస్తోంది. వాడి శరీరం చుట్టూ ఆమె ఒళ్ళంతా పరుగులు తీస్తోంది.

'ఈ పూల పాన్పు నేలమీద కాకుండా గాలిలోకి తేలిపోతే ఎలా ఉంటుందో... రాముడు పడిపోతాడేమో నని నేనూ, నేను పడిపోతానేమోనని రాముడూ ఒకళ్ళలోకి ఒకళ్ళు దొచ్చుకుపోయి, ఇద్దరం ఒకటే...జనం ఎవ్వరూ లేని చోట ...నేల మీదికి రాలిపోతే...' ఏవో ఎడతెరిపి లేని ఊహాలు... ఆమె మనసు నిండా అలుముకున్నాయి.

నిజ జీవితంలో చవి చూడలేని నిజాలను ఊహల్లో సునాయాసంగా పొందగల్గుతాడు మనిషి. అది మనిషికి మనసిచ్చిన వరం. ఆ వర ప్రసాదంగా ఊహాల్లోనే కమలమ్మ వెంట రాముడు ఆ పూలపాన్పుతో సహా నింగిలోని మబ్బుల్లోకి వెళ్ళిపోయాడు.

అక్కడ మబ్బుల మాటున రాముడు పెద్ద మబ్బులా, పెనుగాలిలా ఆమెను ఉక్కిరి బిక్కిరి చేశాడు. పాన్పు మీది పూ రేకులు నలిగి విల విలలాడాయి. కమలమ్మ శరీరం నలుగుతున్నా, అందులోనే ఏదో అనిర్వచనీయమైన అనుభూతిని పొందుతోంది.

ఇద్దరూ నేల కూలిపోయారు. కమలమ్మ మంచం మీంచి తుళ్ళిపడి లేచి చుట్టూ చూసుకొంది. విశాలమైన మంచం మీద— ఒంటరిగా తనొక్కర్తే ...! మోడువారిన కొమ్మలా పడుంది!! అంతా కల!

'ఈ కల నిజమే అయితే...!?' అనుకుంది కమలమ్మ మనస్సు.

ఓ గ్లాసుడు మంచినీళ్ళు తాగి పక్కమీద నడుం వాల్చింది కమలమ్మ.

కళ్ళు మూసుకుంది గాని, మనసింకా కళ్ళు తెరిచి కలను చూస్తూనే ఉంది ... కల నిజం కావాలని కోరుకుంటూనే ఉంది.



# 14

కమలమ్మ మనసు నిండా ఏవేవో ఆలోచనలు. అర్థం లేని అలజడి. మున సబూ, ప్రెసిడెంటూ, ఆచారీ కుమ్మరి పురుగుల్లా ఆమె మనస్సును ఏదో వంకని రోజూ వచ్చి తొలుస్తూనే ఉన్నారు. ముఖం చెండుకుందుకు సభ్యతా, సంస్కారం అడ్డు వస్తున్నాయి. ఒంటరితనం మూలంగా మనసంతా ఏదో వ్యాకులతతో నిండిపోతుండి. మనస్సును ఎలా కుదుట పర్చుకోవాలో, కుదుట పర్చుకుందుకు ఏం చేయాలో ఆమెకు అర్థం కావటంలేదు. ఒక రోజున ...

మధ్యాహ్నం పూట ఏమీ తోచక ఏదేనా పుస్తకం చదవాలన్పించింది. అనుకోకుండా అన్నగారి గదిలోకి వెళ్ళిన కమలమ్మకు నాలుగు చవకబారు సెక్సు పుస్తకాలు కనిపించాయి. ... ఊళ్ళో కిళ్లీకొట్టు రమణయ్య తన కొట్లో పుస్తకాలు పెట్టాడు. జనం అందరికీ పనికొచ్చే చవకబారు నవలలు, సెక్సు పుస్తకాలు వాడి దగ్గర దొరుకుతాయి. పుస్తకానికి రోజుకు పదిపైసలు అద్దె కట్టి జనం పుస్తకాలు పట్టుకెళ్తూ ఉంటారు. కుర్రకారుకి బాగానచ్చుతాయి. ఆచారి కూడా రమణయ్య దగ్గర పుస్తకాలు పట్టుకువెళ్ళి రాత్రిపూట చదువుకుని దిండుకింద దాచుకుంటూ ఉంటాడు. ప్రెసిడెంటు గారింట్లో మందు పార్టీ అయిన రోజున ఆచారి అటువంటి పుస్తకాలు రమణయ్య కొట్లోంచి ఒకటో రెండో ఇంటికి పట్టుకెళ్ళి చదవకుండా పడుకోడు. ఒకసారి ఆ పుస్తకాలను ఆచారి చేతిలో ఉండగా మునసబు చూసి "ఏటయ్యా, ఆచార్లూ! భారతంవో, భాగవతంవో చదువుకోవాలిగాని ఈ బొమ్మల పుస్తకాలు అట్టుకెడతావేటీ? ఈ నవల్సుపుత్తకాల్లో యావుంటదీ?" అన్నాడు.

ఆచారి "నీకు తెలీదులేవయ్యా. భారత భాగవతాలు మనూళ్ళో హరిదాసు హరికథ చెప్పినప్పుడు వింటూనే ఉంటాం. ఈ పుస్తకాల్లో సొర్గం ఉంది. సొర్గాన్ని కళ్ళారా చూడొచ్చు. మనసారా అనుభవించవచ్చు. ఈ పుస్తకాలు చదివితే అరవై యేళ్ళ వాణ్ణి దేవతలకు మల్లే మళ్ళ యెవ్వన్ని అయి పోతాను" అన్నాడు నవ్వుడూ.

"దీంతస్సాదియ్యా! అంత రంజుగా ఉంటాయన్నమాట!" అన్నాడు మునసబు.

అలా ఆచారి చదివి, ఆనందించే పుస్తకాలుగల కొట్టు రమణయ్యది. ఆ కొట్లోంచి, పనీ పాటాలేని నరసింహం కూడా ఏవో అలాంటి పుస్తకాలే తెచ్చుకుని రాత్రిళ్ళు కాలక్షేపం చేసేవాడు. నరసింహం వెళ్ళిపోయినా గదిలో మిగిలిపోయిన ఆ పుస్తకాలు కమలమ్మ కళ్ళబడ్డాయి. కమలమ్మ పడగ్గదిలో మంచం మీద పడుకొని వాటిని తాపీగా చదవడం మొదలుపెట్టింది.

పుస్తకం ప్రారంభించిన తరవాత, అయిదారు పేజీలు చదివేసరికే కమలమ్మ వేడిగా నిట్టూర్చి మంచంమీద బోర్లా పడింది. పుస్తకం లోతులకి పోతోంది కమలమ్మ. ఒళ్ళంతా ఏదో జిగ్గున లాగుతున్నట్లనిపించింది. ఏవేవో అర్థంకాని వాంఛలు తన నరనరాల్లోనూ భగభగమండుతున్నాయి. కళ్ళు ఎరుపెక్కాయి. ఒళ్లు విరుచుకుంది. మొత్తానికి పుస్తకం పూర్తి చేసింది ... ఆ రోజే నాలుగు పుస్తకాలూ, అన్నం సంగతి కూడా మర్చిపోయి చదివేసింది. నాలుగు పుస్తకాలు పూర్తయ్యేసరికి పన్నెండుగంటలు అయింది.

ఒళ్ళంతా వేడి ఎక్కిపోయింది. తన మనసు తను చెప్పినట్టు వింటంలేదు. కావాలనుకున్నా నిద్ర రావటం లేదు. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. చుక్కమ్మ

ఎక్కడో లోపల వంటగదిలో పడు కుంది. కమలమ్మ లేచి ముందు మండు వాలో చాపమీద పడుకున్న రాముడి దగ్గరికి వచ్చింది. వాడు గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. మండువాలో వేళ్ళాడుతున్న దీపం వెలుగులో రాముణ్ణి చూసింది కమలమ్మ.

రేగిన ఉంగరాల జుత్తు, కండలు మెలితిరిగిన జబ్బలు, విశాలమైన ఛాతీ గుండెలమీద నూనూగుగా ఎదిగిన వెంట్రుకలు. సన్నని నడుమూ, మోకాళ్ళ వరకూ ఉన్న పంచె, బలమైన పిక్కలు, ఒక్క క్షణం అలా చూస్తూ నిలబడింది. వాడి పక్కనే కూర్చుని వాడి చేతిని తన చేతిలోకి తీసుకొని, తన గుండెలకి ఒత్తుకుంటే బాగుండునని పించింది. వాణ్ణి లేపి కాస్సేపు మాటాడితేనో ... అనుకుంది. కాని ఏం మాట్లాడాలో పాలుపోలేదు. గుండెల్లో చెలరేగుతున్న వాంఛలు, పిచ్చిగుర్రాల్లా కదం తొక్కుతున్నాయి. వాటికి కళ్ళేలు లేవు. నెమ్మదిగా "ఓరేయ్...రాముడూ" అంది. వాడికి నిద్రలో వినబడలేదు. మరోసారి పిలవాలనుకుంది. గొంతు పొడారిపోయింది. వాడు లేవడం లేదని కోపం వచ్చింది. జుత్తు పట్టుకుని లేపి కూర్చోబెట్టాలనిపించింది. బలంగా వాడి జబ్బను పట్టుకుని బరబరా తన గదికి లాక్కుపోయి, తలుపులు మూసేసుకోవా లన్నంత పిచ్చి ఆలోచన వచ్చిందామెకి. ఈసారి కాస్త గట్టిగా "రాముడూ" అని పిలిచింది. పగలంతా గొడ్డులాగ పనిచేసి అలసిపోయిన వాడికి ఒళ్ళు తెలీకుండా నిద్రపట్టింది. వాడు మరికాస్త గుర్రు హెచ్చించాడు. ఈ అలికిడికి చుక్కమ్మ లేచివచ్చి "ఏం కావాలమ్మాగారూ?" అంది. కమలమ్మ ఏదో తప్పు చేసిన దానిలా కంగారుపడి పోయింది. "మంచినీళ్ళ..." అని తన గదిలోకి వెళ్ళిపోయింది.

చుక్కమ్మ చెంబుతో నీళ్ళు తెచ్చి ఇనప్పెట్టెమీద పెడితే, అంతక్రితమే ఇనప్పెట్టెమీద నిండుగా ఉన్న నీళ్ళు చూసి "నీళ్ళున్నాయికదమ్మగారూ?" అంది.

"ఉన్నాయా! ఉన్నాయిలే...వాటిలో ఏదో నలక పడితేనూ ..." అని గొణిగింది.

ఆ రాత్రి ఒక పెద్ద గండంగానే గడిచింది. తెల్లవారింతర్వాత కమలమ్మకి చుక్కమ్మను చూడాలంటే సిగ్గేసినట్లని పించింది ... మధ్యాహ్నపు వేళ అయ్యే సరికి ఇంతక్రితం చదివిన పుస్తకాలె మళ్ళీ చదవడం మొదలుపెట్టింది. ఆ పుస్తకాలు చదువుతుంటే ఏదో తియ్యని హాయి ...దొరుకుతుందామెకు. ఆ హాయిలో కూడా ఏదో తీరని వాంఛ తన శరీరాన్ని మెలికలు తిప్పేస్తోంది. అలా రోజులు గడుస్తున్నాయి. ఆ పుస్తకాలు చదవడం మొదలుపెట్టిన తరవాత ఇదివరకటి పిచ్చి పిచ్చి ఆలోచనలు, ఒంటరితనం, ఆమె మనసు చాయలకు రావడంలేదు. అలా అన్నేప్పి, మనసుకు ప్రశాంతీ లేదు. మనస్సు నిండా ఒకటే ఆలోచన. ఏవేవో వెచ్చని కోర్కెలు. గుండెల్ని మెలిపెట్టే వాంఛ, తనకు

తెలీకుండానే రాముడు మీద ఏవేవో కోర్కెలు పెంచేసుకుంటోంది కమలమ్మ. వాడినే తన మనస్సు కోరుకోడంలో కూడా స్వార్థం ఉంది. వాడిని తను ఏం చేసినా, ఎలా ఉపయోగించుకున్నా గుట్టుగా ఉంటుంది. ఇంటిపరువు బజార్న పడదు. వాడూ గుట్టయిన మనిషి. వాడికి తనంటే భక్తీ గౌరవం ఉన్నాయి. నోరు తెరిచి చిన్న వరం అడిగితే కాదనడని ఆశ. మరుక్షణంలోనే ఛ...నేనింత దిగజారిపోతున్నానేమిటి? తీరావాడిని నోరు తెరిచి అడిగేక — కాదంటే ... తానేమైపోవాలి? తీరా—ఒకవేళ వాడు సరేనంటే — తను వాడి వశం అయిన తరవాత, మర్నాడు వాడికి తను మొహం ఎలా చూపించాలి? — ఇలా అర్థం కాని సంఘర్షణతో తుఫానుకు ఊగిపోయే అరణ్యంలా కమలమ్మ మనస్సు అల్లకల్లోలంగా ఉంది.

ఒకరోజు — ఆమె విజ్ఞతను వాంఛ ఓడించేసింది. ఒక నిర్ణయానికి వచ్చేసింది ఆమె. ఆ రోజున రాముడికి తనే స్వయంగ భోజనం వడ్డిస్తూ "ఏరా, ఎవరో పిల్లను ప్రేమించావుట, ఇంకా పెళ్ళి చేసుకోవా" అంది నవ్వుతూ.

"పేమా లేదు గీవాఁ లేదండీ. నాకు ఏలిడ్చిన మేనమామ కూతురది. పెళ్ళాడమని ఎంట పడ్తంది. ఈ ఊళ్ళో లేదులెండి. నిరుడెప్పుడో మా ముసిల్దానికి జబ్బు చేస్తే వచ్చి ఎళ్ళింది, ఆ తరాత ఆ గొడవే మర్సిపోయాను" అన్నాడు.

"అయితే ముసలాడివయ్యేక పెళ్ళి చేసుకుంటావా" అంది కమలమ్మ వాణ్ణి రెచ్చగొడుతూ.

"పెళ్ళి గొడవెత్తకండీ. నాకు సిగ్గేస్తంది" అన్నాడు రాముడు తల వొంచుకుని.

కమలమ్మ పకపకా నవ్వేసి "పెళ్ళి మాట ఎత్తితేనే అంత సిగ్గు ముంచుకొచ్చిందంటే — నీకు త్వరగా పెళ్ళాం రావాలనేరా దానర్థం!" అంటూ చిలిపిగా పురిసెడు నీళ్ళు తీసి వాడిమీద జల్లింది.

రాముడు భోజనం చేసి "పొలం వెళ్తానమ్మగోరూ!" అని చెప్పి బయలుదేరాడు.

"రాత్రి త్వరగా రా యింటికి. మాట్లాడే పని ఉంది" అని ఆదేశించింది, వాడివేపు కొంటెగా చూస్తూ కమలమ్మ. వాడికి ఆమె చల్లిన నీళ్ళలోని అంతరార్థం కాని, ఆమె చూపులోని భావన కాని అర్థం కాలేదు. వాడి దృష్టిలో ఆమె దేవత. అన్నం పెట్టే తల్లి.

"సరేలెండి" అని రాముడు నిష్కల్మషమైన మనస్సుతో రోజూలాగే పొలం వెళ్ళిపోయాడు. సాయంత్రపువేళ చుక్కమ్మను పిలిచి పిండివంటలు టిఫిన్ కారియర్ యిచ్చి "రాత్రికి పట్నం వెళ్ళి బాబుకిచ్చి రమ్మంది" కమలమ్మ. చుక్కమ్మ పట్నం వెళితే తెల్లవారితేగాని గాని రాలేందని కమలమ్మకి తెలుసు. చుక్కమ్మ పట్నానికి బయలుదేరింది. చీకటి పడింది. కమలమ్మకు క్షణం ఒక యుగంగా గడుస్తోంది ... పడకగదిలో పడుకుని పుస్తకం తెరిచింది. ఒకటి రెండు, మూడు పుస్తకాలైపోయాయి.

పదిగంటలు కావొస్తుంది. రాముడు వచ్చాడు. చకోరానికి చంద్రుడు కంట పడినంత ఆనందం అయింది కమలమ్మకు.

తనే స్వయంగా వాడికి భోజనం వడ్డించింది. బాబుకోసం తయారు చేసిన పిండివంటలు వడ్డించింది. మీగడ పెరుగుతో కొసరి కొసరి తినిపించింది. వాడి చేత. వాడికి వడ్డిస్తున్నంతసేపూ వాడినే చూస్తున్న కమలమ్మకు మనసు నిండా ఏదో తియ్యని వాంఛ. కొద్ది సేపట్లో 'ఇంత కాలం తన శరీరం ఏ సుఖం కోసం అయితే ఆరాట పడిపోతోందో అది తప్పకుండా దక్కుతుందనే ఆశ, ఆనందం'. రాముడు భోంచేసి ముందు మండువాలోకి వెళ్ళి చాప పరుచుకుని పడుకున్నాడు. కమలమ్మ వాడి వెనకే వెళ్ళింది. "అక్కడ పడుకుంటావేమిట్రా ఇటు పడగ్గదిలోకి రా !" అని పిలవాలనుకుంది. కాని నోరు రాలేదు. తన గదిలోకి వెళ్ళిపోయింది. మంచంమీద నడుం వాల్చింది. ఒక్కసారి వొళ్ళు విరుచుకుంది. దిండును తీసుకుని గట్టిగా కౌగలించుకుంది. తానేం చేస్తోందో తెలీకుండానే కాళ్ళతో పరుపును బాదింది. లేచి కూర్చుంది. గదిలోంచే గట్టిగా రాముడికి వినబడేలా "రాముడూ" అని పిలవాలనుకుంది. తీరా వాడొచ్చి 'ఎందుకు' అనడిగితే ఏం చెప్పాలో అర్థం కాలేదు. లేచి ఇటూ అటూ పచార్లు చేసింది. ఏదో ఆలోచన వచ్చింది ... 'రాముడూ, రాముడూ'- అంటూ కంగారుగా పిలిచింది. రాముడు ఉలిక్కిపడి లేచి దేవుళ్ళా గదిలో ప్రత్యక్షం అయ్యాడు. "ఏంటమ్మగారూ ;" అన్నాడు కంగారుగా.

"ఆ. ఏం లేదు ... ఏదో చప్పుడయిందిరా... ఏదో బుస కొడ్తున్నట్లనిపించింది. భయంవేసి పిలిచాను. ఒక్కసారి గదంతా చూడు" అంది మంచం మీద కూర్చునే.

రాముడు ఇనప్పెట్టె వెనకాలా, బీరువా పక్కనా గది నాలుగు మూలలా, గదిలో ఉన్న పందిరిమంచం కిందా దీపం పెట్టి వెతికాడు. "ఏం లేవండమ్మగారూ. ఉత్తినే కంగారు పడ్డారు..." అంటూ బైటికి పోబోయాడు.

"ఒరేయ్ ... మాట ! నాకు భయంగా వుందిరా...ఇక్కడే వుండు" అంది కమలమ్మ.

"నేనిక్కడే వుంటాను. ఆ చాప తెచ్చుకుని గది గుమ్మం ముందేసుకొని తొంగుంటానండి" అని ఒకడుగు ముందుకు వేశాడు.

"ఒద్దురా. ఈ గదిలోనే వుండు. నా కళ్ళముందు నువ్వు లేకపోతే నా ప్రాణం పోయేలా వుంది. గుండె దడ దడలాడుతోంది. ఒళ్ళంతా ఏదోలా వుంది" అంది కంగారుగా కమలమ్మ.

"సరే ఇక్కడే కూకుంటానండి" అని గదిలోనే నేలమీద చతికిల పడ్డాడు రాముడు.

"అలా కాదురా ...ఇటు రా...యీ మంచంమీద నా పక్కనే కూర్చో... ఎందుకో నాకు భయంగా వుందిరా. ఒకసారి నన్ను గట్టిగా కౌగిలించుకో. రారా

నీకు దండంపెడ్తాను" అంది కమలమ్మ.

"అదేటండీ ? సంటిపిల్లలా యిద్దై పోతారూ ? మీ కాళ్ళదగ్గర కూకుంటాగా..." అని ఆమె కాళ్ళ దగ్గరికి జరిగాడు. కమలమ్మ వాడి చెయ్యి తన చేతుల్లోకి తీసుకొని గట్టిగా నొక్కింది. ఏదో ఫిట్టు వచ్చినదానిలా వూగిపోతూ పిచ్చి ఆవేశంతో వాడి మెడచుట్టూ చేతులు పెనవేసి, వాడిమీద వాలిపోయింది.

"ఉండండమ్మగారూ, ఉండండి.!" అంటూ రాముడు ఆమె పట్టునుంచి వదిలించుకొని "మీ మీద ఏదో దెయ్యం వాలినట్టుంది. పొద్దున్నే రచ్చరేకు తెత్తానుండండి. అందాక ఆ దేవుడి పటం పక్కలో పెట్టుకు తొంగోండి" అంటూ గోడకున్న దేవుడి పటాన్ని ఆవిడ పక్కలో పెట్టి బైటికి వచ్చాడు. తలుపు గొళ్ళెం పెట్టాడు. కమలమ్మ జుత్తు పీకేసుకొని "ఛీ తుమ్మమొద్దు. ఏమీ తెలీదు. వాడికి ఎలా చెప్పాలో నాకు తెలీదు. ఆ వెధవ పాము పొలంలో కన్పించింది గాని, ఈ పక్కలోకే వస్తే హాయిగా వాడి సందిట్లో నలిగిపోయేదాన్ని" అనుకొంది, కష్టంమీద నిద్రపోవడానికి ప్రయత్నిస్తూ.

* * *

ప్రెసిడెంటు వెంకటయ్య ఒంటరిగా తన మామిడి తోటలోని పాక ముందు వెన్నెట్లో కూర్చున్నాడు. మంగి వచ్చి— "చాలా రోజులకి దయ కలిగింది నా మీద... మీ పాలేరొచ్చి 'సందలడ్డాక మకాం దగ్గరికి ప్రెసిడెంటు గారు రమ్మన్నారు నిన్ను...' అని సెప్పిన కాణ్ణించీ ఎప్పుడు సందలడద్దా అని ప్రాణం కొట్టుమిట్టాడిపోయింది" అంటూ వెన్నెట్లో ప్రెసిడెంటు ముందు నిలబడింది వయాలీ రాలు ఒలకబోస్తూ.

ప్రెసిడెంటు నవ్వుకుని "ఆ యేళ తోట సంతర్పణ నాడు నిన్ను చూసిన కాణ్ణించీ ఎందుకో నీమీద బెమ ఆలింది. ఈ యేల్టికి యీలు సిక్కింది. అందుకని కపురంపేను" అన్నాడు.

"పోన్లెండి... ఇప్పటికయినా గేపకం వొచ్చాను" అంటూ మంగి ప్రెసిడెంటుకి దగరగా వెళ్ళి అతని చొక్కా గుండీలతో ఆడుకోవడం మొదలెట్టింది.

మంగి వయస్సిప్పుడు ముప్పయ్ అయిదు సంవత్సరాలు ఉంటుంది. పెళ్ళయిన కొత్తలో మొగుడితో రెండేళ్లపాటు నిష్టగానే కాపరం చేసింది. ఎక్కడుండ వలసిన పుష్టి అక్కడ కలిగి ఎప్పుడూ నవ్వు మొహంతో గుమ్మడి పువ్వులా ఉండేది మంగి ఆ రోజుల్లో. మంగికి అత్తగారు కూడా ఉండేది. ఊరందరి బట్టలూ ఉతికినా, మంగీ, దాని అత్తా, మంగి మొగుడూ—చాలీచాలని తిండితోటే ఉండేవారు. ఎంత రెక్కలు ముక్కలు చేసుకొని చాకిరీ చేసినా మంగి మొగుణ్ణి ఊళ్ళో రైతులు కొందరు ఏదో వంకని చెయ్యి చేసుకుంటూ ఉండేవారు.

అటువంటి రోజుల్లో అందమైన కోడల్ని మంగి అత్తగారు ప్రెసిడెంటు కోరిక మీద తీసుకువెళ్ళి అప్పచెప్పింది. అప్పట్లో మంగికి ఇష్టం లేకపోయినా అనుభవిస్తూన్న పేదరికంవల్ల కాదని

ఎదిరించలేకపోయింది. అలా ప్రెసిడెంటుకి చిక్కింది మంగి. ప్రెసిడెంటు చాలా కాలం అనుభవించాడు. మంగి మొగుడికంటే, వయసులోఉన్న మంగిని ఎక్కువగా అనుభవించింది ప్రెసిడెంటే. ఏదో వంకని మంగి ప్రెసిడెంటుతో కలిసి పట్నానికి పోతూ ఉండేది. పట్నం లోని సినిమాలు, ఫేషన్లు మంగి చాలా జీర్ణం చేసుకుంది. చాలా మారింది.

తనని చూసిన మగవాడికి గిలిగింతలు పెట్టేలా ముస్తాబవడం నేర్చుకుంది మంగి. అది కూడా ప్రెసిడెంటుకి మంచిదే అయింది. కాస్త ఆడదాని బలహీనత ఉన్న ఆఫీసర్లకీ, పెద్దమనుషులికీ ప్రెసిడెంటు ద్వారా మంగి ఒక విలాసవస్తువు అయింది. మంగి ప్రెసిడెంటుకి 'అవసరం మనిషి'గా స్థిరపడిపోయింది. అతనికి చాలా రాచకార్యాలు చక్కపెట్టింది.

దాంతో మంగి అవసరాలూ పెరిగాయి. నాజూకయిన బట్టా, పౌడర్లూ, స్నోలూ, కొత్తకొత్త ఫేషన్లు మంగికి కావలసి వచ్చాయి. అటువంటి పరిస్థితుల్లోనే ప్రెసిడెంటు ద్వారా మునసబుకీ పరిచయమయింది. అక్కడి తోటి అది ఆగిపోకుండా ఊళ్ళోని కుర్రకారుకి కూడా అప్పుడప్పుడు ముచ్చట తీరుస్తూ ఉండేది.

మంగి సంగతి ఊరందరికీ తెలిసిపోయింది. దాన్ని కట్టుకున్నవాడు కాస్త మేధకుడు. అలా అని బొత్తిగా పౌరుషం లేనివాడూ కాదు. కాని ఊళ్ళో పెద్దవాళ్ల ప్రాపకం గల మంగిని ఏమీ అనలేక పోయేవాడు. ఒకసారి మంగి మీద చెయ్యి చేసుకున్నాడు.

మర్నాటి సాయంత్రం వాణ్ణి తన మకాం దగ్గరికి పిలిపించి ప్రెసిడెంటు వాణ్ణి చావబాదాడు. ఆ తరవాత మంగి సంగతి వాడు పట్టించుకోవడం మానేశాడు. వాడు మానసికంగా అనుభవించిన సంఘర్షణ చరిత్రలో పదిలపరచవలసినంత గొప్పది కాదు. కావ్యాలుగా రూపొందించవలసినంత కమ్మని కథ కాదు, అది ఒక సామాన్యుడి గుండె కోత. కుళ్ళికుళ్ళి తనలోనే ఏడవాలిగాని, పెదవి విప్పి బైటకు అనలేని వ్యథ! అందుకే మంగికి చాలా దూరంగా పోవాలనుకున్నాడు.

అదే సమయానికి మంగికి ఒక కొడుకు పుట్టాడు. మంగి అంటే వాడికి అసహ్యమే అయినా, పుట్టినవాడు తన బిడ్డ అవునో కాదో తెలియకపోయినా, బిడ్డ మీద మమకారం వాడిని కదలనివ్వలేదు. జరిగింది మర్చిపోయి, మంగిని మంచిదార్లో పెట్టుకుని, తలవొగ్గి రోజులు చింపుకోందామనుకున్నాడు. కొద్ది రోజులకే వాడి తల్లి కూడా పోయింది. మంగికి పట్టపగ్గాలు లేకపోయాయి. వాడి ఇంటినే ఒక బజారు చేసింది. తన ఇంట్లోకి తాను అడుగుపెట్టవచ్చునో లేదో, అడిగి, అడుగుపెట్టాల్సిన పరిస్థితులు ఏర్పడ్డాయి మంగి మొగుడికి.

వాడి గుండెల నిండా పగ ఉన్నా, ఎవరిమీదా చూపించలేడు. వాడి పేదరికం చూపించనివ్వదు. అటువంటి పరిస్థితిలో ఏడాది కొడుకుని భుజాన వేసుకుని ఒక రాత్రికి రాత్రి ఊరు వదిలి వెళ్ళిపోయాడు

వాడు. ఆనాటి నుంచీ మంగికి అడ్డూ అదుపూ లేదు. గట్టు తెగిన ఏరులా మంగి విచ్చలవిడి విన్యాసం చేస్తోంది. కొన్నాళ్ళకు 'మంగి' అంటే ప్రెసి డెంటుకీ, మునసబుకీ కూడా మొహం మొత్తింది. మంగి బాగా నలిగింది. ఎంత ముస్తాబు చేసుకున్నా, నలిగిన పువ్వు లాగే కనబడుతోందిగాని, అప్పుడు విరి సిన పువ్వులా అగుపించటం లేదు. ఊళ్ళోని కుర్రకారుకి కూడా 'మంగితో సరసం అంటే గతి లేని సరసంలా' హేళన అయిపోయింది.

అటువంటి పరిస్థితుల్లో మంగికి ఆచారి అండ దొరికింది. 'గంతకు తగ్గ బొంత' అని మనసుకు నచ్చచెప్పుకుంది. పాత పరిచయాన్ని పురస్కరించుకొని ప్రెసిడెంటునీ, మునసబునీ, ఇతర పరిచ యస్థులనీ రెచ్చగొట్టడానికి ప్రయత్ని స్తుంది గాని ఎవరూ 'సై' అని ముందుకు రారు.

అలాంటిది...పది పన్నెండేళ్ళ తర వాత...ప్రెసిడెంటు కబురు రావడంతో-మంగికి ప్రాణం లేచివచ్చినట్టయింది. ఆయన దగ్గర్నుంచి కబురు రావడమే చాలనుకుని, తనకు చేతనైనంత ముస్తాబై వెన్నెల్లో...ప్రెసిడెంటు ముందుకు వచ్చి నిలబడింది.

మంగి ప్రెసిడెంటుని కవ్వించడానికి బదులు ప్రెసిడెంటే మంగిని కవ్వించ సాగాడు ఆవేళ. మాటలతోటీ, నవ్వుల తోటీ, సరదాల తోటీ, సరసాల తోటీ-రాత్రి పన్నెండు గంటల దాకా గడిచి పోయింది. బైట వాతావరణం చల్లగా ఉంది. మంగి, ప్రెసిడెంటూ కూడా చల్లబడ్డారు.

ప్రెసిడెంటు మనసులోని ఆలోచన మాత్రం చల్లబడలేదు.

"మంగి...నువ్వు నాకో సిన్నపని సేసిపెట్టాలే!" అన్నాడు ప్రెసిడెంటు తన ఎత్తుగడకు నాందిగా.

"ఏంటో సెప్పండి! ఇందుకోసమే కబురంపేరని నేనూ అనుకోలేదు. ఏదో పన్లేక పోతే నేనెందుకు గుర్తొస్తా ననలూ!" అంది మంగి ఎత్తిపొడుపుగా.

మరో సమయంలో అయితే మంగి అలా మాట్లాడినపుడు ప్రెసిడెంటు చిరాకుపడి ఉండేవాడు. కాని మంగితో అతను తలపెట్టిన పని మూలంగా, నవ్వు కుని "తస్సదియ్యా... సెమత్కారం నేర్చేవే...వయసు మల్లేకొద్దీ సత్తిబామ వైపోతున్నావు..." అంటూ ప్రెసిడెంటు ఆమె బుగ్గ గిల్లేడు.

"ఏం లేదే...కమలమ్మ గారి ఇంటి చాకిలి సువ్వేనా?" అనడిగాడు.

"నేనే! ఇంకొకరు సేత్తే ఆవిడికి నచ్చుద్దేటి? అసలే పేసను మడిసి" అంది మంగి.

"నీ కంటేనా ?" అన్నాడు ప్రెసి డెంటు.

"ఆవిడగోరి పేసను ముందు నా పెసన్లేం నిలబడతాయి? ఆవిడ సీర కట్టు కోడమే అదో పద్ధతిగా కట్టుకుంటది ఒంటి నించి మొలిచినట్టుంటది...మరా సిత్రమేంటో జాకిట్టు పిటపిట లాడ్తా ఉంటాది. అవిడ తప్ప మనూరి మొత్తం మీద కంపెనీ బాడీలు తొడుక్కునే ఆడం

గులెవరున్నారండీ? ఆవిడ బాడీ నాకు సుక్కలా సరిపోద్ది..." అని ఇంకా ఏదో చెప్పబోతూంది మంగి.

అది సర్లే గాని...వయసులో ఉన్న మనిసి కదా...అంత సోకూ అన్ని పేసన్లూ తెలిసిన మడిసై యుండి, మొగోడి అవసరం లేకుండా ఎలా బతికేస్తందంటావ్?" అన్నాడు ప్రెసిడెంటు మంగితో.

"మీయన్నీ ఇలాంటి ఊసులే...! ఊళ్ళో ఉన్న జనం సరిపోరన్జెప్పి ఆవిడ మీద పడింది కన్ను... ఆవిడ లాంటి ఆడది కాదు. మాటవరసక్కూడా పరాయి మొగోడి గౌడవెత్తదు" అంది మంగి.

"అందుకే నిన్నడుగుతున్నాను. ఉప్పూ కారం తింటున్న మనిసేకదా... పొంగే వయసును ఎలా బిగ పట్టుకుని ఉంటుందీ అని..." అన్నాడు.

"మనసులో ఉంటే మాత్రం పెద్దోళ్లు పైకి తేల్తారేటి? ఒక వేళ మీలాంటోరికి ఆవిడి మీద మనసు పుట్టినా మాలాంటోళ్ళ నడిగినంత తేలిగ్గా అడగటం కుదరదు గదా? అందుకని— మనసులో కోరికలున్నా ఎవళమట్టుకాళ్ళే అణి సేసుకుంటారు" అంది మంగి, ఆ రంగంలో తనకున్న ప్రావీణ్యాన్నంతటినీ వెలిబుచ్చుతూ.

"అందుకే నువ్వో పనిసేత్తే నయమే మధ్యాన్నంమాటు ఎవరూ ఉండరు కమలమ్మింట్లో...చుక్కమ్మ ఉన్నా ఏదో పనిలో ఉంటది...అలాంటప్పుడు నువ్వేదో వంకెట్టుకు ఎల్లి, ఆవిణ్ణి కాతంత లసకందంలోకి దింపాలి?" అన్నాడు ప్రెసిడెంటు.

"మంచోరే? అదెలాగీలౌద్ది? అసలావిడ గారా వూసు ఎత్తనిత్తేనా?" అంది మంగి.

ప్రెసిడెంటు నవ్వేసి "నీ సెత్తి నీకు తెలీదే మంగీ! ఎనకటికి రంభలాంటోళ్ల రుసుల్ని పాడు సేసేరు కాని, నువ్వు తలుసుకుంటే ఎంతటి పెతివ్రాత నయినా నాలుగు రోజుల్లో గాడిలో పెట్టేత్తావు. ఊరికే సెయ్యొద్దులే ఉపకారం ...! నువ్వావిడిని నా యెంపుకు తిప్పేవంటే ఓ బంగారవు గాజుల్జతా, ఓ పట్టుచీరే కొనిత్తాను'' అంటూ మంగిని పొగిడి, ఎర చూపించాడు.

"సరే... మీరంతగా అడుగుతుంటే కాదనగల్దునేటి ? మీరడిగిన యే మాట కాదన్నాను? ఎప్పుడు కాదన్నాను. రేపే యెళ్తాను. ఇస్తిరీ సేసిన బట్టలు ఇంట్లోనే ఉన్నాయి ఆవిడి గారియి...!" అంది మంగి.

* * *

మర్నాడు మధ్యాహ్నం కమలమ్మ ఇంటికి బట్టలు తీసుకొని మంగి వెళ్లింది.

రాముడు పొలంలో ఉన్నాడు. చుక్కమ్మ పెరటి వేపున గొడ్లపాక దగ్గర పేడకుమ్మి పిడకలు చరుస్తోంది గోడకి.

కమలమ్మ తన పడగ్గదిలో ఉంది.

మంగి అదే సమయంలో వెళ్ళింది.

ప్రతిసారీ బట్టలు తీసుకొని వెళ్ళినప్పుడు, బట్టలు వొప్పజెప్పి, 'పద్దు చూసుకోండమ్మ గారూ' అని చెప్పి

వచ్చేసేది మంగి. అలా కాకుండా ఈ సారి బట్టల మూట మంచం మీద దింపి అప్పుడే వెళ్ళే ఉద్దేశం లేనిదానిలా— నేలమీద చతికిలబడి కూర్చుంది. కమలమ్మ "ఏఁమిటే మంగీ, పనేం లేదా, ఖాళీగా కూర్చున్నావ్?" అంది.

"నిత్యం ఉండే పనే కదా అమ్మగారూ ... కాసేపు మీ కాడ కూకుని ఎల్దామనిపించి కూకుండి పోయేను." అంది.

ఎలా మొదలు పెట్టాలో మంగికి అర్థం కావడం లేదు. కమలమ్మ కూడా ఒక క్షణం మౌనంగా ఉండిపోయింది. ఏదో మాట్లాడక తప్పదు కదా అన్నట్టు-"నీ కెంత మంది పిల్లలే ?" అనడిగింది కమలమ్మ.

"ఒక్కడేనండి. ఆళ్లయ్యతో పట్నంలో ఉంటన్నాడు. సదూకుంటన్నాడంటక్కడ" అంది మంగి.

"ఎప్పుడైనా అక్కడికి వెళ్లి చూసి వస్తుంటావా?" అంది కమలమ్మ.

"అక్కడికి నే యెల్లనండి. యేనాడో నాతో తెగ తెంపులు సేసుకుని ఆళ్లయ్యో ఎళ్లిపోయాడు. ఎంట కుర్రోణ్ణి కూడా తీసుకుపోయాడు. వాత్తే కుర్రోడే సెలవలిచ్చినప్పుడు వొచ్చి, సూసెల్తా ఉంటాడు'' అంది మంగి.

"నీ మొగుడు ఎందుకు వొదిలేసేడే నిన్నూ?" అంది కమలమ్మ తెలుసుకోవాలన్న కుతూహలంతో.

మంగి సంగతి ఆమెకి తెలియక కాదు. ఊళ్లో వాళ్లందరి సంగతీ చుక్కమ్మనో, రాముడినో అడిగి కమలమ్మ తెలుసుకుంటూనే ఉంటుంది. మంగి ఆమెకేం కొత్త కాదు. తాను కాపరానికి రాని క్రితం నుంచీ ఆ ఊళ్లో ఉన్నది మంగి. అయినా అదేమంటుందోనని అడిగింది.

మంగి-"ఒట్టి అనుమానం మడిసండీ ఆడు. ప్రెసిడెంటు గారు కాత్త నాతో సనువుగా ఉంటాడని, కోపగించి వెళ్లిపోయాడు. మన ప్రెసిడెంటు గారి సంగతి మీకు తెలవన్దేముంది? కాత్త సరదా మనిషి. నేను కాతంత అందంగా వుండడంతోటి ఏదో ఓ మాట ఏలాకోలంగా అనేవోరు. ఆ మాటకొత్తే ఆయినన్నుమాటేటి...మీ ఆయనకూడా ఏదో ఓటి అనేవోరు నవ్వుతూ. అంతమాత్రాన పెద్దోరిని మొహం సెండుకోతేం గదండీ...? ఇలాంటియన్నీ మనసులో పెట్టుకుని ఊరొదిలి పోయేడండీ ఆడు" అంది.

"వాడితో నువ్వూ పోకపోయావా ? వాడికా అనుమానం పోయేది..." అంది కమలమ్మ.

"ఇల్లూ వాకిలీ వొదులుకుని నే నెక్కడ పోతానండీ ఆడితోటి? ఈ ఊళ్లో నాకేం లోటు? ఆడి అనుమానం కానీ... ప్రెసిడెంటు గారు మా సక్కటి మనిసండీ...ఆయన్ని నమ్ముకునున్న మనిసికి పేనం ఇత్తారు. ఆడు పోయినకాణ్ణించీ ఏ అవసరం వొచ్చినా నన్నాదుకునేది ఆయనే...!" అంది మంగి ఇంకా ఏదో చెప్పబోతూ.

మంగి అలా మాట్లాడుతూ, చిరు

నవ్వులు వొలికిస్తోంది. ద్వంద్వార్థాలు వచ్చేలా మాట్లాడుతోంది. ప్రెసిడెంటుకీ తనకీ సంబంధం ఉందని చెప్పకుండానే చెబుతోంది. అది కమలమ్మకు నచ్చక "చాల్లే, వెధవ సొదా నువ్వూనః అని మంగికి అడ్డు తగిలింది.

"ప్రెసిడెంటుగారంటే మీకెందుకండీ అంత సిరాకు? మీరంటే ఆయిన గోరికి ఎంతో ఇది!" అంది మంగి.

"ఏమిటా యిదీ?!" అంది కమలమ్మ.

"ఇదంటే...గౌరవమనుకోండీ... మీ వోరికీ, ఆయన గోరికీ ఉండే స్నేహితం మూలంగా మీ మీద అభిమానఁవుఁ అనుకోండి... కాకపోతే పేమనుకోండి..." అంది మంగి.

"నా మీద అంత ప్రేమటే ప్రెసిడెంటుకీ" అంది కమలమ్మ కాస్త వయ్యారంగా.

కమలమ్మ దారిచ్చేసింది......అనుకొంది మంగి.

"ఇంతా అంతా పేను కాదండిబాబు.. మిమ్మల్ని తలుసుకోని రోజుండదు. మీరు కల్లో ఆపద తారంట ఆయనకి. మీరు ఊఁ అంటే నూతిలో దూకమంటే దూకుతాడు. మీ కాల్ల కాడికొచ్చి వాలతాడు. నేనన్నానని కాదుగాని ... మీ రూ వొంటరిగా ఉంటన్నారా ... ఆయినా సక్కటి మనిసీ... గౌరవమైనోడు. గుట్టుగా గడుపుకుంటే గొడవేముందండీ?" అంది మంగి, బంగారపు గాజుల జత, పట్టు చీరా తనకు చాలా దగ్గర్లో ఉన్నాయన్న ఆశతో....

కమలమ్మ వచ్చే కోపాన్ని దిగమింగుకుని మంచం మీంచి లేచింది. బీరువా పక్కనే ఉన్న చెప్పులు తొడుక్కుంది. ఒక్కసారి గుమ్మం దాకా వెళ్లి ముందువా వేపు చూసింది. తిరిగి వచ్చి మంచం మీద కూర్చుంది.

"ఎవరికేనా తెలిస్తే బాగోదు కదుటే?" అంది కమలమ్మ.

"ఎలా తెలుస్తదండీ? మీరు గడప దాటతారా, ఏమన్నానా ? ఊరు మాటు మణిగేక పెరటి గుమ్మాన గుట్టుగా వత్తాడు. పెరట్లో కొబ్బరి తోట్లోనేనా కలుసుకోవచ్చు. లేకపోతే ధాన్యం కొట్ల కాడేనా కలుసుకోవచ్చు. మిమ్మల్ని ఎలాగేనా ఒపిం్పచమని ఆయన గోరు నన్నెంత బతిమాల్తున్నాడో మీకు తెల్దు: ఆయన గోరి బాద చూసి నాకూ జాలేసేస్తంది. మీరు వూఁ అనండి...ఈ మాపిటికే ఆయన్ని..." అని ఇంకా ఏదో మంగి అనబోయింది.

కమలమ్మ కళ్లు నిప్పులు చెరుగుతున్నాయి. నెమ్మదిగా లేచింది. ఓ చేత్తో మంగి కొప్పు పట్టుకొని, రెండో చేత్తో కాలనున్న జోడుతీసింది. ఈ దవడా, ఆ దవడా తగిలేచోటూ, తప్పే చోటూ అని కాకుండా, శక్తి కొద్దీ మంగిని కొట్టింది. మంగికి నోట మాట రాలేదు. అక్కడి నుంచి ప్రాణాల్తో బైట పడితే చాలని పించింది దానికి.

"వాడు కబురంపితే నువ్వొస్తావా? నువ్వు చెడింది కాకుండా, ఊళ్లో అందరాడాళ్లనీ చెరచడమేనేమిటే నీ పని?... పెంట ముండా! ఇంకొక్కసారి ఇలాంటి గొడవలు నా దగ్గర ఎత్తినా, ఈ విష



యం వూళ్లో ఎవరికేనా తెలిసినా, ఊళ్ళో ప్రాణాల్తో ఉండవు! ఫో అవతలికి!" అని మంగిని మెడ పట్టి గెంటింది కమలమ్మ.

మంగి కిక్కురు మనకుండా, కళ్లు వత్తుకుని తగిలిన చెప్పు దెబ్బలు దులుపుకొని, ఏమీ జరగనట్టు బయటపడింది. కాని కమలమ్మ మీద పీక దాకా కసి పెంచుకుంది.

## 15

రోజులు దొర్లుతున్నాయి. చవకబారు సాహిత్యానికి అలవాటు పడిన కమలమ్మ ఆపుస్తకాల్ని వదలకుండా చదువుతోంది. ఆ సాహిత్యం ఆమె మీద మత్తుమందులా పని చేస్తోంది. భర్త పోయిన నాటినుంచీ నిద్రపోతున్న ఆమె కోరికలనూ, వాంఛలనూ ఆ సాహిత్యం తట్టిలేపింది. తన ప్రయత్నం విఫలమైనందుకూ, రాముడు ఆమె ఆశించిన విధంగా లొంగనందుకూ మొదట్లో రెండు మూడు రోజులు ఒక రకమైనబాధతోటీ, లజ్జతోటీ; మధన పడింది. ఆమెకు—తన మనస్సు వాడికి అర్థం కాలేదో లేక తనంటే వాడికి ఇష్టం లేదో అవగాహన కాలేదు. రాముడి ప్రవర్తనలో ఏ మార్పు లేదు. ఎప్పటిలాగే మాట్లాడుతున్నాడు. ఇదివరకట్లోలాగే భక్తి గౌరవాలతో ఆమెను సేవిస్తున్నాడు. కాని కమలమ్మ మాటలోనూ, చూపులోనూ, పలకరింపులోనూ రాముడి విషయంలో చాలా తేడా ఉంది. చీటికీ మాటికీ

వాడితో సరసాలాడ్డం, రెండర్థాలు వచ్చేలా మాట్లాడ్డం, వీలైనప్పుడల్లా వాణ్ణి తాకడానికీ, వాణ్ణి రాసుకు తిరగడానికీ ప్రయత్నం చెయ్యడం కమలమ్మకు దినచర్య అయిపోయింది. రాముడు ఎన్నడూ అడ్డు చెప్పలేదు. తప్పుగా అర్థం చేసుకోలేదు. తప్పుడు ఊహా, ఆలోచనా వాడి మనస్సులోకి రాలేదు. చుక్కమ్మకి మాత్రం కమలమ్మ ప్రవర్తనలో వచ్చిన మార్పు గ్రహించడానికి అట్టే కాలం పట్టలేదు.

వయసు తీరకుండానే భర్త పోవడంతో వయస్సు పెట్టే అలజడికి కమలమ్మ అలా ప్రవర్తిస్తోంది, ఏం చేస్తుంది పాపం... అని జాలిపడింది చుక్కమ్మ. పెద్దింటి ఆవిడ కావడం మూలంగా బరితెగించి వీధిని పడలేదు. పాటకపు జనంలా మారుమనువు చేసుకోనూ లేదు. మనస్సులో చెలరేగే వాంఛలనూ, కోరికలనూ చేతల ద్వారా పరిష్కరించుకోలేనప్పుడు, సాధించుకోలేనప్పుడు మాటల ద్వారా వెళ్లగక్కడం సహజం.. అదే జరుగుతోంది. వయస్సులో ఉన్న మగవాడికి భార్య పోతే మరో ఆడదాన్ని పెళ్లాడి తన కోర్కెలను తీర్చుకొనే అవకాశం ఉంది. కాని ఒక సంప్రదాయానికి అలవాటు పడ్డ స్త్రీకి ఎంత వయస్సులో ఉన్నా, భర్త పోయింతర్వాత మరో మగవాణ్ణి పెళ్లాడే అవకాశం లేదు. ధైర్యం చేసి పెళ్లాడితే ఎవరూ చెయ్యగలిగిందేం లేదు. కాని ధైర్యమే చాలదు. అటువంటప్పుడు జీవితం పెడదార్లు పట్టడం, చివరికి నవ్వులపాలు కావడం సమాజంలో మామూలై పోయింది.

కమలమ్మ జీవితం ప్రస్తుతం ఎదుర్కొంటున్న సమస్య అలాంటిదే. చివరికి ఆమె జీవితం ఎటువంటి మలుపులు తిరుగుతుందో ఆమే ఊహించలేకుండా ఉంది. ఆవేశం పొంగి పొరలినప్పుడు ఆమె ఒకమగవాడు కావాలనుకుంటుంది. ఆమె శరీరం పురుష స్పర్శ కోసం తపించిపోతుంది. తాను ఎప్పుడు అవకాశం యిస్తే అప్పుడు ప్రెసిడెంటూ మునసబూలాంటి వాళ్లు తన పాదాల దగ్గర వాలడానికి సిద్ధంగా ఉన్నారని తెలుసు. అయినా ఆమె విచక్షణ ఆ ఉద్వేగం తగ్గిన తరవాత ఆంతకు తెగించడానికి ఒప్పుకోదు. ఏదైనా తప్పనిసరి పరిస్థితుల్లో ఆమె వాళ్ల పాల్పడితే తన పరువూ, ఆ లోగిలి పరువూ ఎంత నవ్వుల పాలవుతుందో - ఊళ్లో జనం నోళ్లల్లో తన పరువు ఎలా నానిపోతుందో, తన ఆస్తిని వాళ్లెలా చేజిక్కించుకొంటారో తన బిడ్డ గతి ఏమవుతుందో, ఆమె ఊహించుకుంటూనే ఉంటుంది. అందుకే తాను రాముడికి ఇచ్చిన అవకాశం ప్రెసిడెంటూ, మునసబూ సిద్ధహస్తులూ, సంసిద్ధులూ అని తెలిసినా వాళ్లకు ఇవ్వలేదు. కాని రాముడు ఆడదంటేనే ఏమిటో తెలీని బండరాయిలా అచేతనంగా ఉన్నాడు. తాను ఎంత ప్రయత్నించినా వాడు దారికి రావడం లేదు. రోజురోజుకీ తన జీవితం నరకమైపోతోంది.

ఉన్నట్టుండి ఒకరోజు పొద్దున్నే రాముడు వచ్చాడు. కమలమ్మ ముందు

చేతులు కట్టుకొని నిలబడ్డాడు. వాడికళ్లు అప్పటికే చెమ్మగిల్లాయి. కమలమ్మ "ఏంట్రా అలా ఉన్నావు? ఏమయింది?" అనడిగింది.

"మా మామ్మ సావుబతుకుల్లో ఉందండి. నన్ను పక్కలో కూసో బెట్టుకుని అది కన్ను మూసేలోపుని నన్ను పెళ్లి సేస్కోమని బతిమాలిందండి. గూడెంలో వోళ్లందరూ కూడా-ఆముసల్ది నిన్ను పెంచి పెద్ద సేసిందిరా-దాని కడసారపు కోర్కె తీర్సడం నాయెంరా. అంటన్నారండి. ఇప్పుడేం సెయ్యాలో నాకు పాలిపోవడం లేదండి" అన్నాడు.

కమలమ్మ ఒక్కక్షణం ఆలోచించింది. ముందుగా 'ఈ వెధవకి పెళ్లి కావాల్సొచ్చిందా-ఆడదాని మనసు అర్థం చేసుకోలేని వాడికి పెళ్లి దేనికి?' అనుకొంది మనసులో. మరుక్షణంలోనే మరో ఆలోచన వచ్చిందామెకు. ఆడదంటే ఏమిటో తెలియక నా తపన వీడికి అర్థమై ఉండదు. పెళ్లయితే ఆడదంటే ఏమిటో అర్థం అవుతుంది. ఆ సుఖంలోని తీపి తెలుస్తుంది. ఆ తరవాత వీణ్ణి తన వేపుకి తిప్పుకోవడం పెద్ద కష్టం కాకపోవచ్చు. అందుకని... వీడి పెళ్లి వెంటనే జరిపించడమే మంచిది' అన్న నిర్ణయానికి వచ్చింది కమలమ్మ.

"దానికింత బాధ పడ్తావెందుకురా. వేలు విడిచిన మేనమామ కూతురు ఉందన్నావుగద...దాని మెడలో వెంటనే తాళి కట్టేసి ఆ ముసల్దాని కోర్కె తీర్చు డబ్బిస్తాను పట్టుకు వెళ్లు" అని ఇనప్పెట్టె తీసి వెయ్యి రూపాయలు ఇచ్చింది.

డబ్బు తీసుకున్న రాముడు కృతజ్ఞతతో కమలమ్మ పాదాలకు నమస్కరించాడు. వాడికి మాటల్లో కృతజ్ఞత తెలుపుకోవడం చేతకాలేదు. ఆ క్షణంలో మాత్రం ఇంతో అంతో సంస్కారం ఉన్న కమలమ్మ వాడి కృతజ్ఞతకు కరిగిపోకుండా ఉండలేకపోయింది.



## 16

కాలం తన పని తాను చేసుకుంటూ పోతూంది. పుట్టేవాళ్ళు పుడుతున్నారు. పోయేవాళ్లు పోతున్నారు. కలిసేవాళ్లు కలుస్తున్నారు. విడిపోయేవాళ్ళు విడిపోతున్నారు. మధనపడేవాళ్ళు మధనపడుతున్నారు. రాముడూ రత్తీ కలిశారు. కొత్త దంపతులిద్దర్నీ దీవించి మనవణ్ణీ, మనవరాల్నీ కళ్ళారా చూసుకొని పుత్తమ్మ తన బాధ్యత తీరిపోయిందని కన్నుమూసింది. దినకార్యం పూర్తి చేసుకొని రత్తిని వెంటపెట్టుకొని రాముడు కమలమ్మ దర్శనానికి వచ్చాడు. అప్పటికే పుత్తమ్మ పోయిందన్న వార్త కమలమ్మకి తెలిసింది. రాముడూ, రత్తీ వచ్చి ఆమె పాదాలకు నమస్కరించగానే ఇద్దర్నీ మనసారా దీవించింది. ఇద్దరికీ కొత్త బట్టలు పెట్టింది.

"నీ పేరేమిటి?" అనడిగింది రత్తిని

కమలమ్మ.

"రత్నపండి" అంది తలొంచుకుని రత్తి.

"నిజంగా రత్నంలాగే ఉన్నావే..." అంది కమలమ్మ.

"ఎదవ బడాయి...రత్నం కాదండి. రత్తి. రత్తి దాని పేరు. మీతో రత్నం అంటంది" అన్నాడు రాముడు నవ్వుతూ.

రత్తి సిగ్గుపడింది.

"చిన్నప్పుడలాగ పిలిచేరేమో. ఇక నుంచీ నువ్వు రత్నం అనే పిలవరా." అంది కమలమ్మ రాముడితో.

కావాలనే కమలమ్మ ఆ శుభ సమయంలో పుత్రమ్మ పోయిన విషయం ఎత్తలేదు. అలాగే మరో విషయం కూడా మనసులోనే ఉంచుకుంది. రాముడు కూడా ఒక విషయం గురించి మనస్సులోనే బాధపడ్తున్నాడు. పైకి ఎలా చెప్పాలో తనను క్షమించమని ఎలా అడగాలో వాడికి తెలియటం లేదు. అలా మౌనంగా నిలబడిపోయాడు. వాడి పక్కనే రత్తి నిలబడి ఉంది.

"ఇక వెళ్ళిరండి" అంది కమలమ్మ.

రాముడు సంకోచిస్తూనే "అమ్మగారూ, మొన్న మోటర్ షెడ్లోంచి నేనీ పెళ్ళి గొడవలోనూ, చావు గొడవలోనూ ఉండగా – మోటర్ ఎవరో ఇప్పుకుని పట్టుకుపోయారంట... అది నా సేతులి మీదుగా కొన్న మోటర్. నాకు ఊహ తెలిసేక మన పొలంలో ఇదే మొదటి దొంగతనం. నాకీ గొడవల్లేకపోతే ఇలా జరిగేది కాదు" అన్నాడు ఎంతో బాధ పడ్తూ.

ఆ క్షణంలో మోటార్ పోయిందన్న బాధే వాడి మొహంలో కనిబడింది గానీ, పెళ్ళయిందన్న ఆనందంకానీ – మామ్మ పోయిందని ఆ వేదన కానీ, వాడి మొహంలో కమలమ్మకు కనిపించలేదు. వాడి మనస్సు కమలమ్మకు అర్థం అయింది.

"పోనీ లేరా. ఇందులో నీ తప్పేం లేదు. మోటర్ దొంగతనం జరగగానే మునసబు వచ్చి, పోలీసు రిపోర్టు యిమ్మన్నాడు. పోలీసు రిపోర్టు యిస్తే ఏం జరుగుతుందో నాకు తెలుసు. ఎవర్ని అనుమానిస్తారో నాకు తెలుసు. అసలు ఈ దొంగతనం ఎలా జరిగిందో, ఎందుకు జరిగిందో నేను ఊహించగలను. నీమీద నాకు ఎప్పుడూ అనుమానం లేదు. వెళ్లు. వెళ్లి అన్నీ హాయిగా మర్చిపోయి నీ పెళ్లాంతో కాపరం చేసుకో'' అంది కమలమ్మ.

రాముడు మనస్సులోనే కమలమ్మకు చేతులు ఎత్తి మొక్కుకున్నాడు. తన మీద ఆమెకున్న నమ్మకానికి మనసు కరిగి కన్నీరుగా స్రవించింది. "నువ్వు నిజంగా అమ్మవమ్మా. నా ముసల్ది పోయేక నాకెవరూ లేరనుకున్నాను. నువ్వు ఉన్నావమ్మా నాకు'' అని రాముడు రత్తినితీసుకొని వెళ్లిపోయాడు. ఎప్పటిలాగే పొలం పనులు చూసుకుంటున్నాడు. ఎంత రాత్రయినా ఏరు పాటులో ఉన్నా, పోటులో ఉన్నా గూడేనికి వెళ్లిపోతున్నాడు. ఒకవేళ రాముడు గూడేనికి రాకపోతే రత్తే యేరు దాటి మకాం దగ్గరికి వచ్చేస్తుంది. పొలమే

## మినికథ




బెర్నార్డ్ షాకు ఒకసారి తన చిత్రాన్ని రంగుల్లో చూసుకోవాలని కోరిక కలిగింది. ఆ విషయాన్ని తనకు తెలిసిన మిత్రులందరితో చెప్పాడాయన. ఓకుర్ర చిత్రకారుడు తాను ఆపని చేస్తానన్నాడు. బెర్నార్డ్ షా ఆ ఆర్టిస్టుని అభినందించి, అతను గీసిన చిత్రం తనకు నచ్చితే 100 డాలర్లు ఇస్తానని వాగ్దానం చేశాడు.

చిత్రం పూర్తయింది. చాలా బాగా వచ్చిందని ఆ యువకుణ్ణి మెచ్చుకొని తాను అన్న ప్రకారం 100 డాలర్లకు ఒక్కొక్కటి 20 డాలర్ల చొప్పున 5 చెక్కులు ఇచ్చాడు బెర్నార్డ్ షా.

"వందడాలర్లకు ఒకే చెక్కు ఇవ్వచ్చు కదా, అయిదు చెక్కులిచ్చారేమిటి" అన్నాడు ఆ చిత్రకారుడు షా ఎందుకు అలా చేశాడో అర్థంకాక. బెర్నార్డ్ షా ఓ చిరునవ్వు నవ్వి "ఇలా అయిదు చెక్కులివ్వడంవల్ల నీకు అదనంగామరో 50 డాలర్లు కలిసి వస్తాయి" అన్నాడు.

"ఎలా" అన్నాడు చిత్రకారుడు అమాయకంగా.

"వెర్రివాడ! నీకు ఇంకా తెలియదులా ఉంది, నేనన్నా, నారచనలన్నా, నాసంతకం అన్నా ప్రజలు పడి చస్తారు; అలాంటి వారికి ఈ చెక్కులు అమ్ముకో చెక్కు ఇరవై డాలర్లకే ఉన్నా 30 డాలర్లకు కొనుక్కుంటారు నా అభిమానులు. దానివల్ల నీకు మొత్తం 150 డాలర్లు ముడతాయి. ఇక వారు ఈ చెక్కుల్ని ఎలాగా మార్చరు. ఎందుకంటే చెక్కులమీద నా సంతకం ఉంటుంది. కనుక వాటిని దాచుకుంటారు. బ్యాంకులో నా డబ్బు చెక్కు చెదరకుండా అలాగే ఉంటుంది అన్నాడు బెర్నార్డ్ షా.

—శ్వేత



యిల్లు, ఇల్లే పొలంగా వాళ్ళిద్దరూ ఎంతో అన్యోన్యంగా బతుకుతున్నారు... పెళ్లాం మోజులో పడి రాముడు ఏనాడూ వ్యవసాయం పనుల్ని నిర్లక్ష్యం చెయ్యలేదు. మోటర్ పోయిన తరవాతనుంచీ కమతాన్ని కంటికి రెప్పలా కాచుకుంటున్నాడు. పెళ్ళయిన తరవాత రాత్రిళ్లు కమలమ్మ ఇంటికి వెళ్లి పడుకోవడంలేదు రాముడు. పొలంలోనో, గూడెంలోనో పడుకుంటున్నాడు. పని ఉన్నప్పుడూ కమలమ్మ కబురంపినప్పుడూ మాత్రమే లోగిట్లోకి వెళ్తున్నాడు. అలా రోజులు గడుస్తున్నాయి.

కమలమ్మకు రాముణ్ణి చూడాలని అన్పించినా సభ్యత కాదని ఆ కోరికను మనసులోనే అణుచుకుంటోంది. ఓనాడు తిండి గింజల కోసమని రత్తే వచ్చింది కమలమ్మ దగ్గరికి. రత్తి అందం పెళ్ళినాటి కంటే రెండింతలు పెరిగింది. కమలమ్మ రత్తి వచ్చిన పని అడిగి గాది తాళాలు ఇచ్చి కావల్సినన్ని గింజలు తీసుకోమంది. గింజలు తీసుకొని తట్ట నెత్తిని పెట్టుకొని రత్తి వెళ్లడానికి సిద్ధంగా ఉంది. కమలమ్మ వచ్చి రత్తిని చూసింది. పరికిణీ కచ్చా పోసి బిగించి వోణీని నడుంలోకి దోపుకొని తట్టనెత్తిని పెట్టుకున్న రత్తి, పల్లెలోని అందం అంతా రత్తిలోనే దాగి ఉందా అన్నట్టనిపించింది. "ఏమే... వాడికసలు ఏమీ తెలీదు. చిన్నపిల్లవు.నువ్వీ తట్టఏంమోయగలవు? ఓ బస్తా గింజలు వాడే పట్టుకు వెళ్లకపోయాడా?" అంది కమలమ్మ.

"పొలంలో పనుందన్నాడండి.'' అంది రత్తి నవ్వుతూ.

"వాడి మొహం. పనుంటే కూలీల్లేరూ చెయ్యడానికి? పోనీలేగానీ, వాడికి పొలం పనీ, తిండీ నిద్ర తప్ప మరేం తెలీదు. నిన్ను బాగా చూసుకుంటున్నాడా?'' అంది కమలమ్మ-కొంటెగా నవ్వుతూ.

''అంత ఎర్రోడేటండి... అన్నీ తెలుసు. ఎక్కడున్నా సీకటదేసరికి గూడేనికి సేరతాడు. సేరకపోతే-ఎతుక్కుంటూ నేనే ఎల్తాను " అంది రత్తి నవ్వుతూ.

''మొత్తానికి గట్టి దానివేనే అన్నీ నేర్పుతున్నావు మొగుడికి.'' అంది కమలమ్మ. తనకు చేతకాన్ది రత్తికి చేతనైంది అన్నట్లు.

రత్తి వెళ్ళిపోయింది.

ఈ సారైనా ఆడదంటే ఏమిటో తెలిసింది వాడికి. ఇక దారికి రావచ్చు.' అనుకుంది మనస్సులో.

* * *

**కమలమ్మ మంగికి బట్టలువెయ్యడం మానేసింది. వేరే చాకలిని పెట్టింది. దాంతో మంగికి కమలమ్మ మీద మరీ మంట ఎక్కువయింది. అన్నిటికీ తెగించిన మనిషది. తన వెనక గ్రామపెద్దలు ముగ్గురూ ఉన్నారన్న అహం...ఆ కారణంగా మంగి రెచ్చిపోయింది. చాకిరేవు దగ్గరా, చెరువు దగ్గరా, బావి దగ్గరా— ఎవరింటికి తాను బట్టలు పట్టుకువెళ్తే—ఆ యింటి ఆడవాళ్ల దగ్గరా — కమలమ్మ గురించి మాట్లాడ్డం మొదలు పెట్టింది. కమలమ్మ పరువు నడి వీధికి లాగడమే దాని ధ్యేయం. అలా కసి తీర్చుకోవా**

లను కుంది.

కమలమ్మకూ, రాముడికీ సంబంధం ఉందని కనబడిన ప్రతి మనిషి చెవిలోనూ ఊదడం మంగి పనిగా పెట్టుకుంది. ఆనోటా, ఈనోటా ఆ ప్రచారం చుక్కమ్మ చెవిన పడింది. అయినా చుక్కమ్మ కమలమ్మతో ఆ విషయం ఎత్తలేదు.

అక్కడితోటి ఆగకుండా ఆ వార్త పేటలో దాకా పాకింది. మంగి ధ్యేయంలో ఆదొకభాగం. కమలమ్మకూ, రాముడికీ సంబంధం ఉందని రత్తికి తెలియాలి. రత్తికీ, రాముడికీ మధ్య అపార్థాలు పెరిగి తగాదాలు రావాలి. దాంతో కమలమ్మ కమతంలోంచి రాముణ్ణి మానెయ్యమని రత్తి పట్టు పట్టాలి...అది ప్రెసిడెంటూ, మునసబూ ఆశించిన పరిణామం!

అది కూడా తన ప్రచారంలో సాధ్యపడితే మునసబూ, ప్రెసిడెంటూ తనను మెచ్చుకుంటారు. తనకు అండ దొరుకుతుంది మళ్లీ. ఈ ఆలోచనతోటే కావాలని ఆ వార్తను పేటలో దాకా పాకించింది మంగి. మొత్తానికి ఆ వార్త రత్తి చెవిని పడింది.

ఒకనాడు రత్తి రాముణ్ణి నిలదీసి అడిగింది.

రాముడు దేవుడి మీద ఒట్టు వేసి తనకూ, కమలమ్మకూ ఎటువంటి సంబంధమూ లేదని రత్తితో చెప్పాడు. నమ్మించడానికి ప్రయత్నించాడు. అయినా రత్తి కుళ్లి కుళ్లి ఏడ్చింది. రాముడి మనస్సు వికలమై పోయింది. వెళ్లి ఆ సంగతి కమలమ్మతో చెబుదామనుకొన్నాడు. కాని చేత కాలేదు. ఏం చెయ్యాలో తోచక చెరకు తోట దగ్గర, నేల మీదున్న గడ్డి మొక్కలని పీకుతూ కూర్చున్నాడు.

ఈ వార్త ఊరు ఊరంతా మంటలా ఎలా వ్యాపించిందో, అసలీ వార్తను ఎవరు పొక్కించారో, వాడికి అర్థం కావడంలేదు. ఎవరు ఆ వార్తను ప్రచారం చేస్తున్నారో తెలిస్తే-ముక్కలు ముక్కలు కింద నరికేద్దామన్నంత కోపంగా ఉన్నాడు.

అంతలో—

తన పొలంలోనే పని చేసే నారాయుడు వచ్చాడు. దిగాలుపడి కూర్చున్న రాముణ్ణి చూసి—

"ఏంటలా దిగాలు పడున్నావ్, ఎప్పుడూ నవ్వుతూ ఉండేవోడివి..." అన్నాడు నారాయుడు.

రాముడు చెప్పలేక చెప్పలేక తనమీద పడిన నిందను గురించి చెప్పాడు.

"నీ సెవిని ఇయ్యాల పడిందేమోగాని, ఈ మాట చాలా రోజుల బట్టీ ఇంటున్నాను. మీ అడదోసారి నన్ను అడిగింది..." అన్నాడు నారాయుడు.

రాముడు తెల్లబోయి నారాయుడి మొహంలోకి చూశాడు. నారాయుడు "అలా అడిగితే నేనేంఊరుకోలేదులే... 'నోర్ముయ్యే! రాముడు నిప్పులాంటి మడిసి...అసలు నీకి సంగ తెవరు సెప్పేరూ'? అని నిలేశేను" అన్నాడు.

"ఎవరు సెప్పేరంఢి?" అన్నాడు రాముడు ఆత్రుతగా.

"మంగి చెప్పిందని పక్కింటి పుల్లి అందంట" అన్నాడు నారాయుడు.

"అయితే ఈ నిప్పు రాజబెట్టింది మంగి అన్నమాట! ఈ సారి ఆపది నప్పుడు సెప్తాను..." అని పళ్లు పట పటమని కొరికాడు రాముడు.

తిన్నగా కమలమ్మ యింటికి వెళ్లాడు.

"ఆ మంగికి కాలో సెయ్యో తీసే తే నేగాని...కాలోసెయ్యో కాదులెండి... నాలుకే కోసెయ్యాలి! అప్పుడుగాని బుద్ధిరాదు!" అన్నాడు కమలమ్మతో.

"ఏం జరిగిందిరా?"

"దాని నాలికి కోసేసేక సెప్తాను" అని విసురుగా వెళ్లి పోయాడు రాముడు.

"ఎందుకే వీడు... అలా నిప్పు తొక్కిన కోతిలా గంతులేస్తున్నాడు...!" అంది కమలమ్మ చుక్కమ్మతో.

"ఆడన్న మాట నిజమేనండి...దానికలా బుద్ధి సెప్తేగాని, నోర్మూయ్యదు. బొత్తిగా పెట్రేగిపోతింది!" అంది చుక్కమ్మ.

"ఏమందట?" అని అడిగింది కమలమ్మ.

చుక్కమ్మ ఇంక ఉండబట్టలేక "మీ గురించీ రావుడి గురించీ ఇట్టవొచ్చినట్టు మాటాడ్తందండి..." అని ఇంకా ఏదో చెప్పబోయింది.

"చాల్లే...అర్థమయింది!అంతకు తెగించిందన్నమాట!!" అంది కమలమ్మ.

కాని లోలోపల 'అదే నిజమయితే ఎంత బాగుండును?' అనీ అనుకుంది.

'రాముడు తొందరపడి మంగిని ఏం చేస్తాడోనని' ఆందోళనా పడింది.

కమలమ్మ యింటి నుంచి వెళ్ళిన రాముడు తిన్నగా చాకిరేవు దగ్గరికి వెళ్లి అందరూ ఉండగా—మంగిని పట్టుకొని ఈ దవడా ఆ దవడా వాయించాడు. "నామాట యింకెవరి దెగ్గిరేనా ఎత్తే వంటే—ఉప్పు పాతర ఏసేత్తాను జాగ్రత్త!" అని హెచ్చరించి వెళ్ళి పోయాడు.

ఆ రోజు రాత్రి...

రాముడు తనను కొట్టేడని ప్రెసిడెంటుకీ, మునసబుకీ, ఆచారికీ చెప్పుకుంది మంగి.

"రాముడు అంత పెద్దోడై పోయాడన్నమాట!?" అన్నాడు ప్రెసిడెంటు.

"ఆడి తప్పేంవుందీ? ఎనకాలున్న అండ సూసుకుని బరితెగించిపోయేడు!" అన్నాడు మునసబు.

మంగికి తగిలిన దెబ్బలు తనకి తగిలనట్లే బాధ పడుతూ, సొంత పెళ్లాన్ని మందలించినట్లు "అసలు వాళ్ల గొడవ దీనికెందుకండీ? పిచ్చిముండ కాకపోతేనూ...!" అన్నాడు ఆచారి.

"అదేం వన్నమాటయ్యా... అదేం తప్పుమాటందీ? ఉన్నమాటే అంది. ఆడది గాబట్టి ఊసు తన్న గలిగేడు" అన్నాడు ప్రెసిడెంటు, మంగిని వెనకేసుకుని వస్తూ.

"ఇంత మంది మి పెద్దవాళ్లం ఉన్నాం...వాడు దాన్ని అలా చావ బాదితే చూస్తూ ఊరుకోవడమే? ఒకీరు రాసి పోలీసు కేసు పెట్టొచ్చుగా..." అన్నాడు ఆచారి మునసబు వంక చూస్తూ.

"పెట్టొచ్చు పోలీసు కేసు ఎంత సేపూ? మన చేతిలో పనే! కాని తీగి తీస్తే డొంకంతా కదుల్తాది. కమలమ్మకి మనమీద కోపంవొచ్చినా రావొచ్చు..." అన్నాడు మునసబు.

"ఆ విడి కోపం వొస్తుంది కదాని...దీన్ని ఆ రాముడుగాడు తంతే చూస్తూ ఊరుకుంటామా? రేపొద్దున చంపేసినా—చంపేస్తాడు!" అన్నాడు ఆచారి ఎంతో బాధ పడిపోతూ.

"సరేలే...రేపొద్దున్న ఆలోచించి ఏదో ఒకటి చేద్దాం" అన్నాడు ప్రెసిడెంటు చాలా చిన్న విషయంగా తీసి పారేసి.

తనకు తగిలిన దెబ్బల గురించి ఆచారి పడుతున్న బాధను గమనించిన మంగి, లోలోపలే ఆచారిని మెచ్చుకుంది. ప్రెసిడెంటు మాట మీద తను ఇంత చేస్తే, తనని రాముడు తన్నినా ప్రెసిడెంటు అంతగా పట్టించుకోనందుకు బాధ పడింది. అవసరానికి వాడుకుని వదిలే సే మనిషి ప్రెసిడెంటు—అనుకుంది మనసు లోనే.

* * *

మరునాటి ఉదయం.

ఏదో పనిమీద ప్రెసిడెంటు పట్నానికి వెళ్లాడు. మునసబు అసలు మంగి గొడవే పట్టించుకోలేదు. ఆచారికి లోపల బాధగా ఉన్నా, ఆ పెద్ద వాళ్ళిద్దరి అండాలేకుండా తానుగా ఏమీ చేయలేని వాడు కావడం చేత, మెదలకుండా ఊరుకున్నాడు. మామూలుగా దేవుడికి పూజ, వగైరా చూశాడు. అలా......

ఊళ్ళోని జనమంతా ఎవరి పనుల్లో వారు ఉండిపోయారు తప్ప మంగి గురించి పట్టించుకున్న వాళ్లెవరూ లేరు.

ఆ మరుసటి రోజు ఉదయం...

ఊరంతా ముంపుచింపులు పడుతోంది.

రాత్రి మంగిని ఎవరో చంపేశారుట...... అన్నవార్త ఊరంతా పాకింది.

మంగి శవాన్ని చూడ్డానికి, దానింటికి జనం తండోపతండాలుగా వెళ్తున్నారు. వస్తున్నారు. వచ్చి, వెళ్ళే వారెవరూ ఆత్మీయులు కారు. బంధువులూ కారు. తలా, మొండెం వేరయ్యేలా నరకబడిన మంగిని చూడ్డానికి, భయంకరమైన ఆ హత్యను చూడడానికీ జనం వెళ్తున్నారు...వస్తున్నారు.

పట్నంనుంచి అప్పుడే తిరిగివచ్చిన ప్రెసిడెంటుకి మంగి హత్య వార్త-మునసబూ, ఆచారీ గుడి దగ్గరే చెప్పారు. ప్రెసిడెంటుతో ఒక మాట చెప్పి, పోలీసులకు వర్తమానం పంపిద్దామని మునసబు, అతను వచ్చేవరకూ ఆగానన్నాడు. ఆచారి మాత్రం సొంత భార్యను పోగొట్టుకున్నవాడిలా మాటామంతీ లేకుండా దిగాలుపడి ఉన్నాడు.

ఈ హత్య ఎలా జరిగిందో, ఎందుకు జరిగిందో అర్థం గాక ప్రెసిడెంటూ, మునసబూ, ఆచారి ముఖాముఖాలు చూసుకున్నారు. ఊరంతా రకరకాలుగా మాట్లాడు కుంటున్నారు.

"చచ్చినవాళ్ల కళ్లు చారెడేసి" అన్నట్లు 'మంగి మంచి మనిషి' అని

కొందరు అంటున్నారు'. చివరికిలా దిక్కు లేని చావు వచ్చింది 'అని కొందరు అంటున్నారు. 'మొగుణ్ణి ఉసురు పెట్టింది... ఆ పాపమే కొట్టింది' అని మరి కొందరంటున్నారు.

గాని-ఇద్దరు వ్యక్తులు ఒక వ్యక్తికి ఈ హత్యతో సంబంధం' ఉందేమోనని మంగి హత్యావార్త వినగానే భయ పడ్డారు.

అనుమానించ బడినవాడు రాముడు.

అనుమానించిన వాళ్లు...కమలమ్మ, రత్తి.

ఒక్క పది నిముషాలు గడిచే సరికి అంతకు ముందు రోజు రాత్రే మంగి గోడు విన్న ప్రెసిడెంటుకీ, మునసబుకీ ఆచారికీ కూడా రాముడి మీద అను మానం కలిగింది. పెద్దవాళ్లకు కలిగిన అనుమానం అబద్ధమే అయినా నిజం కావటానికి అట్టేసేపు పట్టదు. ప్రెసి డెంటుకి--మంగి బతికున్నన్నాళ్లూ ఉప యోగపడింది, హత్య చేయబడ్డాక కూడా ఉపయోగ పడుతూంది...అనిపించింది.

మంగి శవాన్ని 'కాష్' చేసుకుని రాముణ్ణి జైలుకు పంపాలనుకొన్నాడు ప్రెసిడెంటు. వెంటనే పోలీసులకు ఈ విషయం తెలియబరచమన్నాడు మునస బుని.

ఏపాపం తెలియని రాముడు—హత్య చేయబడిన మంగి గురించి ఒక కన్నీటి బొట్టు రాల్చాడు. "పిచ్చిముండ. దిక్కు లేని సావు సచ్చింది!" అనుకున్నాడు మనసులోనే.

రత్తీ, కమలమ్మా— వాణ్ణి అను మానంగా చూచినా—వాళ్ళిద్దరూ తనను అలా చూస్తారని వాడు ఊహించలేదు. అనుమానించలేదు. నిబ్బరంగా, నిర్భ యంగా తన పనిని చేసుకుంటున్నాడు.

కాని, ఊరంతా వాణ్ణి అనుమాని స్తోంది!

సాయంత్రం నాలుగు గంటల వేళకు పోలీసులు వచ్చారు.

అంతకు ముందు రోజు మంగిని రాముడు కొట్టేడని తమతో మంగి ఫిర్యాదు చేసిన సంగతి పోలీసులకు చెప్పాడు ప్రెసిడెంటు. పోలీసుల మెదడులో రాముడి మీద అనుమానం మొక్క నాటేడు. పోలీసులు శవాన్ని చూసి, ప్రెసిడెంటు ఇంటికి వచ్చారు. కాఫీలు తాగేసరికి—ఆ 'మొక్క' మహా వృక్షం అయింది. ఇద్దరు కానిస్టేబుళ్లు వెళ్ళి రాముడిని గుడి దగ్గరికి తీసుకు వచ్చారు. సబ్ ఇన్‌స్పెక్టర్ రాముడి కళ్ళలోకి సూటిగా చూస్తూ "కొట్టింది చాలక మనిషిని చూడా చంపేస్తావా?" అని గర్జించాడు.

జరిగిందంతా చూస్తూ రాముడు అయోమయంగా నిలబడిపోయాడు. రత్తి ఏడుస్తూ జనంలో నిలబడింది. కమలమ్మ మధ్య మండువా తెర వెనకాలే అస్థిమి తంగా పచార్లు చేస్తోంది.

రాముడు ఎందుకలా తొందర పడ్డాడా అని మథన పడిపోతూంది. వాడిని ఎలా కాపాడాలో తెలియక తనలో తనే సత మతమై పోతూంది.

మగదిక్కు లేని లోటు ఆ క్షణంలో ఆమెకు అనిపించి తనఅన్న నరసింహం

ఉన్నా బాగుండేదీ సమయంలో... అనుకుంది మనసులోనే. ఎందుకో అంతరాంతరాల్లో రాముడు మంగిని చంపేడని ఆమెనమ్మలేకపోతోంది...ఒక్కొక్కసారి. మరుక్షణంలోనే చంపేవుంటాడను కుంటోంది.

ఒకవేళ నిజంగా చంపినా ఆమె మీద అది రేపిన పుకారు కారణంగానే ఆమె కోసమే చంపాడనుకొంటోంది. తనకోసం అంతకు తెగించిన రాముణ్ణి తాను ఆదుకోలేకపోతూన్నందుకు తనను తనే తిట్టుకుంటోంది.

అక్కడ గుడి దగ్గర...

అంత క్రితం రోజు పగలు రాముడు మంగిని కొట్టేడని సాక్ష్యాలు రుజువు చేశాయి. రాముడు మంగిని చంపడానికి కారణం మునసబూ, ప్రెసిడెంటూ అంతకుముందే సబ్ఇన్స్పెక్టర్కి వివరించారు. ఆయన నిజాన్ని చూడలేనంతగా నమ్మించారు.

"వాడిక్కూడ చెప్పారులే...స్టేషన్కి తీసుకుని నడవండి. అన్నీ అక్కడే చెప్తాడు. దాని శవాన్ని శవ పరీక్షకి తీసుకెళ్ళాలి. ఒక బండి ఏర్పాటు చెయ్యండి మునసబుగారూ..." అంటూ సబ్ఇన్స్పెక్టర్ తుదినిర్ణయానికి వచ్చిన వాడిలా లేచాడు...

అంతలో—

నూనూగు మీసాలు వస్తున్న పదహారు, పదిహేడేళ్ళ కుర్రవాడు జనాన్ని తప్పించుకుంటూ... సబ్ఇన్స్పెక్టర్ ముందుకి వచ్చాడు.

జనంలో కొందరు 'మంగి కొడుకు' 'మంగి కొడుకు' అన్నారు.

"ఆగండి ఎస్సయ్గారూ! "అన్నాడు కుర్రాడు.

అందరి కళ్ళూ ఆ కుర్రాడి మీద ఉన్నాయి. లేచిన సబ్ఇన్స్పెక్టర్ "ఎవర్నువ్వు" అంటూ కూర్చున్నాడు.

"హత్యచేయబడిన మంగి కొడుకుని. మా అమ్మని నేనే చంపేను! ఇదేకత్తితో నరికేను!!" అని తన చేతిలోని కత్తిని ఎస్సయ్ ముందు పడేశాడు ఆ కుర్రాడు.

అందరూ తెల్లబోయారు.

ఒక్కక్షణం ఎస్సయ్ నోటి వెంట కూడా మాట రాలేదు.

నెమ్మదిగా తేరుకుని "కన్నతల్లిని చంపావా? ఇంపాసిబుల్" అన్నాడు ఎస్సయ్.

"దానిలాంటి అమ్మల్లా నేను పుట్టగానే అది చంపి ఉంటే నేను ఇంత పెద్ద వాణ్ణి అయ్యే వాణ్ణి కాదు. దాన్ని చంపగలిగే వాణ్ణి కాదు. అది అలా నన్ను చంపకపోవడంచేత నేనే దాన్ని చంపాల్సొచ్చింది." అన్నాడు ఆ కుర్రాడు.

"ఎందుకు చంపాల్సొచ్చింది??" అన్నాడు సబ్ఇన్స్పెక్టర్.

అప్పటికే రాముడు ప్రక్కనున్న ఇద్దరు కానిస్టేబుళ్లు వచ్చి ఆ కుర్రవాడి ఇరుప్రక్కలా నిలబడ్డారు.

"నిన్న సాయంత్రం నేనీ వూళ్ళోకి వచ్చాను. మా అమ్మతో తెగతెంపులు చేసుకొని, మా నాన్న నన్ను తీసుకుపోయి పట్నంలో చదివిస్తున్నాడు. సెలవులకు వచ్చినప్పుడు కన్నతల్లి అన్న మమకారంతో మా నాన్నకు తెలియ

కుండానే- -అప్పుడప్పుడు మా అమ్మను చూడ్డానికి ఇక్కడికి వస్తూంటాను...

"నిన్న సాయంత్రం... ఈ గుడి ముందు నుంచే—మా అమ్మను చూడ్డానికి వెడుతున్నాను. ఈ గుడి అరుగు మీద ఎవరో ఇద్దరు ముగ్గురు కూర్చున్నారు. నేను తలవంచుకుని నడుస్తున్నాను. వారిలో ఒకడు 'మంగి కొడుకురా!' అన్నాడు. 'అన్నీ ప్రెసిడెంట్ పోలికలే!' అని మరొకడన్నాడు. 'నడక కూడా అదే' అన్నాడింకొకడు.

"ఇదివరలో నేను ఊళ్ళోకి వచ్చినపుడు కూడా అలా ఎవరేనా అన్నారేమో...నాకు గుర్తు లేదు. ఊహ తెలిసిన నాకు వాళ్ళ మాటలు శూలాల్లాగా గుచ్చుకున్నాయి. ఈ ఊళ్ళోనే మా అమ్మతోనే బతుకుతూ ఉంటే—అలాంటి మాటలు నాకుబాధకలిగించేవికాదేమో...

"పట్నంలో మానాన్న దగ్గరఉంటూ గౌరవంగా స్కూలుకి వెళ్ళి చదువుకోవడం చేత ఆ మాటలు నాకు చాలా బాధనిపించాయి. వాళ్ళలా ఎందుకన్నారో మా అమ్మను అడగాలనుకున్నాను. తీరా నేనుఇంటి కెళ్ళేసరికి మాఅమ్మ... ఫట్టపగలే...ఎవడితోనో ఇంట్లో ఉంది! బైటకి నవ్వులు వినిపించాయి. తలుపు మూసివుంది. తలుపుతట్టేను...'ఎవరూ' అంది మాఅమ్మ లోపల్నుంచే. 'నేనమ్మా' అన్నాను, గుండెలు పగిలేటా పెల్లుబుకుతోన్నకోపాన్ని అణుచుకుంటూ. మాఅమ్మ కంగారు కంగారుగా తలుపుతీసి, బట్టలు సర్దుకుంటూ 'నిన్న సాయంత్రం దగ్గర జారి పడ్డాన్రా నడుం బెణికింది. ఈనగారిచేత తోమించుకుంటున్నాను' అని తెలివిగా బొంకింది. నడుం తోమించుకునేదానికి జాకెట్టు గుండీలు ఎందుకు ఊడుండాలో అర్థం చేసుకోలేనంత పసివాడిని కాదు నేను... నేను మారు మాటాడ లేదు. మా అమ్మతో ఉన్న ఆ వ్యక్తి నిర్భయంగా వెళ్ళిపోయాడు.

"చీకటిపడేదాకా ఉన్నాను. రకరకాలుగా మా అమ్మ నన్ను నమ్మించడానికి నడుం నొప్పి నటిస్తోనే ఉంది...చివరకు నిద్రపోయింది. నేనూ నిద్రపోయాననుకుని. నా గుండెల్లో రగులుతున్న అవమానం నన్ను నిద్ర పోనివ్వలేదు. నేను ఆమె కొడుకునన్న సంగతి కూడా మరచిపోయాను. ఇంటి చూరుకో ఉన్న ఈ కత్తిని తీసుకుని ఒక్క వేటుతో నిద్రపోతూన్న మా అమ్మను నరికేశాను. తర్వాత భయమేసింది. పారిపోయాను...కాని ఎక్కడికి వెళ్ళాలో తెలియక మళ్ళీ తిరిగి వచ్చాను. నిజం చెప్దామనే వచ్చాను. మీ ముందు నిజం చెప్పాను. ఇప్పుడు నాకు భయంలేదు!" అని నిలబడ్డాడు ఆ కుర్రాడు.

ఊరంతా కొద్ది క్షణాల క్రితం దాకా రాముణ్ణి దోషిగా చూసింది. ఇప్పుడా కుర్రాణ్ణి దోషిగా చూస్తూంది. దోషిగా చూసినా జాలిపడుతోంది.

రత్తి బరువుగా నిట్టూర్చి, ఏడుస్తూ రాముడిని కౌగలించుకుంది.

మంగి జీవితం అలాముగిసిపోయింది రాముడికి అలా గండం తప్పింది. మరోసారి చేతికందిన అవకాశం,

చేజారింది మునసబుకీ, ప్రెసిడెంటుకీ.



# 17

ప్రెసిడెంటుకీ, మునసబూకూ ఎంత ప్రయత్నించినా కమలమ్మనూ కమలమ్మ కమతాన్నీ చేజిక్కించుకోలేక పోయామన్న దుగ్ధ రాను రాను మరీ ఎక్కువైంది. కమలమ్మ ఇంటికి రాకపోకలు తగ్గించాడు. ప్రెసిడెంటు ఇంట్లో ఒక రోజు ఆచారీ, మునసబూ, ప్రెసిడెంటూ దీర్ఘాలోచనలో ఉన్నారు. మునసబు గ్లాసుల్లో మందు పోస్తూ "ఇదెక్కడి ఆడదయ్యా, బొత్తిగా కొరకరాని కొయ్య అయిపోయింది. నేను గట్టిగా నాలుగు సార్లు పలకరిస్తే పలకమారని ఆడది నా మొత్తం సర్వీసులో కనబడలేదు. మొగుడు పోయి ఇన్నేళ్ళయింది బంగినిపిల్లి మామిడి పండులా వయసులో ఉంది. మనల్ని ఊరిస్తమే గాని ఆ తెర దాటి బయటికి రాదేంటీ కమలమ్మ?" అన్నాడు.

"సరే. తెరదాటి మీరే వెళ్ళొచ్చుగా" అన్నాడు ఆచారి. ఓ గుటక మింగి.

"నీకేమయ్యా? ఆ మందుల పొడి అట్టుకుని ఏదో వంకన పడగ్గదిలోకైనా పోతావ్...వంటింట్లోకయినా పోతావ్.., గుత్తి దగ్గర్నుంచి మొదలెట్టి గుండెల్దాకా పోయే అవకాశం ఉంది నీకు. మాకెలా కుదురుతుంది చెప్పు? కమలమ్మ మీద ఎంత మక్కువ ఉన్నా తెగించి ఆ తెర ఒత్తిగించి లోపలికెళ్ళడానికి పరువు అడ్డొత్తంది" అన్నాడు మునసబు.

"ఆచారి మాటలకేం లేవయ్యా! కమలమ్మ గూడెంలో ఆడమనిషేంటి? పెద్దింటావిడ. ఏదేనా అల్లరి పెడ్తే ఊళ్ళో మనం తలెత్తుకో వద్దూ? అక్కడికీ నా పెసిడెంటు పదవే ఎరేసాను. అయినా ఎక్కడా బెసగలేదా మనిసి" అన్నాడు ప్రెసిడెంటు.

"అద్సరేలే. మనాచారి సలహా ప్రకారం మోటార్ గాయబు చేసేశామా! అలా జేత్తే కమలమ్మ కేసు పెడతది. పెళ్ళి పీటల మీంచి ఎకాఎకిని రాముడు గాడిని బొక్కలోకి తోయించేయొచ్చు. అని మనం ప్లానేత్తే మోటారు పోతే పోయిందని ఊరుకుంది గానీ కేసెట్టడానికి ఒప్పుకోలేదు. అసలు నా ఉద్దేశం రాముడిగాడితోటే కమలమ్మ కేదేనా సంబంధం ఉందా... అని!" అన్నాడు మునసబు.

"ఛ... కమలమ్మ గడ్డి తిండానికి సిద్ధపడినా రాముడు మాత్రం అందుకు సిద్ధపడడు. వాడి సంగతి నాకు బాగా తెలుసు" అన్నాడు ఆచారి.

"మనం గడ్డి తిండానికి సిద్ధంగా ఉన్నా, కమలమ్మ మనకా అవకాశం ఇవ్వడం లేదు" అన్నాడు ప్రెసిడెంటు నవ్వుతూ.

"దానికి ఒక్కటే మార్గం ఉందండీ... ఏమిటంటే... రాముడు గాణ్ణి ఆ కమ

తంలోంచి తొలగించాలి. తొలిగించాలీ అంటే వాడి మీద ఓ పెద్ద దొంగతన మేనా అంటగట్టాలి... లేదా వాడి నిర్ల క్ష్యం మూలంగా ఆ కమతానికి ఒక పెద్ద నష్టం కలిగిందని కమలమ్మను నమ్మించనయినా నమ్మించాలి" అన్నాడు ఆచారి, గ్లాసులోని ఆఖరి గుక్కని మింగేసి.

"మందు లోనకి ఎళ్ళే కొద్దీ సిలక పలుకుల్లా పలికేత్తావు సలహాలు...అలా జరగాలంటే ఏం చెయ్యాలో చెప్పూ?" అన్నాడు మునసబు.

"పంటంతా కుప్ప వేసి ఉంది. రాముడా...కొత్త పెళ్ళాం మోజులో ఏటవతల గూడెంలోకీ, ఏటివతల మకాం దగ్గరికీ పక్షిలా వస్తూ పోతూ ఉన్నాడు. అది కాస్తా అగ్నిహోత్రుడికి నైవేద్యం పెడితే కమలమ్మ తోకతొక్కిన తాచులా రాముడి మీదకి లేస్తుంది. పెళ్లాం వచ్చిన తరవాత దాని మోజులో పడి వ్యవ సాయం పట్టించుకోవటం లేదని వాడిని మెడపట్టి గెంటేస్తుంది. ఆ తరవాత కమ లమ్మ మెడ–మెడేమిటే...మొత్తం కమ లమ్మే మీ చేతుల్లో చిక్కుకుంటుంది. మందుమీద ఒట్టు. ఆ శ్రీరామచంద్రుడే ఈ ఆలోచన నా నోటమ్మట పలి కించాడు" అన్నాడు ఆచారి నింపిన గ్లాసును పెదవులకు ఆనిస్తూ.

* * *

తెల్లవారింది.

కమలమ్మ చేలో కుప్ప తగలబడి పోయిందన్న వార్త ఊరంతా చిచ్చులా పాకింది తెల్లవారకముందే కమలమ్మ ఇంటికి వెళ్ళడానికి మునసబూ, ప్రెసి డెంటూ సిద్ధంగా ముస్తాబై ఉన్నారు. సూర్యోదయం కాగానే కమలమ్మ ముందు మండువాలో మునసబూ, ప్రెసిడెంటూ ప్రత్యక్షమయ్యారు. తెర వెనుక కమ లమ్మ నిలబడి ఉంది. ఇంటి ముందు చాలా మంది జనం మూగారు. రాముడూ, మరో ఇద్దరు కూలీలూ, రత్తీ ఒంటినిండా మసితో, వాడిపోయిన మొహాలతో వచ్చారు. రాముడు ఒంటినిండా తువ్వాలు కప్పుకున్నాడు. పంచె నిండా మసి. మండువాలోకి అడుగుపెట్టగానే రాముడు ఏదో మనిషి పోయినట్టు భోరున ఏడ్చే శాడు. రత్తీ ఏడ్చింది. కమలమ్మ "లోపలికి రారా నువ్వు, ఏడిస్తే కాలి పోయిన కుప్ప వస్తుందా? పొలంలో నువ్వు కాపలా ఉండి ఉంటే ఇలా జరిగేది కాదు. రాత్రి గూడేనికి వెళ్ళుంటావు. మోటర్ దొంగతనం జరిగేక కూడా, నీకు జ్ఞానం రాలేదు. అసలెలా జరిగిందీ, లోపలికి వచ్చి చెప్పు'" అని గర్జించింది.

కేసు పాకాన్న పడ్డోన్నందుకు మున సబు లోలోనే సంతోషించాడు. ప్రెసి డెంటు ఇదే అదను అనుకొని "ఈ లేబర్ని ఎప్పుడూ నమ్మకూడదండీ. మనం ఆళ్ళకోసం పాకులాడ్తాం కాని, మనం ఏమైపోతే ఆళ్ళకేం ? మన పంట నాశనమైపోతే ఆళ్లకేం? ఆళ్ల సుకం ఆళ్ల సూసుకుంటారు..." అని ఒక రాయి విసిరాడు రాముడి మీద.

లోపలకు వెళ్తున్న రాముడు ప్రెసి డెంటుని గుడ్లురిమి చూసేడు కాని నోరు విప్పలేదు. రాముడూ, రత్తీ తెర ఒత్తి

# ముడిసరుకు



"ఆయనే కాదుటోయ్ మహాకవి మంగళమూర్తి?"

"అవునోయ్"

"ఆయన్ది మీ ఆఫీసే కదూ?"

"మరే—".

"అంత మహాకవి కనిపించినప్పుడు- అందులో ఆయన్ది మీ ఆఫీసే అయినప్పుడు పోయి పలకరించవేం?"

"ఆయన ఎన్. జి. వో లతో మాట్లాడదోయ్"

"అదేం—ఆయన ఎన్. జి. వో ల మీద కవిత్వం రాసేకదూ మహాకవి అయ్యాడు.

"మరే—ఆయన రాసిన ఎన్. జి. వో జీవి" కావ్య సంకలనానికేనోయ్ ఎకాడమీలన్నీ ఎగబడి ప్రయిజులిచ్చాయి. అయినా ఆయనకి ఎన్. జి. వో లంటే పడదు."

"తమాషాగా వుందే!"

"తమాషా ఏముంది? ఆడవాళ్ళ సమస్యలమీద గ్రంధాలకి గ్రంధాలు రాసే వాళ్ళలో పెళ్ళాల్ని కొట్టేవాళ్ళు ఎందరు లేరు!"

"నిజమే ననుకో! అయినా... మరీ..."

"అయినాలేదు. మరీలేదు. కార్మికుల మీదా కర్షకులమీదా యింకా అమాం బాపతు వగైరాలందరిమీదా పాటలూ, పద్యాలూ చాలా మంది యిదివరకే రాసేశారు. కాబట్టి యీయన కొత్తదనంకోసం ఎన్. జి. వో లను ఎన్నుకున్నాడు. అంతమాత్రంచేత వాళ్ళందరితో బుజాలు కలిపి తిరగాలనెక్కడుందోయ్?"

"ఏమిటో అంతా గందరగోళంగా వుంది. నాకేం అర్థం కావటం లేదు"

"నీకర్థం కాదులే—అందుకే నువ్వు ఎన్. జి. వో వి పద;"

—ఎస్. ఆర్. రావు

గించుకుని లోపలికి వెళ్ళారు. కమలమ్మను చూడగానే రాముడు "నేను పడిన యేడాది కష్టమూ బుగ్గయిపోయిందమ్మ గారూ..." అంటూ భోరున ఏడుస్తూ చేతులెత్తి కమలమ్మకి దండం పెడ్తూ ఆమె పాదాల దగ్గర కుప్పలా కూలి పోయాడు. చేతులెత్తినపుడు వాడు కప్పుకున్న తువాలు జారిపోయింది. వాడికి మోచేతులదాకానూ, గుండెలమీదా భుజాలమీదా ఎక్కిన బొబ్బలు కమలమ్మ కంటబడ్డాయి. ఆమెకు కళ్ళ నీళ్లు తిరిగాయి. అటువంటి వాణ్ణి పట్టుకుని 'రాత్రి గూడెంలోకి పోయుంటావు' అని తాను తొందరపడి నోరు జారినందుకు మనస్సులోనే బాధపడింది. వాడి చేతులు పట్టుకొని కాలిన బొబ్బలమీద పామున్తూ "పోనీలేరా! పంట తగలపెట్టేరు కానీ, చేను తగలబెట్టలేదుగా. వచ్చే యేటికి మళ్ళీ పండుతుంది. ఎవరో కిట్టని వెధవలు చేసి ఉంటారు. మనం పచ్చగా ఉండడం చూసి కిట్టనివాళ్ళు కళ్ళలో నిప్పులు పోసుకొని ఉంటారు. వెధవ పంట కోసం ఇలా చేతులూ, ఒళ్లూ కాల్చుకుంటావా! జరిగిందానికి నీ పెళ్ళాం ఎలా కుమిలి పోతూందో చూడు" అని సముదాయించింది రాముణ్ణి కమలమ్మ.

"అది కాదమ్మగారూ. అసలు నేను ఆడిసేత నా మెళ్ళో తాళి కట్టించుకున్న ఏళ మంచిదికాదు. నా పాదం శనిపాదం అమ్మగారూ. నేను అడుగుపెట్టగానే మా అయ్యమ్మ పోయింది. తవరి పొలంలో మోటర్ పోయింది. ఏడాది తిరక్కుండానే కుప్పలు తగలబెట్టేరు. నే పోతేనే కాని ఈ శని పోదమ్మగోరూ ! ఆ తగలబెట్టినోళ్ళు నన్ను తగలబెట్టినా తవరి కమతం పచ్చగా ఉండేది, నా రాముడు మాట పడాల్సొచ్చేది కాదు" అంది రత్తి జీరవోయిన గొంతుతో.

"ఛ. అవేం మాటలే! నీ తప్పేముంది ఇందులో...? ఒట్టి మనిషివికూడా కాదు. నీళ్ళు పోసుకున్నట్టున్నావు. ఇలాంటి సమయంలో అలా కంట తడిపెట్టకూడదు. ఊరుకో." అని రత్తి నెత్తి మీద చెయ్యి వేసి నిమిరింది కమలమ్మ. ఆమె చల్లని మాటలు, మనస్ఫూర్తిగా చెప్పిన ఓదార్పు రత్తి, రాముల కుమిలి పోతున్న మనసులకు ఉపశమనం కలిగించాయి.

కమలమ్మ ముందు హండువాలో కూర్చున్న పెద్దలకూ, ఇంటి ముందు మూగిన జనానికీ వినబడేలా "చుక్కమ్మా, అయిందేదో అయింది గానీ, ఎవరి పన్లు వాళ్ళను చూసుకోమను. మన కోసం వాళ్ళ పన్లు పాడుచేసుకోవడం దేనికి? ఈ యేడు పండలేదనుకుంటాం. కొంప మునిగిపోయిందేం లేదు... ఆ రాముడి చేతులకీ, ఒంటికీ నవనీతం తీసి రాయి. రాముడికీ, రత్తికీ ఇక్కడే భోజనం పెట్టు. ఆ కాలిన బొబ్బలు తగ్గేదాకా వాళ్ళు వెళ్తానన్నా పొలం వెళ్ళనివ్వకు. నువ్వు కూడా ఇక్కడే ఉండి జాగ్రత్తగా చూసుకోవే రత్తీ!" అని చెప్పేసి కమలమ్మ తన గదిలోకి వెళ్ళి పడుకుంది. పడుకుని ఆలోచనల్లో పడింది.

రత్తిని గూడెంలోకి పంపించేసి, తనే రాముడికి స్వయంగా తన అంతస్తు మరిచి

పోయి సేవలు చేస్తే ఇదే ఆఖరి ప్రయత్నం...అనుకుంది.



## 18

కాలిన బొబ్బలు తగ్గేదాకా రాముడు పొలం వెళ్లకుండా లోగిట్లోనే ఉండి పోయాడు. దాదాపు వారం రోజులు పట్టింది. కమలమ్మ చెప్పినట్టు రత్తి రాముడు లేని లోటు లేకుండా పొలం పని చూసుకుంటూ గూడెంలో ఇల్లు చూసుకుంటూ ఉండేది. పగలంతా కమలమ్మ రాముడితోటే కాలక్షేపం చేస్తూ ఉండేది. వాడి పెళ్ళి సంగతీ, వాడి కాపరం సంగతీ రత్తితో పెళ్లయిన కొత్తలో రాముడు ఎంత చనువుగా ఉన్నాడు... ఇలాంటి అర్థం పర్థం లేని మాటల్తో కాలక్షేపం చేస్తూ ఉండేది కమలమ్మ. రాముడు సిగ్గు పడ్తూ ఉండేవాడు. వాడలా ఇంట్లోనే ఉంటే తనకి చేరువై తన కోరిక తీరుస్తాడనే ఆశతో ఉండేది. కమలమ్మ. కమలమ్మ హద్దులు దాటినా రాముడు హద్దు మీర లేదు.

ఒక క్రమబద్ధంగా బతికే మనిషి సాధారణంగా క్రమం తప్పడు. క్రమం తప్పితే తిరిగి ఆ క్రమంలో పడడం చాలా కష్టం. కమలమ్మ మనసు గాడి తప్పింది. తిరిగి ఆ మనసును అదుపులో పెట్టుకోవడం సాధ్యం కావడం లేదామెకు. మనిషికి ఆకలి ఎంత ప్రధానమయినదో. శారీరకవాంఛలుకూడా అంతే ప్రధానమయినవి. ఆకలిని జయించినవాళ్లూ ఉన్నారు. శారీరక వాంఛలను జయించినవాళ్ళూ ఉన్నారు. కాని ఆ జయాన్ని సాధించడానికి ఎంతో మనోనిగ్రహం కావాలి.ఊపిరిసలపని వ్యాపకాలుకావాలి. ఏ వ్యాపకం లేని కమలమ్మకు శారీరక వాంఛలను తీర్చుకోవడమన్న వ్యాపకమే జీవితమైపోయింది. రకరకాల చిలిపి మాటల్తో, చిత్రమైన ప్రవర్తనతో అల్లరి చిల్లర చేష్టలతో రాముడికి గిలిగింతలు పెట్టినా వాడి మనస్సు మొక్కవోని వజ్రంలా నిలబడిపోయింది. వాడు కమలమ్మను 'అమ్మా' అన్న సంబోధన తప్ప పీసమెత్తు కూడా వాడి ప్రవర్తనలో మార్పు రాలేదు. దాంతో కమలమ్మకు స్పష్టంగా అర్థమయింది, రాముడికి తన మనస్సు అర్థం కాక కాదు, వాడి మనస్సు చలించక వాడి నిగ్రహం సడలక తనను కావాలని దూరంగా ఉంచుతున్నాడు అని వాడి అచంచల నిగ్రహానికీ, నీతికీ కమలమ్మ ఒక్కొక్కసారి మనస్సులోనే జోహారు చేసేది. మరుక్షణంలోనే ఆ చవకబారు సాహిత్యం చదివి, శరీరంలో మత్తుమంటలు రేపుకొన్నప్పుడు మామూలు మనిషిగా మారిపోయేది. రాముణ్ణి అసహ్యించుకొనేది. రత్తిమీద ఈర్ష్య పడేది. రాముణ్ణి తిట్టేది చిరాకు పడేది. అలా ఆ వారం రోజుల్లూ గడిచిపోయాయి. రాముడు అగ్నిపరీక్షకు తట్టుకొని చివరకు లోగిట్లోంచి బయట

పడ్డాడు. తాను స్వయంగా సేవలుచేసినా మాటల్తో చెప్పకపోయినా చేష్టలతోటే, చూపులతోటే తన మనస్సునూ, తన సర్వస్వాన్నీ వాడి ముందు విప్పిపరచినా వాడు-స్వీకరించనందుకు వాడి మీద ఒక రకమయిన ఈర్ష్య పెంచుకొంది. అది స్త్రీ చపలత్వం. కావాలనుకొన్నది. పొందలేనప్పుడు ఆడది పగబట్టిన తాచు అవుతుందిట. అందుకే-అది మొదలు కొని ఏవో పుల్లవిరుపు మాటల్తో రాముణ్ణీ రత్తినీ కూడా ఆడి పోసుకుంటూఉండేది. ఇదంతా రత్తికి వింతగా కనబడేది. తను కాపరానికి వచ్చినప్పట్నించీ కన్నతల్లిగా చూసిన కమలమ్మ ప్రవర్తన రత్తికి కాస్త బాధగానే ఉండేది. అర్థం చేసు కొన్న రాముడికి మాత్రం కమలమ్మ మీద జాలి తప్ప మరో భావన ఏదీ కలిగేది కాదు. రోజులు గడిచాయి.

రత్తికి నెలలు నిండాయి. కమలమ్మ గొడ్లపాకలో ఉన్న కొత్త గాడు గేదె ఈన మోపుకు వచ్చింది. ఆ రోజు వర్షం ఉదయం నుంచీ ఎడ తెరిపి లేకుండా కురుస్తోంది. చిన్నేరు మంచి పోటులో ఉంది. రాముడు పొలంనుంచి ఇంటికి వచ్చి కమలమ్మతో 'వెళ్ళొస్తా' నని చెప్పాడు. కమలమ్మ 'పాకలో వున్న గాడు గేదెను చూశావా?' అని అడిగింది. 'చూశాను' అన్నాడు...ఇందాక సాయం త్రపువేళ చుక్కమ్మ ఈ రాత్రో రేపో గేదె ఈనేస్తుందని అంది. ఇప్పుడు నువ్వు ఇంటికి వెడితే తీరా ఆ గేదె ఈనే మాయి ఎవరు తీస్తారు? దూడకి గోళ్లెవరు గిల్లుతార్రా? మాయి తినేస్తే గేదె ఎందుకేనా పనికొస్తుందా?' అంది కమలమ్మ: 'అది కాదండీ.. ఇక్కడ సుక్కమ్మ వుంది. గూడెంలో రత్తికి... ఈయాలో రేపో పురుణచ్చేలా వుంది. వంటరిగా వుంటది కదాని... ఎల్తా నన్నాను' అన్నాడు వినయంగా రాముడు.

ఎందుకో కమలమ్మకు ఇట్టే కోపం వచ్చేసింది. ఈ మధ్య ప్రతి చిన్న విష యానికీ చిరాకు పడ్డం, కోప్పడ్డం అల వాటైపోయింది కమలమ్మకు. "అవున్రా. నీ పెళ్లామే నీకు ముఖ్యం. నువ్వెళ్లక పోతే దాని పురుడు జరగదు, గూడెంలో ఇంక జనం లేరు. నీ ఇల్లు తప్ప మరో ఇల్లు లేదు. తప్పు నీది కాదురా... నీకు పెళ్లయిన తరవాత నీ పెళ్లాం తప్ప మేం ఎవరం కనపడ్డం లేదు. ఈ కమతాన్నే మరిచిపోయావు. వెళ్లరా వెళ్లు. నా రెండు వేల రూపాయిల గేదె ఎలా పోతే నీకేం? నీ పెళ్లాం బాగుంటే నీకు చాలు అని" సూటి పోటి మాటల్తో రాముణ్ణి నిలబెట్టి దులిపేసింది కమలమ్మ.

రాముడు "ఎళ్ళన్లెం డి. గేదె సంగతి సూసి, పొద్దున తెల్లారేకే ఎళ్తాను" అని చెప్పి చాప తీసుకొని గొడ్లపాకలోకివెళ్ళి పోయాడు. చుక్కమ్మ భోజనానికి పిలిచినా వాడు ఆకలిలేదని చెప్పి రాలేదు. రాత్రి మధ్య మధ్య లేచి గేదెను చూసుకొన్నాడు.

* * * * *

అదే రాత్రి...

బైటి వాతావరణం చినుకూ గాలీగా ఉంది. చిన్నేరు మంచి పోటులో ఉంది. ఏటవతల గూడెంలోని గుడిసెల్లో దీపాలు

గాలికి రెప రెప కొట్టుకుంటున్నాయి.

రత్తి గుడిసెలోని దీపం రెప రెప లాడుతోంది. బైట కుక్క మొరిగినా, ఆకు కదిలినా రాముడే వస్తున్నాడని వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తోంది రత్తి. రాకపోవడంతో నిరాశతో కృంగి పోతోంది. అలా ఆశ, నిరాశల మధ్య గాలికి రెప రెపలాడే దీపంలా రత్తి మనసుకొట్టుకొంటూంది. రాముడు ఎంత త్వరగా వస్తే అంత బాగుండును అనుకుంటోంది రత్తి. ఆమెకేదో కాస్త ఆయాసంగా ఉంది. రత్తికి అది తొలిచూలు కాన్పు కావడంతో ఏమీతెలియని పరిస్తితి. ఆమెకేదో భయంగా ఉంది. డాక్టర్లచేత పరీక్ష చేయించుకుని రెండు మూడు రోజుల్లో పురుడు రావచ్చునని జాగ్రత్త పడే అవకాశం రత్తికి లేదు. అది కాక పోయినా అలా డాక్టరు పరీక్షల కోసం వెళ్ళే అలవాటు ఆ గూడెంలో జనానికి లేదు. ఫలానా రోజుకి తొమ్మిది నెలలూ నిండుతాయని లెక్కలు కట్టుకోవడమూ వాళ్ళకు చేతకాదు.

ఉన్నట్టుండి కడుపంతా అదోలా ఉండడం, పొత్తి కడుపు బిగుసుకు పోవడం, కాస్త ఆయాసంగా ఉండడం, రత్తికి అంతా అయోమయంగా ఉంది లోలోపల ఏదో భయం ఆవరించింది. రాముడు తన పక్కనే ఉంటే బాగుణ్ణని పించింది. కాని రాముడెంతకీ రావడం లేదు. నొప్పులు కాస్త ఎక్కువయ్యేయి రత్తికి. ఒకసారి ఆ బాధకు తట్టుకోలేక కెవ్వున అరిచింది. గుడిసెకూ గుడిసెకూ మధ్య దూరం రెండు మూడు బారల కంటె ఎక్కువ లేకపోవడంతో పక్క గుడిసెలోని ఓ ఇల్లాలు లేచి నెత్తి మీద కొంగు కప్పుకొని రెండడుగుల్లో రత్తి గుడిసె చూరు కిందికి చేరుకొంది. గుడిసెలోకి తొంగి చూసి "ఏంటే రత్తీ, అలా మూలుగుతున్నావ్?" అంటూ మూలుగుతున్న రత్తి దగ్గరికి వెళ్ళింది. పరిస్థితి గ్రహించి గూడెంలోకి పెద్ద దిక్కయినకొండమ్మను పిల్చుకొచ్చింది. కొండమ్మా, పక్కింటి ఇల్లాలూ రత్తికి పురుడు పొయ్యడానికి వచ్చి ఆదుకొన్నారు. వాళ్ళకున్న అనుభవంతో సపర్యలు చేస్తున్నారు. మధ్య మధ్య రత్తి అంత బాధలోనూకూడా 'రాముడు వచ్చాడా?' అని అడుగుతూనే వుంది. కొండమ్మ 'ఆడొచ్చి మట్టుకి ఏంసేత్తాడే? బైట సినుకూ, గాలీగా ఉంది. ఏరు పోట్లో ఉంది. ఇప్పుడెలా వత్తాడూ!' అని సర్ది చెప్పింది.

ఆ సముదాయింపు విన్పించుకోకుండా రత్తి రాముడి కోసం కబురు పంపమని అంత బాధలోనూ ఏడుపు మొదలెట్టింది.

"ఇదెక్కడి పిరికి పిల్లే...? కనేటప్పుడు మొగుడు పక్కన్లేడని ఏడుత్తాదీ...?" అంటూ కొండమ్మ నవ్వుకుని రత్తిని సందిట్లోకి తీసుకుంటూ, రత్తి పక్కనే నులక మంచం మీద కూర్చొంది. ఇంతలో పక్కింటి ఇల్లాలు రత్తి కాళ్లు తాకి "కొండమ్మతో కాళ్లు సల్లబడినట్టున్నయ్" అంది.

"ముంతలో ఎల్లుల్లిపాయలుంటే సూసి కాతంత నూరి కాళ్లకు మర్దనా సెయ్యి" అంది కొండమ్మ.

రత్తి బాగా అలసిపోతోంది. తోట కూర కాడలా వాడిపోయినట్టుంది రత్తి. మధ్యమధ్య 'రాముడొచ్చాడా?' అని అంటూనే ఉంది.

తొలికోడి కూసింది. ఇంకా పురుడు వచ్చే సూచనలేమీ కనబడడం లేదు.

"శిశువడ్డం తిరిగిందేమోనే? సందకాణ్ణించీ నెప్పులు పడతంది...ఇప్పటికింకా తలయినా ఆపట్టం లేదు.! ఎందుకేనా మంచిది ...మంచం సవారీ కట్టి పట్నానికి తీసుకెళ్తే నయం...! నీ మొగుణ్ణి లేపి లోగిలి కాడికెల్లి రాముణ్ణి దీసుకు రమ్మను" అని కొండమ్మ పక్కింటి ఇల్లాల్ని గుడిసె బైటికి తీసుకెళ్ళి రహస్యంగా చెప్పింది.

పక్కింటి ఇల్లాలి మొగుడు ఆ చినుకూ గాలీలోనే, పోటులో వున్న యేరుదాటి రాముణ్ణి పిల్చుకురావడానికి లోగిలివేపు బయల్దేరాడు.

ఇదంతా చూస్తూ ఎదురు గుడిసె పంచని పడుకున్న ఎనభైయేళ్ల ముసలాడు నిద్రపట్టక ఉన్న చుట్టనే ఉచ్చిడిగా కాల్చుతుంటూ జాగారం చేస్తున్నాడు. ఎందుకో ఆ ముసలాడిక్కూడా రాముడొస్తే బాగుణ్ణు ? అనిపించింది.

గూడెం నుంచి వెళ్ళిన మనిషి గూడేనికి తిరిగి వచ్చాడు. కొండమ్మ ఆత్రంగా ఎదురెళ్లి "రాముడేడిరా?" అనడిగింది.

"లేడంట. సందకాడే ఏదో పని మీద పట్నానికెల్లాడంట. తెల్లార్తే కాని రాడని కమలమ్మ గారే సెప్పింది!" అన్నాడు తడిసిన పై పంచెను పిండుకుంటూ

"ఈడి జిమ్మడ! ఆ రాముడు గాడికి ఆ కమతం తప్ప ఇంకేటక్కర్లేదనుకుంటాను. పెల్లాం ఇలా ఉండగా ఇంటిపట్టున లేకుండా పట్నానికెల్లాడా?" అని సణిగింది కొండమ్మ.

* * *

తెల్లవారు ఝామున గేదె ఈనింది. దూడకు గోళ్లు గిల్లి, గేదెకు దంచిన వడ్లు తినిపించాడు రాముడు. మాయివేశాక, కర్రకు చుట్టి బయటికి పట్టుకెళ్ళి పారేశాడు. జున్ను పాలు పితికి ఇంట్లో ఇచ్చాడు.

వెలుగు వచ్చాక కమలమ్మ దగ్గర సెలవు తీసుకొని గూడేనికి బయలు దేరాడు.

సూర్యుడు తూర్పున కనిపించడం లేదు. కాస్త ఎర్రబడిందా దిక్కు. సూర్యుణ్ణి కనలేక నెప్పులు పడ్తున్నట్టుంది తూర్పు. అంతలోనే ఎర్రబారిన తూర్పుదిశను నల్లమబ్బు కమ్మేసింది...

రాత్రంతా మనస్సు రత్తి దగ్గరే ఉన్నా, మనిషిగా గేదె దగ్గరుండిపోయాడు రాముడు. తెల్లవారింతర్వాత మనసున్న చోటికి మనిషిగా బయలు దేరాడు తన మనిషిని చూసుకుందికి బయలుదేరాడు. అర్థరాత్రివేళ రాముడి కోసం గూడెంనుంచి మనిషి వచ్చాడనీ, రత్తి చావుబతుకుల్లో ఉందన్న కబురు తెచ్చాడనీ కమలమ్మకు తప్ప-లోగిల్లో ఎవరికీ తెలీదు. ఊళ్లోవాళ్లకెవరికీ తెలీదు... రాముడు ఏరు దాటి గూడెం లోకి అడుగు పెట్టాడు. అల్లంత దూరాన తన గుడిసె కనబడింది. ముందు జనం గుమిగూడి ఉన్నారు. రత్తికి పురు

గణేశన్ బజర్ నొక్కాడు.

బయట నిలబడ్డ ఎటెండర్ స్ప్రింగ్ డోరు తెరుచుకొని లోపలికి వెళ్ళాడు.

"సార్" అని వినయంగా అడిగాడు ఎటెండర్.

"కేంటీన్లో టిఫిన్ ఏముందో కనుక్కో" అంటూ గణేశన్ సీరియస్‌గా తన ఫైల్స్ వంక చూసుకోసాగాడు.

క్షణంలో కాంటీన్‌కు వెళ్ళొచ్చిన ఎటెండర్ స్ప్రింగ్‌డోర్స్ త్రోసుకుంటూ లోపలికెళ్ళాడు. ఆఫీసర్ సీరియస్‌గా పనిలో మునిగి ఉండటం గమనించి ఒక్క క్షణం తటపటాయించాడు — "చెప్పాలా? వద్దా?" అని—

ఎందుకైనా మంచిదని "సార్!" అన్నాడు మెల్లిగా.

"ఏంటి?" — అన్నాడు గణేశన్




తలెత్తకుండా వెంటనే.

"రోస్ట్ ఉల్లిపాయ మినప— వేడిగా ఉందిసార్" అన్నాడు తడుముకోకుండా.

"అయితే అర్జంటుగా ఒక ప్లేటు విత్ కొబ్బరి చెట్నీతో పట్రా" అని క్లుప్తంగా ముగించాడు గణేశన్.

వెంటనే చకచకా వెళ్ళి పోతున్న ఎటెండర్ని "చూడూ; వెళ్తూ వెళ్తూ మన కొత్త స్టెనోగార్ని లోపలికి పంపించు" అన్నాడు.

"త్వరగా పట్టుకురా" అని గుర్తుచేస్తున్నట్లుగా, పరిగెట్టటానికి సిద్ధంగా ఉన్న ఎటెండర్‌వైపు చూస్తూ పెద్దగా అరిచాడు గణేశన్—

ఎటెండర్ వెళ్ళిపోయాడు.

'మే ఐ గెట్ యిన్ సార్"— అని స్టెనో అడగటంతో తిరిగి ఈలోకం



లోకి వచ్చాడు గణేశన్ తన ఆఫీస్ ఫైళ్ళ మధ్యనుండి.

తలెత్తి చూసి డోర్ దగ్గరనుంచున్న స్టెనోను లోనికి రమ్మన్నాడుగణేశన్.

స్టెనోవచ్చి ఆఫీసరు కెదురు సీట్లో కూర్చున్నాడు.

గణేశన్—స్టెనోకు డిక్టేట్ చెయ్యవలసిన లెటర్ గురించి ఫైల్స్ తిరగేస్తూ వీలయినంత సంక్షిప్తంగా చెప్పడానికి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

పది నిమిషాలు గడిచాయి.

రూము అంతా నిశ్శబ్దంగా ఉంది. ఇంతలో ఎటెండర్ వచ్చి టిఫిన్ పళ్ళెం అక్కడ పెట్టేసి వెళ్ళిపోయాడు. మరి కొన్ని క్షణాల తర్వాత గణేశన్ "టేక్" అని అన్నాడు స్టెనో నుద్దేశించి—

లెటర్ డిక్టేట్‌చేయటం పూర్తిచేసి తలత్తిన గణేశన్ — ప్లేటులో చేయి కడిగి రుమాలతో చేతులు తుడుచుకొంటున్న స్టెనోని చూసి నిశ్చేష్టుడయ్యాడు.

— గిరిజ

దొచ్చింది కాటొలని నాలుగంగల్లో పరు గెత్తాడు. గుడిసె ముందు రత్తి శవం! చాపమీద పడేసి ఉంది. భోరున ఏడుస్తూ రత్తి మీద పడిపోయాడు.

ఎనభై ఏళ్ల ముసలాడు గూడెం కులపెద్ద నారయ్య "ఇప్పుడెందుకురా ఏడుత్తావు? నీకోసమని ఏరు పోటులో ఉన్నా, నువ్వుండే లోగిలి కాడికి మడిసిని పంపేం నిన్న రాత్రి. నువ్వు పట్నం ఎల్లేవని, లోగిట్లో లేవని మీ అమ్మగారు సెప్పిందట. ఎల్లిన మడిసి తిరిగొచ్చి సేడు. నువ్వు గూడెంలోనే ఉంటే మంచం సవారీ కట్టినా దాన్ని యేరు దాటించి ఊళ్ళోకి తీసుకెళ్ళి వొయిద్యం చేయించే వోళ్ళం. మడిసి దక్కునో లేదో, నీకు కడసారి సూపేనా దక్కేది. సివరికి దాని క్కూడా నోసుకోలేదురా నువ్వు. మన బతుకులే అంతరా. కన్న బిడ్డల్ని కట్టు కున్న పెళ్ళాల్ని సూసుకునే అదృష్టం మనకులేదురా...ఏకమతం పట్టిడు మెతు కులు పెడ్తందో ఆ కమతానికి మనవూ, మనసంతతీ కూడా బలై పోడానికి పుట్టిన జాతిరా మనది! మనం పన్జేసిన కమతాలు పెరుగుతాయి. కాని మనం ఇలాగే ఉంటాంరా. ఏభై ఎకరాల కమతాన్ని అరవై చేసేవు. దానికి పెతిపలంగా నీకు దక్కిందేటి? నువ్వు కట్టుకున్న పెళ్లాం ఏడాది తిరక్కుండా పోయింది. అలా అన్నెప్పి నీ సేవలికి మెచ్చి ఒక్క ఎకరం కూడా ఆ కమతంలోంచి నీకు రాదు. ఎల్లి పుల్లలడిగి తెచ్చుకుని శవాన్ని తగలబెట్టు" అని ముగించాడు ముస లాడు తన అనుభవాన్ని తమ జీవిత సారాంశాన్ని.

రాముడు కళ్లల్లో కన్నీళ్లు లేవు. నిప్పు రవ్వలు చెలరేగుతున్నాయి. ఏరు దాటి మకాం దగ్గరికి వచ్చాడు. మకాంలో ఉన్న కత్తిని బిగి పిడికిట్లో బిగించాడు. కమలమ్మ లోగిలి వైపు పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ రాముడు పరశు రాముడిలా నడిచాడు. ముందు మండువా లోకి అడుగుపెట్టి 'అమ్మగారూ' అని అరిచాడు. మండువాలు రెండూ ఆ పిలు పుతో ప్రతిధ్వనించాయి. ఆ పిలుపుకి కమలమ్మ అదిరిపడింది. మంచం మీంచి లేచి పడక గది దాటే లోపునే ఆమె పిలవకుండానే రాముడు ఆమె పడగ్గది లోకి వచ్చి నిలబడ్డాడు.

ఆ క్షణంలో కమలమ్మ రాముడిలో యముణ్ణి చూసింది. వాడి తీవ్రమయిన చూపులకి నిప్పులు చెరిగే ఉచ్ఛ్వాసనిశ్వా సలకు శరీరం ప్రతి అణువులోంచీ సెగలు కక్కుతున్న రౌద్రానికి, వాడి పిడికిలిలో బిగించి ఉన్న పదునైన కత్తికీ- కమలమ్మ అణువణువునా కంపించి పోయింది. నోట మాటరాలేదు. ఒణికి పోతూంది.

"ఏంవమ్మా!? నేను రాత్రి పట్నం ఎళ్లేనా? లోగిట్లో లేనూ? నీ రెండు వేల రూపాయిల గేదె కోసం నా పెళ్లాం పేనం బలిగొంటావా ? గేదె పోతే మళ్లీ సంతలో కొనుక్కుంటావమ్మా నువ్వు ... నేను పోతే నాలాంటి పాలేరుని నీ దగ్గరున్న డబ్బుతో కొనకుంటావమ్మా నువ్వు. కాని నా రత్తిని మళ్లీ నేను తెచ్చుకోగలనా? నా దగ్గర డబ్బులేదు. నీ దగ్గర డబ్బుతో

రత్తిని తెచ్చి నాకు ఇవ్వగలవా? నా పేనం ఇచ్చయినా నా రత్తిని నేను తెచ్చుకోగలనా? గొప్పింట్లో గేదె పానం కంటే, పేదోడి పెల్లాం పానం చవకమ్మా నీ దృష్టిలో... తప్పునీది కాదు, నా కండలు కరిగించి నీ ఏభై ఎకరాల కమతాన్ని అరవై ఎకరాలు సేసేను. అందుకే నీ కళ్లు డబ్బుతో పొరలు కమ్మేశాయి. నీ కళ్లు ఎలా తెరిపించాలో నాకు తెలుసు'' అని రాముడు చేతిలో ఉన్న కత్తిని ఒక్కసారి ఎగరేసి పట్టుకున్నాడు. కమలమ్మ కెవ్వున అరిచి "ఒరేయ్ నన్ను చంపకురా. ఇలా జరుగుతుందని నేను అనుకోలేదురా!" అంటూ దీనంగా చేతులు జోడించింది.

"ఛ ... నిన్ను చంపుతానను కున్నావా, అమ్మా అన్నం పెట్టే తల్లి మీద కత్తి ఎత్తేంత ఎదవని కాన్నేను. నిన్ను కన్నతల్లిగా చూసుకునేవోణ్ణి... కామించే బుద్ధి, ఆకికొంప కూల్చే బుద్ధి నీదమ్మా... నాకలాటియి సేతకాదు. నీకెలా బుద్ధి చెప్పాలో నాకు తెలుసు." అని రాముడు విసురుగా బైటికి వెళ్లిపోయాడు.

కమలమ్మకు నిజాంగానే ఫిట్సొచ్చి పడిపోయింది. రాముడు తిన్నగ మకాం దగ్గరికి వెళ్లాడు. చుట్టూ తను పెంచిన చెరుకు తోటా అరటితోటా కనబడ్డాయి. కత్తి ఎత్తి చేతులు నెప్పులు పుట్టేదాకా చెరుకుతోటనూ, అరటి తోటనూ కసిగా నరికేశాడు. నరుకుతున్న ప్రతి చెరుగ్గడ తనూ తన కత్తికి ఎరౌతున్న ప్రతి అరటి బోందలోనూ కమలమ్మ రూపాన్ని చూశాడు. కమలమ్మ ఇనప్పెట్టెను చూశాడు. వాడిని ఎవరూ అడ్డుకోలేదు. చీకటి పడేదాకా నరికేడు. చివరికి చీకట్లో కలిసిపోయేడు. మర్నాటినుంచీ రాముడు కోగిట్లో కాని, మకాం దగ్గర కానీ, గూడెంలో కానీ ఎవ్వరికీ కనిపించలేదు.



## 19

ఆచారి తన మందుల పెట్టె పట్టుకొని కమలమ్మ ఇంట్లోకి, కమలమ్మకే వైద్యం చెయ్యడానికి, అడుగుపెట్టాడు. కమలమ్మకు తెలివి వస్తోంది...పోతోంది... తెలివి వచ్చినప్పుడు 'రాముడు..రాముడు కత్తి...' అని వణికిపోయి మళ్లీ స్పృహ కోల్పోతూంది. చుక్కమ్మ వెంట కమలమ్మ పడకగదిలోకి అడుగు పెట్టిన ఆచారి పరిస్థితిని గ్రహించాడు. చుక్కమ్మను బైటికి వెళ్లమని తలుపులు మూసేశాడు. కమలమ్మ కనురెప్పల్నీ, నాడినీ, ఛాతీని, వెన్నునూ తృప్తిగా శల్యపరీక్ష చేశాడు. రోగం అంతు దొరికిందని ఆనందించాడు. ఏవో మందు పొట్లాలు తలుపు తీసి చుక్కమ్మ చేతికి ఇచ్చాడు. ఒక రకం తైలం స్వయంగా తనే చేతులో పోసుకొని కమలమ్మ కాళ్లకు, చేతులకూ, మర్దనా చేసి, 'ఇలా మర్దనా చెయ్యాలి... ఈ తైలం' అని చుక్కమ్మకు నవ్వుతూ పురమాయించి ముందు

మండువాలోకి వెళ్లాడు.

అప్పటికే చీకటి పడింది. ముందు మండువాలో ఇంకా దీపం పెట్టలేదు. చీకట్లో రాముడు చేసిన అఘాయిత్యాన్ని చర్చించుకుంటూ, వాడు పారిపోయిన ఉదంతానికి ఉబలాటపడ్తూ ప్రెసిడెంటూ మునసబూ ఆచారి రాక కోసం ఎదురు చూస్తున్నారు. ఆచారి తెర ఒత్తిగించుకుని బైటికి రాగానే మునసబూ, ప్రెసిడెంటూ రెండడుగులు ఎదురెళ్లి 'ఏమిటి జబ్బు?' అన్నారు ఆత్రంగా. ఆచారి నవ్వి 'ఇలాంటి ముప్పేట వయసులో, భర్త లేకపోతే సాధారణంగా ఆడవాళ్లకి వచ్చే జబ్బు. ఆవిడకి రావాల్సిన జబ్బూ, మనకి కావాల్సిన జబ్బు!" అన్నాడు.

"అయితే, భర్తలాంటోడు కుదిరితే జబ్బు కుదిరి పోతదా?" అన్నాడు మునసబు.

"అన్నమా పేగా! కాకపోతే రాముడు వచ్చినా, ఎదిరించి నిలబడతానని ధైర్యం చెప్పేవాడు కూడా కావాలి!" అన్నాడు ఆచారి.

ప్రెసిడెంటు ఒక్క క్షణం ఆలోచించి "సర్లెండి. ఆ గొడవేదో నేను చూసుకుంటాను. మీరిద్దరూ వెళ్లి రాముడి కోసం పోలీసు రిపోర్టివ్వండి" అన్నాడు.

మునసబు "సరే. ఈయాల డ్యూటీ నువ్వేసుకో. రేపు రాత్రి డ్యూటీ నేనేసుకుంటాను. పదవయ్యా ఆచార్లూ" అని ఆచారిని వెంట బెట్టుకొని వెళ్లిపోయాడు.

ప్రెసిడెంటు తొలిసారిగా మధ్య మండువా గుమ్మానికున్న తెర ఒత్తిగించాడు. కమలమ్మ పడగ్గదిలోకి అడుగు పెట్టాడు... మర్నాడు మునసబు ...పనులు ఆచార్లు... చాలా కాలంగా పొంచి ఉన్న ముగ్గురు గుంటనక్కలకి చివరకు కమలమ్మ, కమలమ్మ కమతం గుప్పిట్లో చిక్కాయి.

"కృష్ణుడిలా బ్రతకరా అని చిలక్కి చెప్పినట్టు చెప్తే విన్నాడు కాదు రాముడు. రాముడిలాగే బతుకుతానని అడవుల పాలై పోయాడు. కమలమ్మ, కమలమ్మ కమతం మన పాలయ్యింది. మధ్య గుమ్మం తెర వాలిపోయింది." అన్నాడు ఆచారి. ●



Edited, Printed and Published by Ramoji Rao Ch for Vasundhara Publications Printed at Colorama Offset Printers, Hyderabad, Office Address : CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004



# కమలమ్మ కమతం

గ్రామీణ జీవన ప్రవాహంలోని ఒక భాగాన్ని ఆసక్తికరంగా వర్ణించి, చివరి వరకూ వదలకుండా చదివించే తాజా నవల 'కమలమ్మ కమతం'. క్షణికోద్రేకాలకు లొంగి విజ్ఞతను విస్మరించి తనను తల్లిగా గౌరవించిన పాలేరును దూరం చేసుకుని రాబందుల వంటి గ్రామ రాజకీయవేత్తలకు బలయిపోయిన కమలమ్మ జీవనరాగం ఈ నవల.

తొలిరూపంలో చిన్న కథగా ప్రశంసలు పొంది, ఇప్పుడు నవలగా విస్తరించిన అపూర్వ కథాకథనం 'కమలమ్మ కమతం'.



